# చతుర

ఏప్రిల్ 78
125 పైసలు



# చతుర

ఏప్రిల్ 1978

సంపుటి : 1 సంచిక : 3

## ఈనెల సమగ్ర నవల

జీవితంలో ప్రతి ఒక్కరూ అన్వేషించేది సుఖం కోసం, శాంతి కోసం, వాటిని సాధించి పెట్టగల సౌకర్యాల కోసమే. ఇవన్నీ సమకూరిన జీవితం స్వర్గతుల్యమనే అందరూ నమ్ముతారు. కానీ, వాస్తవ జీవితంలో

# ఏది స్వర్గం?

అనుకూలవతియైన భార్య, క్రమశిక్షణలో పెరిగిన బిడ్డలు, చాలీ చాలనిదే అయినా ఫరవాలేదనిపించే ఆదాయం ఉన్న ధనంజయరావు ఏ స్వర్గాన్ని ఆశించి మరే స్వర్గధామాన్ని ఎందుకు, ఎలా నాశనం చేసుకున్నాడు?

## గోవిందరాజు సీతాదేవి

రచించిన మధ్య తరగతి కుటుంబ జీవిత చిత్రం ఈ నవల.

## ఈ నెల ముఖపత్రం

అసంఖ్యాకంగా ఉన్న తెలుగు దేశపు దేవాలయాలపై విరివిగా కానవచ్చే ఆనాటి నృత్య శిల్పానికి ఈనాటి చిత్ర కారుడిచ్చిన వర్ణరూపం. శ్రీ యం.ఆర్.యన్. ప్రసాదరావు ప్రతికృతి.

## రెండవ కవరు

ఈనాటి హైదరాబాద్ నగరా విర్భావాని కానాడు **పునాదులు** వేసిన ప్రేమికులు **భాగ్యమతి, కులీ కుతుబ్‌షాల తొలి** సమావేశం. నిజాం సంస్థానపు **పూర్వ** కళాకారుని వర్ణ చిత్రానికి ప్రతికృతి.

## మూడవ కవరు

భారత దేశంలో బహు అరుదుగా కానవచ్చే 'సూర్య' విగ్రహం.
ఉత్తర భారతంలోని సుప్రసిద్ధ కోణార్క్ ఆలయంలోని అపురూప శిల్పం.

## నాలుగవ కవరు

బంగారపు వలయంలో చిగించిన రెండు వందలేండ్ల నాటి పానపాత్ర. ఆనాటి కళాకారుల నైపుణ్యానికి పరాకాష్టగా ప్రఖ్యాతమైన పోలిష్ శిల్పి జాన్ మార్టిన్ సృష్టి.

చతురమ
ఈనాడు కాంపౌండ్
సోమాజిగూడ
హైదరాబాద్–500004



# గడుసు పెళ్ళాం

పదిహేడేళ్ళ క్రితం వరకూ సార్జంట్ జార్జిబెల్ అమెరికా వైమానిక దళంలో చాలా విశ్వాసపాత్రుడి క్రింద లెక్క. అతను రెండో ప్రపంచ యుద్ధంలో, కొరియా యుద్ధంలో కూడా పాల్గొన్నాడు. ఎవరికైనా డబ్బివ్వాల్సి వచ్చినప్పుడు చెక్కు రాసిస్తే అది భద్రంగా బ్యాంకు నించి తిరిగొచ్చేది. అదేమంటే అతని అకౌంటులో డబ్బు పైసా కూడా లేదు అని బ్యాంకు వారి సమాధానం. ఇలా కొన్నిసార్లు జరిగాక, బెల్ కావాలనే అందర్నీ మోసం చేస్తున్నాడని, నిక్షేపంలాంటి ఉద్యోగం కాస్తా ఊడబీకి ఇంటికి పంపించేశారు అధికారులు. అసలు జరిగిందేమిటంటే, ఇతనికి భార్యతో కలసి బ్యాంకులో జాయింట్ అకౌంట్ ఉంది. ఆమె, ఇతను వేసిన డబ్బుని ఎప్పటికప్పుడు అణా పైసల్తో సహా డ్రా చేసి పూరుకునేది. ఈ విషయం తెలుసుకున్నాక పెళ్ళానికి విడాకులిచ్చేసి నేను అమాయకుణ్ణి మొర్రో, ఇదంతా నా పెళ్ళాం పీనుగ చేసిందని.వైమానిక దళం అధికార్లకి ఎంత మొరపెట్టుకున్నా వాళ్ళు పట్టించుకోలేదు.

జిమ్మీ కార్టర్ అమెరికా అధ్యక్షుడు అయిం తర్వాత సార్జంటుకి కొంత ఆశ కలిగింది. 1941లో ఇద్దరూ ఒకే కాలేజీలో చదువుకున్నారు. ఈ సంగతి తెలియపరుస్తూ, తన కష్టాలన్నీ కార్టర్‌కి విన్నవించుకున్నాడు సార్జంట్ బెల్. కార్టర్ వెంటనే మళ్ళీ దర్యాప్తు జరిపించవల్సిందిగా ఆదేశించాడు. దర్యాప్తులో అసలు రహస్యం బయటపడింది. 17 సంవత్సరాల తర్వాత మళ్ళీ సార్జంట్ బెల్‌ని ఉద్యోగంలోకి తీసుకున్నారు.

# చేప సాక్ష్యం

చచ్చిపోయిన చేప కూడా హంతకుణ్ణి పట్టిస్తుందంటే నమ్మక తప్పదిప్పుడు.

1935లో ఆస్ట్రేలియాలోని సిడ్నీ నగర శివార్లలో నివసించే ఓ బాక్సింగ్ ఛాంపియన్, అకస్మాత్తుగా అంతర్ధానమయ్యాడు. కొన్నాళ్ళు చూసి, అతని బంధువులు పోలీసులకి రిపోర్టిచ్చారు. పోలీసులు విశ్వప్రయత్నం చేసినా ఆచూకీ దొరకలేదు. ఇదిలా ఉండగా నగర శివార్లలో వుండే ఓ జాలరి వలలో బ్రహ్మాండమైన షార్కు చేప చిక్కుకుంది.



సైజులో అసాధారణంగా వున్న ఆ చేపని అతను జంతు ప్రదర్శనశాల కిచ్చాడు. దాన్ని చూసేందుకు జనం విరగబడ్డారు. అలా జనంచూస్తూండగానే రెండు మూడు రోజులతర్వాత చేప నోట్లోంచి మనిషి చెయ్యి ఒకటి బయటికి పొడుచు కొచ్చింది. మ్యూజియం కాపలాదారు, చేప నోట్లోంచి చేతిని బయటికి లాగే శాడు. చేతి మీద వున్న పచ్చబొట్టు మూలంగా, అది అదృశ్యమై పోయిన బాక్సింగ్ ఛాంపియన్ తాలూకు చెయ్యే నని తెలిసిపోయింది.

ఇక పోలీసులు, సదరు బాక్సర్‌కి సంబంధించిన చుట్టపక్కాలు, స్నేహి తులు, ప్రత్యర్థులు అందరి జాబితా తయారు చేసి మాయమై పోవడానికి మూడు నాలుగు రోజుల ముందు అతన్ని కలిసిన వారందరి మీదా గట్టి నిఘా ఏర్పాటు చేశారు. దాంతో ఎప్పటికైనా పోలీసులు పన్నిన వ్యూహంలో చిక్కు కోవడం తథ్యం అని భయపడిన హంతకుడు తనంతట తనే వచ్చి పోలీసు లకి లొంగిపోయాడు. హంతకుడు కూడా బాక్సింగ్ ఛాంపియనే. కేవలం అసూయ మూలంగా మరో ఇద్దరు స్నేహితులతో కలిసి, హత్యచేసి, శవాన్ని ముక్కలు చేసి, ఓ ట్రంకు పెట్టెలో పెట్టి సము ద్రంలో విసిరేశాడు. అయితే, ఒక చెయ్యి మాత్రం ఆ పెట్టెలో పట్టకపోయే సరికి దాన్ని విడిగా సముద్రంలో పడే శాడు. సరిగ్గా ఆ చేతిని ఈ షార్క్ చేప మింగడం, అది జాలరికి చిక్క డంతో తీగ లాగకుండానే డొంకంతా కదిలి గుట్టురట్టయింది.

# ఓడిపోయిన మృత్యువు




సెల్వమ్ అనే 35 ఏళ్ళ వ్యక్తి కారైకు డిలో వాచ్‌మన్‌గా పని చేస్తున్నాడు.

అతను పరుగుపందెంలో ఘటికుడు. తోటి వుద్యోగులతో కలిసి, నవంబరు 15 తారీకున ఢిల్లీలో జరిగే అంతర్ రైల్వే ఆటల పోటీల్లో పాల్గొనేందుకు మద్రాసు నుంచీ గ్రాండ్ ట్రంక్ ఎక్స్ ప్రెస్‌లో ఢిల్లీ బయల్దేరాడు. కొంతసేపయింతర్వాత సెల్వామ్ కక్కసుదొడ్లోకి వెళ్ళాడు. అంతలోనే రైలు అటూఇటూ భయంకరంగా ఊగిపోసాగింది. ఆ కుదుపుకి కాళ్ళకింద గచ్చు పెళ్లిచ్చి, సెల్వామ్ కాలు ఆరంగుళాల లోతున ఇరుక్కుపోయింది. ఆ షాక్ నుంచీ తేరుకునే లోగానే కక్కసుదొడ్డి తలుపుకాస్తా విరిగి, ఇరుక్కుపోయిన కాలుమీద దభీమని పడింది. గాజుకిటికీ అద్దాలు పగిలి, అద్దంపెంకులు ఒళ్ళంతా గుచ్చుకున్నై. భయంతో కేకలు పెట్టాడు. వినే నాథుడెవరు? రైలుకి యాక్సిడెంటయిందని అప్పటికి తెలుసుకోగలిగాడు సెల్వామ్. గంట తర్వాత ఓ మెడికల్ ఆఫీసర్ వచ్చి, పగిలిన కిటికీలోంచే, బాధ తగ్గేందుకు సెల్వామ్‌కి ఇంజక్షనిచ్చాడు. ఆ తర్వాత కొంతమంది పనివాళ్ళు వెల్డింగ్ చేసే పరికరంతో కిటికీవూచల్ని కరిగించి, నానాయాతనాపడి సెల్వామ్‌ని బయటికి లాగారు, చావుతప్పి, కాలులొట్టబోయి, సెల్వామ్ బయటపడ్డాడు.

# మేకాభిమానులు

**శాండో** చిన్నప్పదేవర్ సినిమాల్లో జంతువులతో నటింప జెయ్యటంలో ఘనత వహించాడు. ఓ సారి ఆయన 'తాయిల్లా కుళందై' అనే చిత్రం షూటింగ్ కి వెళ్తూంటే ఓ కుర్రాడు తన పెంపుడు మేకని "రంగా! ఇలారా." అని పిలవడం, వెంటనే ఆ మేక పరుగెత్తుకుంటూ అతని దగ్గరికి రావడం గమనించాడు. వెంటనే ఆ కుర్రాణ్ణి పిల్చి, "ఏరా అబ్బాయీ! నీ మేక నువ్వు చెప్పినట్లల్లా వింటుందా?" అని అడిగాడు. "సిత్తం బాబయ్యా! కావాలంటే సూసుకోండి మరి'' అన్నాడా కుర్రాడు. దేవర్ తన డ్రైవరుతో ఆ మేకని దూరంగా పట్టుకు పొమ్మనాడు. కుర్రాడు "రంగా, ఇలా రా.'' అని పిలవగానే, మేక



డ్రైవర్ని వదిలించుకుని వచ్చేసింది. 'పో' అనగానే వెళ్ళిపోయింది. ఇంకేం... దేవర్‌గారు వెంటనే ఆ మేకని సినిమాల్లో బుక్ చేసుకున్నాడు. రంగా అనే పేరును 'రాము'గా మార్చాడు. ఎందుకంటే, 'రాము' బాగా అచ్చొచ్చిన పేరుట. ఆయన తీసిన 'హాథీ మేరీ సాథీ'లో ఏనుగు పేరురామూనే! మొదట్లో 'రామూ' అని పిలిస్తే మేకగారు ఉలకలేదు, పలకలేదు. మెల్లిగా రామూ పేరుకి అలవాటయిపోయి, రంగాని మర్చిపోయింది.

దేశం నలుమూలల నుండీ ఎంతో మంది మేకగారి అభిమానులు మా అభి

మాన 'హీరో మేక' గార్ని చూడాలనీ, అడ్రస్ చెప్పమనీ ఉత్తరాలు రాస్తున్నారట. దేవర్ త్వరలో మేకగారి అడ్రస్‌ని అభిమానుల సౌకర్యార్థం పేపర్లో ప్రకటిస్తారుట. అంటే, ఈ మేకగారికి కూడా అభిమాన సంఘాలు ఏర్పడబోతున్నాయన్న మాటేగదా!

# పిచ్చివాళ్ళ స్వర్గం



బ్రిటన్‌లో 'ఎల్డెన్‌లీగ్' అనే ఒక వెర్రి వాళ్ళ సంఘం వుంది. వెర్రి అంటే ప్రాచీన సంప్రదాయపు వెర్రి అన్నమాట. వీళ్ళు ఆధునిక నాగరికతని సంపూర్ణంగా వ్యతిరేకిస్తారు. కనీసం రైలు, కారు వంటి ప్రయాణ సాధనాలని కూడా వాడక, గుర్రపు బగ్గీలోనే ప్రయాణం చేస్తారు. ఈసంఘంలో దాదాపు రెండున్నర లక్షల మంది సభ్యులున్నారు. ఈ మధ్యనే వీళ్ళంతా ఒక రైల్వే స్టేషన్‌లో సమావేశమయి, మద్యం సేవించి, గ్లాసుల్ని నేలకేసి కొట్టి ముక్కలు చేశారు. అదేమిటంటే, రష్యా రాజైన రెండవ నికోలాస్ ఇలానే చేసేవాడనీ, ఇది సంప్రదాయమనీ వాళ్ల వాదన. వీళ్లు విచిత్రమైన ప్రపంచ పటాన్ని తయారు చేశారు. మాములు మ్యాప్‌కీ, దానికీ సంబంధమే లేదు. వాళ్ల నమ్మకం ప్రకారం భూమి బల్లపరుపుగానే వుందిట! వర్ణ భేదాలతో, రాచరికంతో కూడిన ఫ్యూడల్ వ్యవస్థ మాత్రమే ప్రజలకి ఆనంద దాయకమైనదని వీళ్లవాదన, నమ్మకం. ఈ మధ్యనే వీళ్ళొక మానిఫెస్టో వెలువరించారు. దాని ప్రకారం, తమకి గనక అధికారం వస్తే సంపూర్తిగా ఫ్యూడలిజాన్ని పునరుద్ధరిస్తారుట. హౌస్ ఆఫ్ కామన్స్‌ని రద్దు చేస్తారుట. ఒక రాజ్య పౌరుడు పరరాష్ట్ర పాలనక్రిందవున్న భూభాగంలోకిపోవడం నేరం కావడంవల్ల, పాస్‌పోర్టు ఆఫీసుని రద్దుచేసి పారేస్తారుట. ఈ వెర్రికి పరాకాష్ఠగా, ఈ మధ్యనే వీళ్ళొక విచిత్రమైన తీర్మానం చేశారు. బ్రిటన్, అమెరికా కలిసిపోయినట్లు అమెరికా ప్రస్తుతం బ్రిటన్ అధికారం క్రింద వున్నట్లు ఊహించుకుని, కలలుగని, అదే నిజమనుకుంటూ ఆ విలీనకరణ సందర్భాన్ని పురస్కరించుకుని పెద్ద ఉత్సవంజరుపుకొన్నారు అమెరికాబ్రిటన్ పాలన క్రిందకి వస్తున్నదని ప్రకటనల్ని ప్రచురించి, ఒక కాపీని, బ్రిటన్‌లోని

అమెరికా రాయబారికి కూడా పంపించా రుట. వీళ్లది ఏ లోకం సార్ ?

# రంగుల వర్షం



ఇటీవల అహమ్మదాబాదు సమీపంలోని గోమటిపూర్, సరసాపూర్ జిల్లాల్లో నల్లటివర్షం కురిసింది. ప్రజలంతా ఇది దేవుడిశాపం అని భయపడిపోయారు. 1908, 1911 సంవత్సరాల్లోకూడా కేప్ టౌన్‌లో నల్లటివర్షం కురిసినట్లు ఆధారా లున్నాయి. 1934లో ఉత్తరప్రదేశ్‌లోని అనేకపట్టణాల్లో, పల్లెల్లో, రక్తవర్షం కురిసింది. అంటే రక్తంలాఉండే ఎర్రటి నీరు కురిసిందన్నమాట. "ప్రపంచంలో పాపం పెరిగిపోయిందర్రా! అందుకే ఈ విలయం. ప్రపంచానికేదో పోగాలందాపు రించింది'' అని అంతా భయభ్రాంతు లైనారు. 1952లో బెంగాల్‌లో కూడా ఎర్రటివర్షం కురిసింది. బజార్లన్నీ రక్తం లాంటి ఎర్రటినీటితో నిండిపోయినాయి. అలాగే 1890లోనూ, 1917లో కూడా 'లొకారో'లో రక్త వర్షం కురిసింది! అసలీ రంగుల వర్షాలకుగల శాస్త్రీయ మైన రహస్యం ఏమిటి అని పరిశోధన జరిగింది. వేసవిలో ఉష్ణోగ్రత ఎక్కు వుగా ఉన్నప్పుడునీరు ఆవిరై పైకెత్తుంది. ఆ ఆవిరి వాతావరణంలోని కొన్ని రంగుల రాతిధూళితో కలవడంవల్ల రంగుల వర్షాలు కురుస్తాయన్న మాట. స్పెయిన్‌లోని 'రియోటింటో' నదిలో నీరు రక్తం లాగా వుండటానికి కారణం, ఆ నదిలోని ఇసుక రేణువులు ఎర్రగా వుండటమే. లోకార్డోలో దగ్గరున్న అగ్ని పర్వతానికి సంబంధించిన ఎర్రటి ఇసుక రేణువులు నీటి ఆవిరితో కలవడంవల్ల అక్కడ ఎర్రటి వర్షం కురిసింది. గడ్డి విపరీతంగా కాలిపోయి, ఆ పొగ మసి అంతా వాతావరణంలో ఆవరించుకుని, అది నీటితో కలవడం మూలంగా కింబ రేలీ, కేప్‌టేన్‌లలో నల్లటి వర్షం కురి సింది. ఒక్కొక్కప్పుడు ఆవిరయ్యే నీటితోబాటు చెరువుల్లోని కప్పలు చేపలు కూడా పైకివెళ్ళి, వర్షంతోబాటు కింద పడుతుంటాయి. అందుకే అప్పుడప్పుడు కప్పల వర్షం, చేపల వర్షం కూడా కురుస్తుంటుంది.





# ఏది స్వర్గం?

గోవిందరాజు
సీతాదేవి

ధనంజయరావుగారి రెండుగదుల అద్దెయింట్లో పెరటివైపున కాస్త ఖాళీ స్థలం వుంది. కాస్త స్థలంలోనూ రెండు నిత్యమల్లె చెట్లు, రెండు గులాబి చెట్లు మధ్యన మట్టి కుండీలో తులసి గుమ్మటంలా యెదిగివుంది. ఆ తులసి చుట్టూ ముగ్గులుపెట్టి సంధ్యాదీపం వెలిగించి నమస్కరించింది ధనంజయరావు భార్య అహల్య.

రెండు గదుల్లోనూ కరెంటు దీపాలు వెలుగుతూన్నాయి. వీధి వాకిలి బార్లా తెరిచి వుంది. ఆఖరి కొడుకు మధు వీధిలో ఆడుతూన్నవాడల్లా ఆఫీసునించి వస్తూన్న తండ్రిని చూసి బిగ్గరగా అరిచాడు.

"అమ్మా నాన్నా రొస్తూన్నారు"

కొడుకు పిలుపుకి అహల్య కళ్ళు తెరిచింది. ఓ తులసీదళం తుంచి కళ్ళకి అద్దుకుని మరోసారి తులసికి నమస్కరించి వెనక్కి తిరిగింది. ధనంజయరావు లోపలికి వచ్చేశాడు. పెరటి గడపలో నిల్చుని తులసిచుట్టూ పెట్టిన ముగ్గులనీ, వెలుగుతూన్న దీపారాధననీ, భార్య ముఖాన్నీ మార్చిమార్చి చూశాడు.

"ఏమిటలా కొత్తగా చూస్తున్నారు"

"యెన్నాళ్ళుగా చూస్తున్నా నీ ముఖం సరికొత్తగానే కన్పిస్తూ వుంటుందిలే"

"సరేగానీ యివాళ యింత ఆలశ్యం అయిందేం"

ధనంజయరావు భార్యమాట విని పించుకోలేదు. అహల్య కట్టుకున్న సాదా చీరెనీ, నగలులేని మెడనీ చూసి తులసి వైపు తలతిప్పాడు.

"ఈ తులసిని దాదాపు యిరవై యేళ్ళుగా పూజిస్తున్నావు కదా! నీకు కల్సివచ్చిందేముంది అహల్యా ?"

అహల్య- చేతిలో వున్న తులసీదళం వైపు ఓమారు చూసింది.

"ఈ దళంకున్న విలువా, పవిత్రతా మరిదేనికుందండీ"

ధనంజయరావు భార్యవైపు చూస్తూ నవ్వాడు.

ధనంజయరావు బట్టలు మార్చుకుని కాళ్ళూ చేతులూ కడుక్కుని వంటగదిలోకి నడిచాడు. అహల్య కాఫీగ్లాసు అందించింది.

"మాధురి కాలేజీనించి యింకా యింటికి రాలేదూ?" కాఫీ తాగుతూ అడిగాడు.

"లేదు. యివాళ ఓ ఫ్రెండ్ దగ్గరకి వెళ్ళి నోట్సు రాసుకు వస్తానని" చెప్పింది.

"ఈ సంవత్సరంతో మాధురి బియ్యే అయిపోతుంది. ఎం. ఏ. చదివిద్దామా"

"వద్దు. పెళ్ళిచేసి పంపేద్దాం"

"అప్పుడే పెళ్ళా! నిండా పద్ధెనిమిది దాటలేదు"

"మీరు మర్చిపోయారేమోగానీ నాకు ఆ వయస్సుకే మాధురి పుట్టింది."

"ఔను కదూ !" అన్నాడు జరిగి పోయిన రోజులని గుర్తు తెచ్చుకుంటూ.

అహల్య వంట చేసుకుంటూనే భర్తతో కబుర్లు చెప్తోంది. ధనంజయరావు ఓ పెద్ద కంపెనీలో చిన్న గుమాస్తా. ఈ యిరవైయేళ్ళలోనూ జీతం చెప్పుకో తగ్గంత పెరగలేదు. కానీ కుటుంబ

ఖర్చులు పెరిగాయి. మాధురి కాలేజీ చదువు కాస్త భారంగానే అనిపిస్తోంది. మాధురి తర్వాత అబ్బాయి జనార్ధన్. హైస్కూల్లో పదో తరగతి చదువుతున్నాడు. పధ్నాలుగో సంవత్సరం జరుగుతోంది. మధుకి పదేళ్ళు ఐదో తరగతిలోకి వచ్చాడు. ఈ ముగ్గురు పిల్లలంటే భార్యాభర్తలిద్దరికీ ప్రాణం. ధనంజయరావుకి మాధురి అంటే మరీ ప్రేమ. అందంగా హుషారుగా ఉండి క్లాసులో ఫస్ట్‌గా వస్తూ వుంటుంది. మాధురికీ తండ్రిఅంటే గౌరవంఎక్కువ. సిటీ బస్‌లో వెడితే ఖర్చని కాలేజీకి సైకిల్ మీద వెడుతుంది. బట్టలు కూడా సామాన్యమైనవే చాలమ్మా అంటుంది. కూతుర్ని చూసి తల్లిదండ్రులు మురిసిపోతూ వుంటారు.

"నాకు ఈ జీవితంలో అన్నీ ఉన్నాయి ఒక్క డబ్బు తప్ప. అది కూడా సమృద్ధిగా వుంటే అహల్యనీ పిల్లలనీ యెంత సుఖపెట్టగలిగే వాడినో" అని అప్పుడప్పుడూ అసంతృప్తి చెందుతూ వుంటాడు ధనంజయరావు. జీతంతప్ప మరేవిధానా డబ్బు సంపాదించే శక్తి తనకి లేదు. ఏదైనా అవకాశం వుందా! అని అప్పుడప్పుడూ ఆలోచిస్తూ వుంటాడు.

జనార్ధన్ క్రికెట్ ఆడి యిల్లు చేరాడు. మాధురి కూడా వచ్చేసింది. సైకిల్ లోపల పెడుతున్న కూతుర్ని చూస్తూ—

"తమ్ముడిని లోపల పెట్టమని చెప్పమ్మా" అన్నాడు.

"ఫర్లేదులెండి నాన్నారూ"

జనార్ధన్ చప్పున వచ్చి అక్క చేతిలోని సైకిల్ తను తీసుకున్నాడు.

"అహల్యా' మాధురి వచ్చింది. కాస్త వేడి కాఫీ యివ్వు" కేక పెట్టాడు.

"యిప్పుడు కాఫీ వద్దు నాన్నారూ. ఏకంగా భోజనం చేసేస్తాను"

"ప్రొద్దుననగా యిల్లు వదిలి వెళ్లావు. ముఖం చూడు ఎంత అలసటగా వుందో. ముఖం కడుక్కుని కాస్త వేడి కాఫీ తాగమ్మా. ఓ గంట తర్వాత భోజనం చేద్దాంలే"

మాధురి యింకేం మాట్లాడకుండా బాత్‌రూములోకి వెళ్ళింది. ముఖం కాళ్లూ చేతులూ కడుక్కువచ్చేసరికి తల్లి కాఫీ అందిచ్చింది. పీట వాల్చుకుని కూర్చుని కాఫీ తాగుతోంది మాధురి. జనార్ధన్, మధూ పుస్తకాలు తీసుకుని చదువుకుంటూ తెలియనివి తండ్రిని అడిగి తెల్సుకుంటున్నారు. మాధురి కూడా తండ్రిని అడుగుతుంది తెలియనివి. ధనంజయరావు యిలా పిల్లలకి చదువు చెప్తూ ఎనిమిది గంటలయేవరకూ కూర్చుంటాడు. ఆ తర్వాత అహల్య అందరికీ వడ్డించి భోజనానికి పిలుస్తుంది. తల్లి పిలుపుకోసం యెదురు చూస్తున్న మధు టక్కున పుస్తకం మూసేసి వళ్ళు విరుచుకుంటూ లేచి వెళ్ళి తన పళ్ళెం ముందు కూర్చుంటాడు. ధనంజయరావు భోజనం చేస్తూ భార్య చెప్పే ఇరుగు పొరుగు కబుర్లనీ, పిల్లలు చెప్పే స్కూలు కబుర్లనీ వింటూవుంటాడు.



# 2

జనార్దన్, మధూ స్కూలుకి వెళ్ళారు. మాధురి కాలేజీకి వెళ్ళింది. ధనంజయ రావు ఆఫీసుకి వెళ్ళాడు. అహల్య పను లన్నీ పూర్తి చేసుకుని భోజనం చేసింది.

"వదినగారూ" అంటూ నాంచారమ్మ వచ్చింది. నాంచారమ్మ అహల్యకి వున్న యేకైక మిత్రురాలు. నాలుగిళ్ళ అవతల వుంటుంది. ఓ పేరంటంలో మొదటిసారి యిద్దరికీ పరిచయం అయి అదే స్నేహంగా మారింది. నాంచారమ్మ మొగుడికి కాస్త పెద్ద వుద్యోగమే. జీతం కాక వెనక ఆస్తి కూడా వుంది. ఆర్థిక యిబ్బందులు లేవు. కానీ ఒకే ఒక్క దిగులు పిల్లలు లేరని. పిల్లలకోసం ముక్కోటి దేవతలకీ మొక్కారు. పూజలూ వ్రతాలూ చేశారు. ఊరూరా వెలుస్తూన్న బాబాలనీ, అమ్మగార్లనీ కల్సుకున్నారు. తమగోడు వెళ్ళబోసుకున్నారు. కానుకలు చెల్లించారు. పాదపూజలు చేశారు. పుణ్య క్షేత్రాలన్నీ దర్శించారు. నదులలో స్నానం చేశారు. ఫలితం కన్పించ లేదు. కొన్నాళ్ళు దిగులుపడ్డా తర్వాత తమకి తమే ధైర్యం తెచ్చుకున్నారు.

"మనకి సంతానప్రాప్తిలేదు. నచ్చిన బిడ్డని పెంచుకుంటే సరి" అనుకుని నిశ్చింతగా కాలం గడిపేస్తున్నారు. నాంచారమ్మకి అహల్య అన్నా, అహల్య పిల్లలన్నా అభిమానం. ఆఖరివాడు మధు బాబు అంటే మరీ ప్రాణం. అహల్య దగ్గ రకి వస్తూన్నప్పుడల్లా మధు కోసం యేదో ఒకటి తినటానికి తెస్తూవుంటుంది. మధు కూడా నాంచారమ్మ పెట్టినవి తింటూ అస్తమానం 'అత్తా' 'అత్తా' అంటూ కబుర్లు చెప్తాడు. ఈరోజు నాంచారమ్మ స్టీలు గిన్నెలో ఏదో పట్టుకువచ్చింది. అహల్య నాంచారమ్మకి చాపవేసి తనూ కూర్చుంది.

"ఏమిటి" అనడిగింది. నాంచారమ్మ అందించిన గిన్నె అందుకుని మూతతీసి చూడబోతూ "మధుబాబుకి జున్ను అంటే యిష్టం అని పాలు తెప్పించి వండితెచ్చాను. స్కూలునుండి రాగానే పెట్టండి."

"ఇదంతా వాడికి ఒక్కడికేనా"

"కాదు.. కానీ మధువాటా ఎక్కువ"

"భలేవారే" అహల్య లేచి గిన్నె లోపలపెట్టి వచ్చింది. నాంచారమ్మ కబుర్లుచెప్పి ఆఖరున అంది.

"వదినగారూ. ఒక్కమాట అడుగు తాను. మరేం అనుకోకండేం."

"ఏమిటది, అడగండి".

"మీకు యిద్దరు అబ్బాయిలున్నారుగా, ఇందులో మధుబాబుని నాకివ్వకూడదూ. పెంచుకుని మా ఆస్తిఅంతా యిచ్చేస్తాం. పెద్ద చదువు చదివిస్తాం."

అహల్య తెల్లబోయింది. రెండు నిము షాలు యేం మాట్లాడలేక పోయింది. "వదినగారూ మీవుద్దేశ్యం చెప్పినందుకు

నేనేం అనుకోను. కానీ మధుఅంటే మా వారికి ప్రాణం. నాకూ అంతేఅనుకోండి. మాకు ముగ్గురు పిల్లలనీ పెద్దపెద్ద చదువులు చదివించగల శక్తిలేదు నిజమే. కానీ మా పరిస్థితికి తగినట్లే వీళ్ళని పెద్ద చేస్తాం. మధుని మీకేకాదు కోటీశ్వరుడొచ్చి పెంపు యివ్వమన్నా యివ్వలేం. మరేం అనుకోకండి" అంది అహల్య.

నాంచారమ్మ ముఖం చిన్నబోయింది ఛీ. నేనిలా అడగడమే తప్పు. తీగె కుకాయ బరువుకాదని మర్చిపోయాను అనుకుంది.

"వదినగారూ మన్నించండి. మరెప్పుడూ యిలా అనను"

"అబ్బే అలా అనకండి. మీరు అడిగారు. నేనుచెప్పాను. ఇంక ఆ విషయం యిద్దరం మర్చిపోదాం" అహల్య యిలా అనేసరికి నాంచారమ్మ కళ్ళకో నీళ్ళు తిరిగాయి. "మీరెంత మంచివారు. ఇదే మరొకరైతే యెన్ని మాటలనేసేవాళ్ళో. వదినగారూ మన స్నేహం యికముందు కూడా యిలాగే సాగిపోవాలి" అంది.

"తప్పకుండా. వుండండి. కాస్త కాఫీ తెస్తాను."

అహల్య లేచివెళ్ళి కాఫీ కలిపి తెచ్చి యిచ్చింది. నాంచారమ్మ కాఫీ తాగుతూ కబుర్లు చెప్తోంది.

"వదినగారూ! యిల్లు కొనుక్కోవాలనుకుంటున్నాం. యెన్నాళ్ళున్నా అద్దె యిల్లు అద్దెయిల్లే కదండీ."

"నిజమే మరి. మనదంటూ ఓయిల్లు వుండాలి మరి."

"ఊరికి చివరగా కొత్తగా తయారైన కాలనీలో ఒకరు అమ్మేస్తాం అని బేరం పెట్టారట. రేపు వెళ్ళి చూసిపద్దాం అనుకుంటున్నాం. నచ్చితే కొనేస్తాం."

"మంచిది."

నాంచారమ్మ 'యింక వెళ్ళి వస్తా వదినగారూ' అనిచెప్పి వెళ్ళిపోయింది. అహల్య ఆవిడని పంపి వాకిలి గడపలో నిల్చుంది. ఎదురింటిలోకి యెవరో కొత్తగా అద్దెకి వచ్చినట్టున్నారు. లారీలోనించి సామాను దింపుతున్నారు. బీరువా, సోఫాసెట్లు, మంచాలూ, కుర్చీలూ వగైరా చూస్తూంటే జాగా డబ్బున్నవాళ్ళలానే అన్పిస్తోంది. ఇల్లాలు ఎవరో అదృష్టవంతురాలు అన్పించింది అహల్యకి.



## 3

సాయంకాలం ఆరు గంటలకే ధనంజయ రావు ఆఫీసునించి యింటికివచ్చాడు. వస్తూనే బట్టలైనా మార్చుకోకుండా కూతుర్ని పిలిచాడు.

"మాధురీ ! ఏం చేస్తున్నావమ్మా"

"ఇస్త్రీ చేసుకుంటూన్నాను నాన్నగారూ !" అంటూ చేసేపని ఆపివచ్చింది మాధురి.

"ఆఫీసునించి వస్తూంటే దారిలో పచ్చిమిరపకాయ బజ్జీలు కన్పించాయి. నీకిష్టమని రెండు తెచ్చాను" చేతిలోని

కాయితం పొట్లం అందించాడు.

"నాకేకాదు నాన్నారూ అమ్మకీ యిష్టమే,"

"అయితే అమ్మకి ఒకటి యిచ్చి నువ్వు ఒకటి తీసుకోమ్మా".

"మరి మీకో!"

"నాకా! నాకెందుకమ్మా!"

మాధురి తల్లికి ఒకటి యిచ్చి తను ఒకటి తీసుకుని అందులో సగం తుంచి తండ్రికి యిస్తూండగా అహల్య అలానే చేసింది.

"త్వరగా బట్టలు మార్చుకోండి. ఉప్మా చేశాను. తీసుకు వస్తూన్నాను"

"ఇవాళ యేమిటి విశేషం"

"ఏం లేదు. మాధురి యివాళ కాలేజీ నించి త్వరగా వచ్చింది. ఆకలిగా వుందమ్మా అంది"

"అదా సంగతి. వస్తున్నాను"

ధనంజయరావు బట్టలు మార్చుకుని వచ్చాడు. అహల్య టిఫిను ప్లేటు అందిచ్చింది. తినేసి టీ తాగేశాడు. ఇంతలో మధుబాబు ఆటలు చాలించి వచ్చాడు.

ఎదిరింట్లో అద్దెకి దిగిన భార్యాభర్తలు స్కూటర్ పైన యెక్కడికో షికారుకి వెడుతూన్నారు. ఆ అమ్మాయికి ఇరవై యేళ్ళు వుండచ్చు. నల్లగా కాకిలా వుంది. కానీ ఖరీదైన శిల్కు చీరె కట్టుకొని నగలు పెట్టుకుంది. అతనికి పాతిక పైనే వయస్సు వున్నట్లుంది. మంచి పర్సనాలిటీ, అందంగా కూడా వున్నాడు. ఖరీదైన బట్టలు వేసుకున్నాడు. భార్యతో అతను వెడుతూంటే పరిశీలనగా చూశాడు ధనంజయరావు.

"అహల్యా!"

"ఆ...ఏమిటి" అంటూ వచ్చింది అహల్య.

"ఆ యింట్లోకి వచ్చిన కొత్త జంట యెవరట"

"అతనికి గవర్నమెంటు వుద్యోగమట. ఎనిమిది వందలు జీతంట. ఆ అమ్మాయి రంగు పాత చింతపండే అయినా శ్రీమంతుడి యేకైక పుత్రిక. ఇతను పేద కుర్రాడనీ, తెలివితేటలున్నవాడనీ చూసి దగ్గరికితీసి పిల్లనిచ్చి పెళ్ళి చేసి మంచి వుద్యోగం యిప్పించి కావల్సిన సామానంతా కొని మరీ కూతుర్ని కాపురానికి పంపాడు ఆ పిల్ల తండ్రి."

"అదృష్టవంతుడన్న మాట!"

"అదృష్టం అతనిది కాదండీ! ఆ అమ్మాయిది. తనునల్లగా వున్నా డబ్బుకి ఆశపడి చేసుకున్నా ప్రేమగా చూస్తున్నాడు. ప్రతిరోజూ ఆఫీసునించి రాగానే స్కూటర్ మీద షికారు తిప్పుకొస్తాడు."

"కావచ్చు. నువ్వు యెన్ని అన్నా చెప్పు. ఈ ప్రపంచంలో హాయిగా ఆనందంగా బ్రతకాలంటే డబ్బు కావాలి. అదిలేని వాళ్ళకి ఆనందానికి అర్థం తెలియదు."

అహల్య మాట్లాడలేదు.

"అహల్యా మనిషి కష్టమైనా భరిస్తాడు కానీ ఆర్థిక యిబ్బంది భరించలేడు. నాకూ డబ్బుంటే అలా ఓ స్కూటర్ కొనగలను. నిన్ను ఆ అమ్మాయిలా తిప్పగలను. నిజం అవునా

కాదా!"

అహల్య భర్త ముఖంలోకి చూస్తూ నవ్వేసింది.

"అలా నవ్వకు. నాకు కోపంవస్తుంది. డబ్బుని సంపాదించటం చేతకాదని వెక్కిరించి నట్లుంటుందా నవ్వు"

"ఛీ... మీరలా ఎందుకనుకుంటారు. అయినా మనం ఇదివరకెన్నడూ డబ్బు లేదని బాధపడలేదు.. మనిద్దరం పెద్ద వాళ్ళం అయిపోతున్నాం. పిల్లలని పెంచి పెద్దచేయటం, వాళ్ళ అభివృద్ధీ ఇవే ఆలోచనలో ఉన్నాం. మరి ఇప్పుడు మీరాడబ్బు ఇచ్చే సుఖాలని గురించి ఎందుకు ఆలోచిస్తున్నారు?"

"ఔను"

"మరి మనం సుఖపడేది ఎప్పుడు' నీకు నాలుగు చీరెలుండవు. నాకు నాలుగు జతల బట్టలుండవు. పిల్లలకి సరేసరి. చూసిచూసి కొంటూ వుంటాం, అందరు మనలా లేరే. కొందరకి కష్టపడకుండా వేలకివేలు వస్తూవుంటాయి. అది వాళ్ళ అదృష్టం అనుకోవాలా, మన చేతకాని తనానికి విచారించాలా!"

"అదేం కాదు. ఉన్న దానితో తృప్తి పడటంలో మాత్రమే సుఖమూ, ఆనందమూ ఉంది"

"అయినా అందంత తేలికా! 'డబ్బు' సంపాదించే మార్గం గురించి పగలూ రాత్రీ ఆలోచిస్తూనే ఉన్నాను"

అహల్య చికాకుగా ముఖం పెట్టింది.

"అనవసరపు ఆలోచనలతో మనసు పాడు చేసుకోకండి. మనకి సంతోషం చాలు"

"ఊఁ......అలా కుదరదు. డబ్బు సంపాదించాల్సిందే ఆఁ...మన పక్కింటాయనలా ఆదివారం పేకాట ఆడి?"

"భలేవారు పేకాటలో డబ్బు సంపాదించి బాగుపడ్డ వాళ్ళని మీరెక్కడన్నా చూశారా"

"మరి వీళ్ళందరూ ఇన్నేసి గంటలు ఈ ఆట ఎందుకు ఆడతారంటావూ"

"అదో వ్యసనం. అంతే" ఆవేశంగా అంది అహల్య.

"అన్నట్లు నీకు చెప్పటం మరిచాను. యిల్లు ఖాళీ చేయమని ఇంటాయన చెప్పాడు. ఏదైనా మరో యిల్లు వెతుక్కోవాలి మనం కూడా"

"అలాగా! ఈ అద్దెలో ఇంత సౌకర్యంగా మనకి మరో యిల్లు యెక్కడ దొరుకుతుంది" దిగులుగా అంది.

అహల్య మనస్సులో పుట్టెడు దిగులు ఆవరించింది. ఇక్కడ యిరుగూ పొరుగూ అందరూ మంచివాళ్ళు. కొత్త చోటుకి వెడితే! ఎలా వుండాలో అసలు యిల్లు యెక్కడ దొరుకుతుందో! ఆలోచిస్తూ వుండిపోయింది.

అహల్య వంట గదిలోకి వెళ్ళింది. మాధురి యిస్త్రీ చేసుకున్న చీరెలన్నీ అల్మారాలో సర్ది భోజనానికి పిలిచింది. ఆటలు చాలించి మధు వచ్చాడు.

"నాన్నా రండి భోజనానికి" తండ్రి చెయ్యిపట్టుకుని లేవనెత్తాడు.

ధనంజయరావు కొడుకు చెయ్యి పట్టుకునే వంట గదిలోకి వచ్చి పళ్ళెం ముందు కూర్చున్నాడు. అహల్య దగ్గర కూర్చుని కబుర్లు చెప్తూ వడ్డిస్తోంది. వేడి

వేడిగా అన్నం కూరాతో భోజనం చేస్తూ డబ్బు యెక్కువ లేదని తప్ప నాకు సుఖానికి యేం తక్కువ అయింది. అనుకూలవతి అయిన భార్య, ముత్యాల్లాంటి పిల్లలు, స్వర్గం అంటే యిక్కడ కాక మరెక్కడైనా వుంటుందా! అనుకున్నాడు తృప్తిగా.

ఆదివారం. అహల్య పిల్లలు ముగ్గురికీ తలంటిపోసి తనూ స్నానం చేసి వంట కానిచ్చింది. ధనంజయరావు భోజనం చేసి ముందుగదిలో కూర్చున్నాడు. ఎదిరింట్లో అద్దెకి దిగిన ఆవిడ పేరు కోకిలమ్మ. కోకిలమ్మ మొగుడి పేరేమిటో తెలియదుగానీ యిరుగూ పొరుగూ అందరూ అతన్ని కోకిలమ్మ మొగుడనే అంటారు. ఈయన ప్రతిరోజూ సాయంకాలం ఆఫీసునించి వచ్చి భార్యని షికారుకు తీసుకువెళ్ళి తిరిగి వచ్చిన తర్వాత కోకిలమ్మ వంట మొదలు పెడుతుంది. ఈయన ధనంజయరావు యింటికి వచ్చి కాస్సేపు కూర్చుని కబుర్లు చెప్పి వెళ్ళిపోతూంటాడు. ఈయనకి ఆదివారం మాత్రం తీరుబడి వుండదు. ప్రతి ఆదివారం పదకొండు గంటలు కాగానే స్కూటర్ యెక్కి వెళ్ళిపోతూంటాడు.

ఎక్కడికబ్బా! అనుకున్నాడు ధనంజయరావు. అర్థం కాలేదు. భార్యని పిలిచి అడిగాడు. "ప్రతిరోజూ భార్యతో వెళ్ళేవాడు ఆదివారం మాత్రం ఆమెని వదిలి ఒక్కడే పోతాడేం" అని.

"గుర్రప్పందాలకి వెళ్ళటం అలవాటుట. కోకిలమ్మే చెప్పింది"

"గుర్రప్పందాలకే! డబ్బుపోతుందా! వస్తుందా!"

"ఏమో! డబ్బు వున్నవాళ్ళకి యీ పందాల్లో పోయినా ఫర్లేదు"

అహల్య యింకా యేదో అనబోతూ వుంది. యింతలో కోకిలమ్మ మొగుడు వచ్చాడు.

"రావుగారూ ఆదివారం కదండీ. యింట్లోనే వున్నారేం. ప్రోగ్రాం యేం లేదా!"

"నాకేం లేదుగానీ మీ ప్రోగ్రాం యేమిటి!"

"మామూలే. యింక వెళ్ళిపోతాను. గుర్రప్పందాలు వున్నాయంటే వెళ్ళి తీరాల్సిందే! యింట్లో కూర్చుంటే తోచి చావదండీ?"

"అదృష్టవంతులు వెళ్ళిరండి. అది సరేగానీ లాభంవస్తే చెప్పండి"

"ఓ యస్ తప్పకుండా. చెప్పటం కాదు కాఫీ కూడా యిప్పిస్తాను! టైము అయిపోతోంది. వస్తాను" కోకిలమ్మ మొగుడు యింట్లోకి వెళ్ళాడు. మరో పదినిమిషాల్లోనే తయారై స్కూటర్ తీసుకుని బైటికి వచ్చాడు. కోకిలమ్మ ముందుగా వెళ్ళి భర్తకి యెదురు వచ్చింది. అతను స్కూటర్ యెక్కి స్పీడుగా వెళ్ళిపోయాడు. కోకిలమ్మ లోపలికి వెళ్ళి తలుపు మూసుకుంది.

ఇదంతా పరీక్షగా చూస్తూన్నాడు ధనంజయరావు. స్కూటర్ మీద వెళ్ళే కోకిలమ్మ మొగుడు చాలా సమర్థుడులా తను చేతకానివాడిలా అన్పిస్తోంది. మనస్సు అంతా యేదో తెలియని అసూ




యతో తుక తుకా వుడికి పోతూ వుంది. ఈ బాధని భరించటం కష్టంగా వుంది. యెక్కడికి వెళ్ళాలి. ఏం చెయ్యాలి '

పక్క భాగంలో వున్న ముసలి దంపతులు ముస్తాబై యిల్లు తాళం వేసి తాళం చెవి యిస్తూ

"సినిమాకి పోయివస్తాంబాబూ తాళం చెవి అహల్యమ్మకి యివ్వండి. మీరు యింట్లోనించి యెక్కడికి వెళ్ళరుగా" అంటూ జవాబు కోసం కూడా చూడకుండా వెళ్ళి పోయారు.

మీరు ఇంట్లోనించి యెక్కడికీ వెళ్ళరుగా అన్నమాటకి వళ్ళు భగ్ మంది. తాళం చెవి విసురుగా లోపలికి గిరాట్టు కొట్టాడు. కుర్చీలో నించి లేచి బట్టలు వేసుకుని వీధిలోకి వచ్చాడు. ఎక్కడికి వెళ్ళాలి ! యేం చేయ్యాలి ! యేంచెయ్యాలన్నా డబ్బు కావాలి ! డబ్బు. డబ్బు.. డబ్బు కావాలి. అశాంతిగా రోడ్డు వెంట తిరిగి తిరిగి యిల్లు చేరాడు. అలిసిపోయినట్లున్న ముఖం చూస్తూ అహల్య అడిగింది "ఎక్కడికి వెళ్ళారు. మీ కోసం టిఫెను చేసి వుంచాను"

ధనంజయరావు మనస్సు కాస్త చల్లో

బడింది టిఫెను తిన్న తర్వాత. నేనీమధ్య అకారణంగా ఆవేశం తెచ్చు కుంటూన్నా నేమిటి ! ఎందుకిలా అవుతూన్నాను. తనని తను ప్రశ్నించుకున్నాడు. జవాబు తెలియటం లేదు. కాస్సేపు నిద్ర పోవాలని అన్పిస్తోంది.

అయిదు గంటలు కావస్తూండగా మెలుకువ వచ్చింది. లేచి ముఖం కడుక్కుని పత్రిక తిరగేస్తూ కూర్చున్నాడు. మాధురి చిరిగిన చీరెని కుట్టుకుని మడత పెట్టి అల్మారాలో పెడుతోంది. మాధురిది అచ్చంగా తల్లి మనస్తత్వమే. చదువు అయిపోతే వుద్యోగం చూడటమా. పెళ్లి చేయటమా ! పెళ్లి చేయాలంటే డబ్బు కావాలి. ఆ డబ్బు తన దగ్గర లేదు. ఆడపిల్ల పెళ్లి అంటే వందలలో అయేపని కాదే! వేలు కావాలి. కట్నం యివ్వాలి. పెళ్లి ఖర్చుకి కావాలి.

ఓహ్ డబ్బు విషయం ఆలోచించకూడదు అనుకుంటే మళ్ళా యివే యివే ఆలోచనలు తరుముకు వస్తూన్నాయి. ఛీ ఛీ...

యెదిరింటి ముందు స్కూటర్ ఆగిన శబ్దం అయింది

కోకిలమ్మ మొగుడు వచ్చినట్లున్నాడు. లాభమే వచ్చిందో నష్టమే వచ్చిందో తెల్సుకోవాలన్న కుతూహలంతో తనే పల్కరించాడు.

"ఏమండోయ్! అప్పుడే వచ్చేశారే... ఔనూ యివాళ లాభం యెంత"

"వందకి వందసార్. కాస్తలో పెద్ద మొత్తం రావల్సిందే తప్పిపోయింది. యివాళ నా 'లక్' బాగా లేదు. ఈసారి పాతికవేలన్నా వచ్చి తీరాలి" అంటూ లోపలికి వెళ్ళి పోయాడు. వందకి వంద లాభం వచ్చిందా ! అబ్బా! పాతిక వేలు రాలేదని బాధపడి పోతూన్నాడు గానీ వందకి వంద వచ్చింది చాలు అని తృప్తి పడడేం.

వందకి వంద. వందకి వంద. అబ్బా!

కొత్త కొత్త రూపాయిల నోట్లు ధనంజయరావు కళ్ళముందు గిరగిరా గిరగిరా తిరుగుతూ పరపరా శబ్దం చేస్తూన్నట్లుగా అన్పిస్తోంది. కళ్లు మూసుకుని వాలు కుర్చీలో పడుకుండి పోయాడు చాలా సేపు.



# 4

ఇల్లు ఖాళీ చేయమని యింటివాళ్ళు తొందర పెడుతూన్నారు. మరో యిల్లు యెక్కడా దొరకలేదు. ధనంజయరావు ప్రతిరోజూ ఆలశ్యంగా యింటికి వస్తూన్నాడు ఎక్కడ తిరుగుతూన్నాడో ఏం చేస్తూన్నాడో అహల్యా అడిగినా చెప్పటం లేదు.

రాత్రి యెనిమిదింటికి యిల్లు చేరిన భర్త ముఖంలోకి చూస్తూ అడిగింది.

"ఇల్లు యెక్కడన్నా చూస్తూన్నారా!"

ధనంజయరావు జవాబు చెప్పలేదు.

అహల్య మళ్ళీ అడిగింది.

"నువ్వూ పిల్లలూ యేం చేస్తున్నారు! ఓ యిల్లు వెతకలేరూ !" కోపంగా అరిచాడు.

అహల్యకి ఏం చెప్పాలో తెలియ లేదు. అక్కడనించి వెళ్ళిపోయింది.

ఈ మధ్య యీ యనలో యేదో మార్పు కన్పిస్తోంది. ఏమిటది! తనకి అర్థం కావటం లేదు. విసుగూ చికాకూ కూడా యెక్కువైంది. పిల్లలతో కూడా యిదివరకులా మాట్లాడటం లేదు. భోజనం చేస్తూన్నప్పుడు కూడా మౌనంగా కూర్చుంటూన్నాడు. ఆఫీసు విషయాల్లో యేదైనా చికాకులు వున్నాయేమో! అదే అయితే చెప్పవచ్చుగా. చెప్పకుంటే యెలా తెలుస్తుంది. అహల్య ఆలోచనలతో సతమతమై పోతోంది. పది, పదిహేను రోజులు గడిచినా భర్తలో మార్పు రాకపోయేసరికి విగులు పడిపోయింది అహల్య... కూతురినీ, కొడుకునీ అద్దె యిల్లు వెతకమని పంపింది. యిద్దరూ తిరిగి తిరిగి అల్సిపోయి వచ్చారు.

"ఏమ్మా! ఏదైనా మనకి వీలుగా వుందా !"

"రెండిళ్ళు చూశాం. ఒకటి బాగా లేదు. ఒకటి నచ్చింది. కానీ అద్దె చాలా యెక్కువ."

"అయితే వద్దు, మనం యివ్వగలిగిన అద్దెలోనే మరేదైనా చూడండి."

"దొరకదమ్మా" జనార్దన్ విసుగ్గా అన్నాడు. మాధురి తమ్ముడివైపు కోపంగా చూసి "వీడి మాటలకేంగానీ నే వెతుకుతాలేమ్మా" అంది.

"వెతుకు. నేమాత్రం చస్తే నీవెంట రాను"

"రాకు. నాకేం భయం లేదు."

"అబ్బబ్బ...తగాదా పడకండి" అహల్య సర్దేసి జనార్దన్ని కేకలు వేసింది.

"నువ్వలా మాట్లాడకూడదు"

జనార్దన్ ముఖం మాడ్చుకుని బైటకి వెళ్ళిపోయాడు.

"అక్కయ్యా ఏం చేస్తూన్నారూ!" అంటూ వచ్చింది కోకిలమ్మ.

"రండి. కూర్చోండి" చాప పరిచింది అహల్య. కోకిలమ్మ తీరుబడిగా కూర్చుంది. అంటే ఓ గంట సేపు అయినా కూర్చుని కబుర్లు చెపుతుందన్న మాట. అవతల బక్కెట్టులో నిండుగా బట్టలు నానబెట్టినవి ఉన్నాయి. అవి ఉతుక్కోవాలి. అయినా ఆపని వాయిదా వేసుకునికోకిలమ్మతో కబుర్లు చెప్పటానికి కూర్చుంది. మాధురిని చూసి "ఏం మాధురీ యివాళ కాలేజీకి వెళ్ళలేదూ" అడిగింది కోకిలమ్మ.

"వెళ్ళాను కానీ క్లాసులు లేవు అందుకని వచ్చేశాను"

"అలాగా! నువ్వు ప్రతిరోజూ సైకిల్ యెక్కి కాలేజీకి వెడుతూంటే నేను కిటికీ దగ్గర నిల్చుని అదే పనిగా చూస్తూ వుంటాను. నేనూ నీలా ఎర్రగా సన్నగా పొడుగ్గా నొక్కులజుత్తు జడతో యెంచక్కా సైకిల్‌యెక్కి కాలేజీకి వెళ్ళి చదువుకుంటే యెంత బాగుండో అన్పిస్తూ వుంటుంది. కానీ నాకా అదృష్టం లేదు" నిట్టూర్చింది

కోకిలమ్మ.

"మీకు చదుకోవాలని వుందా!" ఆశ్చర్యంగా అడిగింది మాధురి.

"ఔను మాధురీ! నాకసలు చిన్నప్పటి నించీ కాలేజీలో చదువుకోవాలని యెంతో కోరిగ్గా వుండేది. కానీ మా ఊళ్ళో కాలేజీ కాదు కదా హైస్కూలన్నా లేదు. బస్తీలో వుండి చదువుకుంటానని యెంత గోల చేశానో. మావాళ్ళు వినలేదు. 'మనకి బోలెడంత డబ్బు వుంది. నీకు చదువు యెందుకు. నువ్వు వుద్యోగం చెయ్యాలా వూళ్ళేలాలా' అని మా అమ్మ సాగనీయలేదు. మాధురీ మనిషికి యెన్ని వున్నా చదువు యిచ్చే తృప్తితో మరేదీ సమానం కాదు. ఏమంటావు."

"మీకంత ఆసక్తివుంటే యిప్పుడైనా చదువుకోవచ్చు కదూ! ప్రైవేటుగా యెందరో చదువుతున్నారుగా"

"ఔను. మాఆయన్ని చదువు చెప్ప మని అడిగాను. కానీ ఆయనకి శ్రద్ధ లేదు. 'నేచదువుకున్నాగా చాలులే. నీకు లేకపోతే యిప్పుడు వచ్చిన లోటు యేమిటి!' అనేశారు.

జాలిపడింది మాధురి.

"యెవరినన్నా మాష్టర్ని పెట్టుకుని చదువుకోండి" అంది అహల్య.

"మాఆయనకి చచ్చేంత అనుమానం. ఒప్పుకోరు. సరే యీ విషయాలకేం గానీ మీకు యిల్లు కుదిరిందా!"

"లేదింకా"

"మీరు దూరంగా వెళ్ళిపోతారేమో అని బాధగా వుంది అహల్యా అక్కయ్యా! మేమీ యింట్లోకి వచ్చిన దగ్గర నుంచీ తోడుగా వున్నారు మీరూ, పిల్లలూ. అన్నట్లు నాంచారమ్మగారు యిల్లు కొనేసుకున్నారటగా"

"ఔను. వూరికి దూరంగా కట్టిన కొత్తకాలనీ. అయినా యిల్లు బాగుంది. ఎల్లుండి గృహప్రవేశం కూడా"

"ఎంత అదృష్టవంతురాలు. పిల్లలు కూడా వుండివుంటే ఎంతో బాగుండేది కదండీ అక్కగారూ"

"నిజమే. అందరికీ యేదో ఒక వెలితే"

"నిజం. నా సంగతే చూడండి. ఇంత డబ్బుంది. యేం ప్రయోజనం. నాకున్న యీ నలుపుని మార్చుకోగలనా! ఖరీదైన చీరెలు కట్టుకోగలను గానీ" నిట్టూర్చింది కోకిలమ్మ.

"ఛీ... మనల్ని మనం అలా కించ పర్చుకోకూడదు. ఈ పోలికలూ రంగూ అన్నది వంశపారంపర్యంగా వస్తుంది. తలిదండ్రుల నించీ వస్తుంది. అదీకాక రూపం యెలావున్నా అసలైనది మనస్సు. ఆ మనస్సుని విశాలంగా వుంచుకున్నప్పుడు శాంతికి కరువుండదు"

అహల్యా మాటలకి కోకిలమ్మకి కాస్త ఓదార్పు కల్గింది. మరికాస్సేపు కూర్చుని వెళ్ళబోతుండగా నాంచారమ్మ యెదురు వచ్చింది. నీలం పట్టుచీరె కట్టుకుని యెర్ర జాకెట్టు వేసుకుని బర్మా ముడి చుట్టుకుని దానిచుట్టూ పూలదండ పెట్టుకుని చేతిలో కుంకుమ భరిణితో లోపలికి వచ్చింది. "అమ్మయ్యా. కాళ్ళు పీకేస్తూన్నాయి. సమయానికి కోకిలమ్మ కూడా

యిక్కడే వుందే" అంటూ చాపమీద చతికిలపడింది.

"వదినగారూ, యెల్లుండి మీరూ అన్నగారూ పిల్లలు ముగ్గురూ పొద్దునే రావాలి. వచ్చి నాకు సాయంగా నిలవాలి. మాధురీ ఆ ఒక్కరోజు కాలేజీ మానేయమ్మా"

"అలాగే" తలవూపింది మాధురి. నాంచారమ్మ అందరికీ బొట్టుపెట్టింది.

కోకిలమ్మని కూడా తప్పక రమ్మని చెప్పింది.

"మావారు వచ్చి అన్నగార్నీ కోకిలమ్మ మొగుడినీ పిలుస్తారు లెండి. మరి నేను వస్తాను" లేచింది నాంచారమ్మ.

"వుండండి.కాస్త కాఫీతాగి వెడుదురుగాని."

మాధురి కాఫీ తెచ్చింది. నాంచారమ్మా, కోకిలమ్మా కాఫీ తాగిలేచారు.

"వెళ్ళివస్తా వదిన, గారూ! అన్నట్టు మీకు ఇల్లు దొరికిందా!"

"లేదు"

"మీరు దూరం అని సంశయించకుండా వుంటే మా కొత్త యిళ్ళ దగ్గర యేదైనా పోర్షన్ వుంటే చూసి కబురు పంపిస్తాను. సరేనా"

"అలాగే చూడండి"

నాంచారమ్మ వెళ్ళిపోయింది. అహల్య వాకిలి వరకూ సాగనంపి వచ్చింది. బట్టలు వుతుక్కోవడానికి ఆలశ్యం అయింది అనుకుంటూ. అప్పుడే మాధురి బాత్ రూములో కూర్చుని బట్టలు వుతికేస్తోంది.

"నేవస్తూన్నా కదమ్మా" కూతుర్ని లెమ్మంది.

"ఫర్లేదమ్మా ... నే వుతికేస్తానుగా. నువ్వు మరో పని చూసుకో"

అహల్య యివతలకి వచ్చేసింది. చాటలో బియ్యం పోసుకుని బెడ్డలు యేరుతోంది. కోకిలమ్మకి డబ్బుంది. శాంతి లేదు. నాంచారమ్మకి అన్నీ వున్నాయి. పిల్లలు లేరు. నాకు ఒక్క డబ్బు తప్ప అన్నీ వున్నాయి. యెంత చిత్రంగా వున్నాయి జీవితాలు. ఆలోచనలు అలా అలా సాగిపోతున్నాయి. చెయ్యి అలవాటుగా పనిచేస్తోంది. గడియారం ఐదు గంటలు కొట్టింది.



## 5

నాంచారమ్మగారి గృహ ప్రవేశానికి అహల్య పిల్లలు ముగ్గురూ వెళ్ళివచ్చారు. 'ధనంజయరావు పని వున్నది' అంటూ రాలేదు.

"అన్నగారు రాలేదు" అని బాధపడిపోయింది నాంచారమ్మ. కొత్త ఇల్లు చిన్నదే అయినా బాగుంది అన్నారు అందరూ. నాంచారమ్మ పొంగిపోయింది. గృహ ప్రవేశానికి అహల్యతోబాటు కోకిలమ్మ కూడా వచ్చింది. పట్టుచీర కట్టుకుని కొత్త నెక్లెస్ పెట్టుకుని మాటి మాటికీ "నెక్లెస్ చేత్తో చూసుకుంటూ వచ్చిన వాళ్ళందరికీ నెక్లెస్ కొనుక్కున్నాను చూశారా, బాగుందా" అని చెప్పి

మరి చూపించింది. పని హడావుడిలో వున్నా నాంచారమ్మ కోకిలమ్మ మెడలో నెక్లెస్ పరీక్ష చేసింది.

"యెర్ర రాళ్ళు ధగ ధగా మెరుస్తున్నాయి."

"చాలా బాగుంది డిజైను. యెన్ని వేలైంది" అడిగింది.

"నాకు తెలియదు. మా ఆయన కొని తెచ్చారు. మా అమ్మగారు పెట్టిన పాత నెక్లెస్ మార్చి కొత్తది బాగుందని తెచ్చారు" మురిసిపోతూ కోకిలమ్మ మెడలోనించి నెక్లెస్ తీసి చూపించింది. అమ్మలక్కలు పరీక్షించి ఒకరి ముఖాల్లోకి ఒకరు చూసుకుంటూ "యింత తేలిగ్గా వుందేమిటీ! బంగారందికదా బరువు వుండద్దూ" అని గుస గుసగా అనుకున్నారు.

"కోకిలమ్మా, యింకా యేంకొన్నాడు మీ ఆయన" అడిగింది నాంచారమ్మ.

"గుర్రప్పందాల్లో గెల్చానని ఈ పట్టు చీర కూడా ఆయనే తెచ్చారు"

"నిజంగా"

"ప్రతి ఆదివారమూ ఏదో ఒక పాత నగ తీసుకువెళ్ళి మార్చి సరి కొత్తది తెచ్చి యిచ్చి పెట్టుకోవే పిచ్చి ముఖమా" అంటారు.

"ఆదివారం నగల షాపులు యెక్కడుంటాయి కోకిలమ్మా"

"వుండవా! అయితే రేపు ఆదివారం నా ఈ గాజులు తీసుకు వెళ్ళి కొత్త రకం తెస్తా నన్నారే!" అంటూ నాంచారమ్మ ఇచ్చిన నెక్లెస్ తీసుకుని మెడలో పెట్టుకొని అక్కడే గోడకివున్న అద్దంలో చూసుకుని మురిసిపోతూ వుంది కోకిలమ్మ.

పాపం కోకిల అమాయకురాలు అనుకుంది అహల్య. ఈ అమాయకురాలిని ఆ మొగుడు కబుర్లు చెప్పి యేదో మోసం చేస్తున్నట్లుంది. అని అనుమానపడింది. కాస్ కోకిలకి యేమని చెప్తుంది. అహల్య యింటికి వచ్చినా నాంచారమ్మ యింట్లో జరిగిన విషయాలే గుర్తుకి వస్తున్నాయి. రాత్రి యెనిమిది గంటలు దాటినా ధనంజయరావు యిల్లు చేరలేదు. పిల్లలు ముగ్గురూ తొమ్మిది వరకూ యెదురు చూసి "ఆకలవుతోందమ్మా" అనే సరికి అహల్య వడ్డించేసింది. వాళ్ళు భోజనం చేసి కాస్సేపు చదువుకుని నిద్ర పోయారు. అహల్యకి ఆకలి మండిపోతున్నా భర్త కోసం యెదురు చూస్తూ కూర్చుంది. పదిగంటల తర్వాత వచ్చాడు. వచ్చి బట్టలు మార్చుకుని ఆకలి లేదంటూ పడుకున్నాడు.

నువ్వు భోజనం చేశావా లేదా! పిల్లలు తిన్నారా లేదా ! అని అడక్కపోయే సరికి అహల్యకి ఆశ్చర్యం ముంచుకు వచ్చింది. ఈ బాధలో ఆకలిని మర్చిపోయింది. అలానే నిద్ర పోయింది.

తెల్లవారి ఆదివారం. అయినా ధనంజయరావు త్వరగా భోజనం చేసేశాడు. ముందుగదిలో కూర్చున్నాడు. కోకిలమ్మ మొగుడు స్కూటర్ మీద వెళ్ళి పోవటం చూస్తూనే వున్నాడు. ఉదయంనించీ భర్త వాలకం ఓ కంట కనిపెడుతూనే వుంది అహల్య. భోజనం చేసి వంటగదిలోనించి బైటకి వచ్చేసరికి వాలు

కుర్చీలో ధనంజయరావు లేడు.

"నాన్నా రెక్కడికి వెళ్ళార మ్మా" కూతుర్ని అడిగింది. "తెలియదమ్మా, నీ పెట్టె తీసి ఏదో తీసుకుని వెళ్ళి పోయారు"

అహల్యా గాభరాగా పెట్టెలో చూసు కుంది. అందులో తను నెలాఖరులో ఖర్చు కోసం వుంచిన ఇరవై రూపాయలూ లేవు. ఈ డబ్బు యెంత అవసరమైనా యిదివరకు తీసేవారు కాదు. యిలా తీయటం యిది రెండోసారి.

యెందుకిలా తీసినట్లో చెప్పి వుంటే అంత బాధ కలిగేది కాదు. అహల్యా మనస్సు వికలమై పోయింది. ఈయనకి

యేమైంది! యెందుకిలా చేస్తున్నారు!

నాలుగు రోజులు జరిగిపోయాయి. నాంచారమ్మ యింటి దగ్గర ఓ యిల్లు వుందనీ, వచ్చి చూసి పొమ్మనీ కబురు పంపింది. అహల్యా వెళ్ళి చూసింది. యిల్లు బానే వుంది. మూడు గదులు. గాలీ వెల్తురూ బాగానే వస్తాయి. అద్దె కూడా తక్కువే. అయితే సిటీకి దూరం. ఎలా! ఆలోచిస్తోంది అహల్యా. నాంచారమ్మ నచ్చ చెప్పింది.

"మాధురి యెలాగూ కాలేజీకి సైకిల్ మీదనేగా వెడుతుంది. ఆ యింటికంటే యిది యింకా స్త దూరం. మధునీ జనా ర్దన్‌నీ యిక్కడ స్కూల్లోనే చేర్పించ వచ్చు. ఆలోచించకండి. అడ్వాన్సు యిచ్చేయమనండి, అన్నగార్ని వచ్చి చూడమని చెప్పండి" అంది.

అహల్యా యింటికి వచ్చేసి రాత్రి ఆల స్యంగా వచ్చిన భర్తకి చెప్పింది.

"మీరో సారి వెళ్ళి చూసి రండి. నచ్చితే తీసుకుందాం"

"నే చూడక్కర్లేదు. ఫస్టుకి చేరి పోదాం"

"ఒక్కసారి చూస్తే ఏమవుతుంది"

"నాకు తీరుబడి లేదు"

ఈ మాటకి అహల్యాకి నళ్లమండు కొచ్చింది. "ఇల్లు వెతక్కపోగా వెతికిన యిల్లుని చూడటానికి కూడా తీరుబడి లేనంత పని మీకేం వుంది" అంది కోపంగా.

ధనంజయరావు జవాబు చెప్పలేదు. వెళ్ళి యిల్లుచూడలేదు. ఫస్టకి ఇల్లు మారు తూన్న రోజున కూడా పనివుంది అంటూ బైటకి వెళ్ళిపోయాడు. జనార్దన్, మాధురీ సామాన్లు సర్దారు. కొత్త యింట్లోకి వెళ్ళటానికి నాంచారమ్మా వచ్చి సాయం చేసింది.

కోకిలమ్మ అహల్యాని కావులించుకుని కన్నీళ్ళు పెట్టుకుంది.

"అక్కా నన్ను వదిలి దూరంగా వెళ్ళి పోతూన్నావా! మళ్లా యీ యింట్లోకి యెవరు వస్తారో, యెలా వుంటారో. నాకుభయంగా వుంది."

"మరేం ఫర్లేదు. మంచివాళ్ళే వస్తారు గానీ, నీకు చూడాలన్నప్పుడల్లా నాదగ్గరకి రామ్మా" అని వోదార్చింది అహల్యా. ఈ యిల్లు వదలటానికి తనకీ బాధగానే వుంది. ఈ పరిసరాలు పాతబడి స్వంత యిల్లులా అన్పించేది. అక్కడ యెలా వుంటుందో! యెలా వున్నా నాంచా రమ్మకి దగ్గరగా వుంటాం గనుక ఫర్లేదు అని తనకి తనే ధైర్యం చెప్పుకుంది.

ధనంజయరావు సామాను బండి బయలుదేరుతూండగా వచ్చాడు.

"అమ్మయ్య వచ్చారు" ఆయన వుంటే బోలెడంత ధైర్యంగా వుంటుంది అనుకుంది అహల్య.



# 6

మధుకి కొత్త యిల్లు నచ్చింది కానీ స్నేహితులు లేరని గొడవ చేస్తూన్నాడు. జనార్ధన్ స్కూలుకి వెడుతూన్నాడు. సిటీలోకి పోవాలంటే సిటీబస్ వుంది. కానీ మెయిన్ రోడ్డు వరకూ నడవాలి. మెయిన్ రోడ్డుకి యిటో కాలనీ, అటో కాలనీ కొత్తగా యేర్పడ్డాయి. నాంచారమ్మ ప్రతి మధ్యాహ్నం వచ్చి కూర్చుని కబుర్లు చెప్పి వెడుతోంది. ఇందువల్లఅహల్యకి త్వరగానే ఈ యింటి కొత్త పోయింది. ఇంక మాధురికే చాలా కష్టంగా వుంది ఇక్కడనించి కాలేజి నాలుగుమైళ్ళు. మెయిన్‌రోడ్డు వెంటపోతే. అయితే మరో పక్కనించి దగ్గర దారి వుంది. కానీ అక్కడ కూలీలూ, రిషావాళ్ళూ, పాచి పనులు చేసుకునేవారూ వుండే లేబర్ బస్తీ. ఆ గుడిసెల మధ్య నుంచి పోవటం యిష్టం లేకున్నా తప్పదు మరి. మాధురి కాలనీలోనించీ మెయిన్‌రోడ్డుకి వెంట కొంతదూరం వెళ్ళిన తర్వాత లేబర్ బస్తీలో నించి అడ్డదారిన వెడితే కాలేజీ కాస్త దగ్గర. అందువల్ల యీ దారినే వెడుతూ వుంది. ఇక్కడ నించి తనకి తోడుగా ఒక్క అమ్మాయి దొరికినా బాగుండు అని చూసింది. ఎవ్వరూ దొరకలేదు. ఇలా వారం రోజులు జరిగిపోయాయి.

రోజూలాగానే మాధురి పుస్తకాలు తీసుకుని సైకిల్ యెక్కింది. కాలనీ దాటి మెయిన్‌రోడ్డు యెక్కేచోట ఓ వంతెన వుంది. దాని కిందనించి కాలువ ప్రవహిస్తూ వుంది. ఆ కాలువ యెక్కడ నించి వస్తూందో యెక్కడికి వెడుతోందో తెలియదు. కానీ యీ వంతెన దగ్గరికి రాగానే రోడ్డుకి అటు వైపుగా కన్పించే కాలనీవైపు ఓ సారి చూడటం అలవాటు అయింది. ప్రతిరోజూ యీ సమయానికే ఆ కాలనీలోనించి యాభై యేళ్ళు దాటిన ఓ ముసలాయన దడదడలాడుతూ శబ్దం చేస్తున్న డొక్కు సైకిల్ యెక్కి సిటీలోకి పోతూంటాడు. ఆయన మొదటి సారిగా మాధురిని పరీక్షగా చూశాడు. ఆయన్ని మాధురి చూసింది. యింక ప్రతిరోజూ చూసుకుంటూన్నా ఒకర్ని ఒకరు పల్కరించుకో లేదు. ఆయన సైకిల్‌ని స్పీడుగా తొక్కలేదు. మాధురి కొంతదూరం ఆయనతో బాటుగా మెల్లిగా వెళ్ళి తర్వాత స్పీడుగా వెళ్ళిపోతుంది. రోడ్డుమీద లారీలూ, చిన్న కార్లూ, ఆటోలూ, రిషాలూ నడుస్తూనే వుంటాయి. ఇవికాక గేదెలూ ఆవులూ, కుక్కలూ, కోడిపిల్లలూ అడ్డం వస్తూంటాయి. లేబర్ బస్తీలో

అయితే అసలే యిరుకు సందులు ఆ సందుల్లో మనుషులు అడ్డంగా నిల్చుని కదలరు. ఇందుకు మహా విసుగ్గా వుంది మాధురికి. అయితే యీ బస్తీలో వాళ్ళు ప్రతిరోజూ మాధురిని చూస్తూ వుంటారు గనుక పరిచయం అయిన వాళ్ళలా పల్కరిస్తూంటారు. ముసలమ్మలూ, చిన్నపిల్లలూ, చింకి బట్టల వాళ్ళూ, దుబ్బు జుట్టువాళ్ళూ, రోగాలతో తీసుకుంటున్న వాళ్ళూ తాగి, బూతులు తిట్టుకుంటూ కొట్టుకుంటూండేవాళ్ళూ,రకరకాలుగా కన్పిస్తూవుంటారు. ఇలాంటి వాళ్ళని యింత దగ్గరగా చూడటం యిదే మొదలు.

మనకి స్వాతంత్ర్యం వచ్చి ముప్ఫై ఏళ్ళు అయింది. ఇన్ని సంవత్సరాలుగా మనం సాధించామనుకున్న ప్రగతి వీళ్ళ బ్రతుకుల దరిదాపుల్లోకి కూడా వచ్చినట్లు లేదే! వాళ్ల జీవితాల్లో మార్పురాదా! వీళ్ళు తిండికీ బట్టకీ ముఖం వాచకుండా బ్రతికేరోజు యెప్పటికి వస్తుంది? యెలా వస్తుంది? కష్టపడి రెక్కలు ముక్కలు చేసుకుని చెమట వోడ్చే వారే! అయినా కడుపుకింత తిండీ, వంటికింత గుడ్డా వుండదు. ఎందువల్ల! ఎందువల్ల? వీళ్ళ బ్రతుకులిలా కాలిపోవటానికి కారణం యెవరు! వీళ్ళని చూస్తూంటే మాధురి గుండె కరిగిపోతుండేది.

వాళ్ళని చూస్తూ సైకిల్ మెల్లిగా పోనిస్తూ ఇల్లు చేరుతుంది. సైకిల్ ప్రయాణం వల్లనో యేమో చాలా అల్సిపోతోంది. ఇది అహల్య గ్రహించింది. కానీ యేం చేస్తుంది.

ఒక్క సంవత్సరం కష్టపడితే ఈ చదువు పూర్తి అవుతుంది. డిగ్రీ చేతికి వస్తుంది. ఆ తర్వాత ఏం జరగవల్సి వుందో అదే జరుగుతుంది.



# 7

మాధురి కాలేజీకి బయలుదేరింది: మెయిన్‌రోడ్డు దగ్గరికి వచ్చింది. రోడ్డుకి అటుగావున్న కాలనీలోనించి వచ్చే తాతగారు యివాళ ముందే వెళ్ళిపోతూ కన్పించారు. ఆయన కాక దాదాపు పాతికేళ్ళ యువకుడు సైకిల్‌లో అటునించే వచ్చి మెయిన్‌రోడ్డు యెక్కాడు. మాధురిని చూశాడు. మాధురితోబాటుగా కొంత దూరం వచ్చి తర్వాత స్పీడుగా వెళ్ళిపోయాడు. ఇలా నాలుగు అయిదు రోజులు జరిగింది. ఇద్దరిదీ ఒకే టైము. అలాగే సాయంకాలం కూడా తను వచ్చే సమయానికే అతనూ లేబరు బస్తీలో నించే వస్తాడు. ఒకర్ని ఒకరు చూసుకోవటం తప్ప పల్కరించుకోలేదు.

మాధురి మెయిన్‌రోడ్డుమీద సైకిల్‌లో వెడుతోంది. అతనూ వస్తున్నాడు. ఎదురుగా బ్రహ్మరాక్షసిలా లారీ 'లోడ్' నింపుకుని వేగంగా వస్తోంది. ఈ లారీలంటే చాలా భయం మాధురికి. లారీని

చూడగానే చటుక్కున సైకిల్‌ని రోడ్డు పక్కకి ఆపేసుకుని కళ్ళు గట్టిగా మూసేసుకుంది. లారీ వేగంగా వెళ్ళిపోతోంది. వెనకనుంచి వస్తూన్న యువకుడు ఆగిపోయి యిదంతాచూసి మాధురి దగ్గరగా వచ్చి పలకరించాడు.

"ఏమైంది? ఆగిపోయారేం?"

మాధురి కళ్ళు తెరిచింది. ఎదురుగా నిల్చున్న యువకుడిని చూస్తూ "ఆ... లారీలని చూస్తే, నాకు...భయం."

"అలాగా! అయితే మీరిలా సైకిల్ మీద ప్రయాణం చెయ్యకండి! ఇంతకీ మీరు రోజూ యెక్కడికి వెడుతుంటారు."

"కాలేజీకి"

"ఓ. కాలేజీ స్టూడెంట్ అన్నమాట. లారీ వెళ్ళిందిగా ఇహ సైకిల్ ఎక్కండి"

మాధురి అతను అంత చనువుగా మాట్లాడుతూంటే ఆశ్చర్యపోతూనే సైకిల్ యెక్కి బయలుదేరింది. అతనూ పక్కనించే పోనిస్తూ తనని తను పరిచయం చేసుకున్నాడు.

"నా పేరు అశ్వనీకుమార్. మరి మీ పేరు?"

"మాధురి"

"అలాగా! నేను యం. యస్సీ పాస్ అయి ఏడాదిదాటింది. సరైన ఉద్యోగం దొరకలేదు. తాత్కాలికంగా చిన్నజాబు చేస్తున్నాను. మరి మీరేం చదువుతున్నారు?"

"బియ్యే ఫైనల్"

"గుడ్! అయితే మనిద్దరం ఈ మెయిన్ రోడ్డుమీద కొన్నాళ్ళు కల్సి ప్రయాణం చేస్తూ వుంటాం అన్నమాట. ఔను మీరు యిక్కడికి కొత్తగా వచ్చినట్టున్నారుకదూ!"

"ఔను! మరి మీరు?"

"మా కాలనీకి పునాదిరాయిని నేనే అంటుంటారు నా స్నేహితులు. అంటే మేమే మొదటగా వచ్చింది యిక్కడికి. రెండుమూడేళ్ళ క్రితం యిదంతా అరణ్యంలా వుండేది. మనుషులకోసం మొఖంవాచి పోయినట్లు చూస్తూండేవాళ్ళని. కాస్త యిప్పుడిప్పుడే చాలా యిళ్ళు వచ్చాయి. మనుషులూ వచ్చారు. ఈ రోడ్డుమీద నడిచేవాళ్ళంపరూ నా ఆత్మీయుల్లా అన్పిస్తారు. ఇందువల్లనే మీరూ కొత్తగా అన్పించక పలకరించాను. ఇందుకు మరేం అనుకోరుగా."

"భలేవారు. ఈ మాత్రానికే. అలా యేం అనుకోను."

ఇతను అందరు అబ్బాయిల్లా తన బట్టలనీ, నగలనీ పరీక్షించటంలేదు. తన లాంటి మరో స్నేహితుడితో మాట్లాడినంత ఫ్రీగా మాట్లాడేస్తున్నాడు. అతను కబుర్లు చెప్తుంటే మాధురి గమనిస్తూ వుంది. టెరీకాట్ ప్యాంటూ, షర్టూ ఎడం చేతికి రిస్ట్‌వాచ్ కాలికి నల్లటి చెప్పులు చాలా సాదాగా వున్నాడు. తెల్లటిరంగు ముఖంలో యేదో చెప్పలేని ప్రత్యేకత కన్పిస్తుంది. సైకిల్‌మీద నిటారుగా కూర్చుని నడిపటం అలవాటులా వుంది. మాట్లాడుతూ మాట్లాడుతూ ఠక్కున ఆగాడు. మాధురి వులిక్కిపడినట్లు అయి అతని ముఖంమీదనించి దృష్టిని మళ్ళించుకుంది.

"మీరేం మాట్లాడలేదు" అన్నాడు.

మాధురి నవ్వేసింది.

"మీదా అటు. నేను ఇటు వెళ్ళి పోవాలి. వస్తాను" వెళ్ళిపోయాడు అశ్విని. వెళ్ళిపోయే అతన్నే చూస్తూ మెల్లిగా తన సైకిల్‌ని కాలేజీ వైపుకు పోనిచ్చింది.

ఒక్కరోజు పరిచయం. అయినా ఇంత స్వతంత్రంగా మాట్లాడగల్గటం అందరికీ చేతకాదు. పాపం యం. యస్సీ పాస్ అయినా యింకా మంచి ఉద్యోగం దొరకలేదట. పోనివ్వు. నాకు ఒంటరిగా వెళ్ళవలసిన బాధ తప్పింది. కాస్త కాలక్షేపంగా వుంటుంది అనుకుంది. అరే! ఈ రోజు త్వరగా కాలేజీ వచ్చేసినట్లుందే! అనిపించింది.

సాయంకాలం కూడా దారిలో కలిసాడు అశ్విని.

"హల్లో మీరు ప్రతిరోజూ యిదే టైముకి వచ్చేస్తుంటారా?" అడిగాడు.

"మీరు?" జవాబు చెప్పకుండా యెదురు ప్రశ్న వేసింది మాధురి.

"నేను ఇంటికి రావటం పోవటం నా యిష్టం. మా బాస్‌కి తన పనిచేయటం ముఖ్యం అంతే"

"భలే చెప్పారే" నవ్వేసింది మాధురి.

"జవాబు చెప్పకుండా మాట దాటేస్తున్నారు" వదల్లేదు అశ్విని.

"సామాన్యంగా యిదే టైము. క్లాసులు లేకుంటే తప్ప"

"అంటే మనం దాదాపు కల్సి వెళ్ళ వచ్చు రావచ్చు. అరె యివాళ త్వరగా వచ్చేసినట్లుంది మన కాలనీ, వస్తానండి మాధురీ దేవీగారూ" అంటూ వెళ్ళిపోయాడు.

"అరె! అచ్చంగా నాలానే అన్పించింది యితనికూడా" అనుకుంటూ యింటి వైపుగా సైకిల్ పోనిచ్చింది మాధురి.



# 8

ప్రతిరోజూ మాధురీ, అశ్వినీ కల్సి వెళ్ళి వస్తున్నారు.

మాధురి రావటం కాస్త ఆలశ్యం అయినా అశ్విని వెయిట్ చేస్తూంటాడు. ఆదివారం ఒక్కరోజు కల్సుకోరు యిద్దరూ. సోమవారం కల్సుకున్నప్పుడు అశ్విని ఆదివారం తను ఎలా కాలక్షేపం చేసిందీ చెప్పేస్తాడు. వెళ్ళిన సినిమాల గురించీ, చదివిన పుస్తకాల గురించీ చెప్తూంటాడు. ఇలా ప్రతిరోజూ కల్సుకోవటం అలవాటయి, ఆదివారం అశ్విని కనిపించకపోయేసరికి మాధురి అదోలా వుంటుంది. సోమవారంనాడు హుషారుగా వుంటుంది. ఈ రోజు సోమవారం. మాధురి హుషారుగా సైకిల్ తీసుకుని బయలుదేరింది. అశ్విని పల్కరించాడు.

"గుడ్‌మార్నింగ్ మాధురీదేవి"

"మార్నింగ్" మాధురి అశ్విని ముఖంలోకి చూసింది. ఇవాళ యేదో కొత్తగా కన్పిస్తున్నాడేమిటి అనుకుంది. తలంటుకుని కొత్త పాంటూ, షర్టూ వేస

కున్నాడు. ముఖాన చిన్న కుంకుమ బొట్టు చెరిపినా గుర్తుగా కన్పిస్తోంది.

"ఏమిటి విశేషం" అంది అతని సైకిల్‌తోబాటు సైకిల్ పోనిస్తూ.

"మా బాస్ జీతం పది రూపాయలు పెంచాడు"

"అందుకే తలంటుకుని కొత్త బట్టలు వేసుకున్నారా !"

అశ్విని నవ్వేశాడు.

"కాదు. నా బర్తుడే యివాళ"

"నిజంగా" అంటూ శుభాకాంక్షలు చెప్పింది మాధురి.

అశ్విని చాక్లెట్లు నాలుగు అందించాడు.

"థాంక్స్" అందుకుని "నాకు ముందు చెప్పలేదు ఎందుకని" కోపం నటిస్తూ అంది.

"ఎందుకూ చెప్పటం. చూడండి, మనిద్దరం మంచి స్నేహితులం. ఇది చాలు. ఏమంటారు"

"ఏమీ అనను"

అశ్విని ఫక్కున నవ్వాడు. అబ్బ యెంత హాయిగా నవ్వగలడో అనుకుంది.

"చూడండీ సాయంకాలం నాక్కాస్త ఆలస్యం అవుతుంది. మీరు వెయిట్ చెయ్యొద్దు"

"అలాగే. ఇంతకీ యేంపని"

"ఇంటర్వ్యూ వుంది"

"మంచిదే వెళ్ళిరండి. అంటే మళ్ళీ రేపుదయం అన్నమాట కల్సుకోవటం"

"అంతే"

"అమ్మో లారీ" మాధురి గాభరాగా సైకిల్ దిగేసి రోడ్డు పక్కగా వెళ్ళిపోయింది.

అశ్విని సైకిల్‌దిగి మాధురి దగ్గరగా వచ్చాడు. లారీ పెద్దగా శబ్దంచేస్తూ దగ్గర అవుతూన్నకొద్దీ మాధురి వణుకుతోంది.

"అరె! అంత భయమా !" అశ్విని మాట విన్పించటంలేదు మాధురికి. లారీ వెళ్ళిపోయింది.

మాధురి తేరుకునేసరికి మరో అయిదు నిమిషాలు పట్టింది. ఆ తర్వాత యిద్దరూ సైకిళ్ళు తీసుకుని బయలుదేరారు.

"మీకు లారీలంటే యింత భయం కలగటానికి కారణం యేమిటి?" అశ్విని అడిగాడు.

"నా చిన్నప్పుడు ఓసారి రోడ్డుమీద ఆడుకుంటున్నాను స్నేహితులతో. ఇలాగే లారీ వస్తోంది. అదే పోతుందిలే అనుకున్నాను. అది సరిగ్గా మా దగ్గరగా వస్తూండగా పొరుగింటివాళ్ళ ఎనిమిదేళ్ళ అబ్బాయి దొంగాట ఆడుతూ పరుగున రోడ్డుమధ్యగా వచ్చాడు. అంతే కన్ను మూసి కన్ను తెరిచేంతలో ఆ అబ్బాయి మీదనించి లారీపోయింది. వాడు రక్తం ముద్దలా అయిపోయాడు. ఆ నాటి దృశ్యం యీనాటికీ నా కళ్ళలో మెదలుతూనే వుంటుంది. ఈ లారీలని చూసినప్పుడల్లా ఆ సంఘటన యీ క్షణంలో జరిగినట్లుగా అన్పిస్తుంది. నన్ను నేను సంభాళించుకోవటానికి చాలా శక్తి కావల్సి వస్తుంది. ఇప్పుడు నా దగ్గర మీరున్నారు. కనుక కాస్త ధైర్యం అనిపించింది. ఎవరూ లేకుండా ఒంటరిగా వుంటే లారీ కన్పిస్తే నా స్థితి చెప్పలేను.

ఆ లారీ నా మీదనుంచే పోయినంత భయంగా అన్పిస్తుంది. ఈ లారీ ఓ బ్రహ్మరాక్షసిలా దీన్ని నడిపే డ్రైవరు పరమ కిరాతకుడిలా కన్పిస్తారు. నాకే గనుక అధికారం వుంటే యీ లారీలని మనుషులు నడిచే రోడ్డుమీద నడవకుండా ఆర్డర్ వేస్తాను. వెధవ లారీలు, యివి యిప్పటికే యెందరు అమాయకులని పొట్టన పెట్టుకున్నాయో !"

మాధురి ముఖం ఎర్రబడిపోయింది.

"మన దారులు చీలిపోతున్నాయి. వస్తానండీ..." చెయ్యి వూపుతూ వెళ్ళిపోయాడు అశ్విని.

అశ్విని ముఖం యీరోజు మరీ అందంగా కన్పిస్తోంది. అతని ముఖాన కుంకుమ యెవరు పెట్టి వుంటారు. తల్లా! చెల్లెలా! వదినగారా! భార్యా! యేమో!

"అన్నట్లు ప్రతి రోజూ వుదయం మనతో బాటు వచ్చే సైకిల్ తాతగారు వారం రోజులనించీ కన్పించటం లేదు. కారణం మీకు తెల్సునా."

"తెలియదే"

"అరె... మరి తెల్సుకో వద్దటండీ మనం ముగ్గురం ఒకే టైముకి కల్సి ఈ రోడ్డు మీదే ప్రయాణించే సహ బాట సారులం కదండీ."

"నిజమే అయినా ఆయన మీ కాలనీ లోనించే వస్తాడు, కనుక తెల్సుకోవటం మీ విధి. తెల్సుకుని రేపు చెప్పండి."

"సరే. కనుక్కుంటాను "

"భలే మనస్తత్వం యితనిది." అనుకుంది. ఇలా యిద్దరూ కల్సి వెళ్ళటం రావటం చాలా మంది కాలనీ వాళ్ళు చూస్తూనే వున్నారు. చెవులు కొరుక్కుంటూనే వున్నారు. ముసి ముసి నవ్వులు నవ్వుతూనే వున్నారు.



# 9

ధనంజయరావు ఆదివారాలు యింట్లో వుండటం లేదు.

"ఎక్కడికి వెడుతున్నారు" అహల్య అడిగింది.

"నీకెందుకు" చికాకుపడి పోతూ అన్నాడు.

"నాక్కావాలి. చెప్పండి"

"పనివుంది !"

"ఏం పని?" రెట్టించింది అహల్య.

"డబ్బు సంపాదిద్దామని"

"డబ్బా ! ఎక్కడనించి ! యెలా!"

"అదంతా నీకు అనవసరం"

"కాదు. అవసరం"

"చెప్పను"

"చెప్పితీరాలి! చెప్పకుంటే మీరు యింట్లోనించి వెళ్ళేందుకు వీలులేదు"

ధనంజయరావు జవాబు చెప్పలేదు. అహల్యకి ఆవేశం ముంచుకు వస్తోంది. అయినా ఆవేశాన్ని అణచుకుంటూనే శాంతంగా అంది.

"చూడండి. మనకి మీరు తెస్తున్న

జీతం చాలు. ఆ డబ్బుతో యిల్లు దిద్దుకో గలను. నా కింతకు మించి యింకేం కావాలనీ కోరికలు లేవు. ఈ చాలీ చాలని జీతంలోనే శాంతిగా సుఖంగా తృప్తిగా యిన్నాళ్ళూ బ్రతికాం. ఇక ముందూ బ్రతుకుదాం. మీరు అర్థంలేని ఆలోచనలతో ఈ పరిస్థితిని తారుమారు చేయకండి. నా మాట వినండి. తృప్తికి మించిన సుఖంలేదు. డబ్బు సంపాదించుకున్న కొద్దీ సుఖాన్ని పొందవచ్చు నిజమే. కానీ ఆ సంపాదించుకునే డబ్బు స్వయంగా సంపాదించుకుంటేనే తృప్తి దొరుకుతుంది. మీకంటే నాకు తెలుసు అని చెప్పటం లేదు. కానీ మీరు ఈ మధ్య అదోలా ప్రవర్తిస్తున్నారు. ఇందుకు నాకు భయంగా వుంది. చెప్పండి మీరేం చేస్తూన్నారు. ఎక్కడ తిరుగుతూన్నారు"

"అహల్యా! అనవసరంగా గాభరా పడుతున్నావు. ఏం చెయ్యటం లేదు నువ్వు నిశ్చింతగా వుండు"

ధనంజయరావు యింతకు మించి యింకేం చెప్పలేదు. ఇలా అని ప్రతి రోజూ యిదివరకులా ఆరు గంటలకే ఆఫీసునించి యింటికి రావటం లేదు. అహల్యకి యేం చేయటానికీ తోచటం లేదు. లోలోపల అశాంతి పడిపోతూ వుంది.

"అహల్యా! కోకిలమ్మ మొగుడికి గుర్రప్పందాలలో అయిదువేలు వచ్చాయట క్రితం ఆదివారం" అన్నాడు ధనంజయరావు.

"అలాగా! అతను కన్పించే చెప్పాడా"

"లేదు.....ఆ......అవును...... కన్పించాడు"

"ఈ పందేలకి వెళ్ళే వాళ్ళు ఖర్చు పెట్టిన డబ్బు చెప్పరుగానీ గెల్చినది మాత్రం గొప్పగా చెప్పుకుంటారు" అహల్య కోపంగా అంది.

"అది కాదోయ్. అసలు లక్ వుంటే యీ పందేల్లో గెల్చి లక్షాధికారులూ, కోటీశ్వరులూ అయినవాళ్ళు వున్నారు. మొన్న మొన్న ఓ రిక్షా లాగేవాడికి లక్ష వచ్చింది." "ఆ" అంటూ భర్త ముఖంలోకి చూస్తూ వుండిపోయింది. ధనంజయరావు ముఖం తిప్పుకున్నాడు.

"అరె...టైము అయింది ఆఫీసుకి. త్వరగా వడ్డించు" అన్నాడు.

అహల్య వంటగదిలోకి వెళ్ళింది. మాధురి "అమ్మా నే కాలేజీకి వెళ్ళివస్తా" అని చెప్పి సైకిల్ తీసుకుని బయలు దేరింది. ఇవాళ చాలా ఆలస్యం అయింది అశ్విని యెదురు చూసిచూసి వెళ్ళిపోయివుంటాడేమో అనుకుంటూ సైకిల్ వేగంగా పోనిస్తోంది.

అశ్విని వంతెన దగ్గర అర్థగంట నించీ వెయిట్ చేస్తున్నాడు. యెంద రెందరో వస్తూపోతూన్నారు కానీ తను యెదురు చూసే మాధురి మాత్రం యెక్కడా కన్పించటం లేదు. రోడ్డు మీద గేదెలనీఆవులనీ తోలుకుపోతున్నారు పశువుల కాపరులు. వాళ్ళేదో పదాలు పాడుతున్నారు. గేదెలూ ఆవులూ రోడ్డుకి మధ్యగా నడుస్తున్నాయి.

"ఎందుకింత ఆలస్యం అయివుంటుం

దబ్బా! అందరమ్మాయిల్లా మా ధురి ముస్తాబు కూడా యెక్కువ చేసుకోదే! ఈ అమ్మాయి ముస్తాబు మూడు క్షణాల్లో ముగించవచ్చు. సోమవారం రోజ్ కలర్ చీరె నల్ల జాకెట్. మంగళ వారం బ్లూ కలర్ చీరె అదే కలర్ జాకెట్. బుధవారం ఆకు పచ్చనేత చీరె అదే రంగు జాకెట్. ఇంక గురువారం ఏం చీరె...అరె గుర్తు రావటం లేదే! ఆ... లైట్ మీద చక్స్ అంటే హేం డ్లూమ్ కోటా శారీ... శుక్రవారం మళ్ళీ సోమవారం నాటి రోజ్ కలర్ శారీ. ఖచ్చితంగా యివే కట్టుకు వస్తుంది. మాధురికి చీరెల టైం టేబిల్ వుందేమో మరి! ఔను అందరమ్మాయిల్లా ఖరీదైన చీరెలూ కట్టుకోదు. సిల్కులు అసలే కట్టదు. అన్నీ నేత చీరెలే. కళ్ళకి కాటుక, ముఖాన యెర్రటితిలకం, యెడం చేతికి పాతకాలం నాటి నయాపైసంత రిస్ట్ వాచీ, కుడిచేతికి నాలుగు మట్టి గాజులూ మెడలో సన్నటి ఒకే వరస చైను. ఇంతే యీ అమ్మాయి ముస్తాబు.. అయినా ముఖంలో కళ వుంది. ఏదో తెలియని ఆకర్షణ వుంది ఆ కళ్ళలో. ఈ అమ్మాయి ఒక్కోరోజు చాలా హుషారుగా వుంటుంది. ఒక్కో రోజు డల్‌గా వుంటుంది. కారణం యేమిటి! అని అడగాలనిపిస్తుంది. కానీ యేమను కుంటుందో!"

అంతలో మాధురి వచ్చేసింది.

"హల్లో మాధురి గారూ యింత ఆలస్యం చేశారేమిటి!" తనే పలకరిస్తూ సైకిల్ యెక్కాడు.

"అరే! యింత ఆలశ్యం అయినా యింకా వెయిట్ చేస్తున్నారా! వెళ్ళిపోయి వుంటారు అనుకున్నాను. సారీ. చాలా ఆలశ్యం అయింది."

"సారీ చెప్పేశారు" యింకేం మాట్లాడను. అన్నట్లు ముఖ్య విషయం"

"ఏమిటి!"

"మనతో ప్రయాణం చేసే సైకిల్ తాతగారి విషయం వాకబుచేశాను. పాపం ఆయనకి నాలుగు రోజులుగా జ్వరం వస్తోందట! యింటికి వెళ్ళి చూసి వచ్చాను."

"భలేవారు. వెళ్ళి ఏం అడిగారు."

"ముందు నన్ను నేను పరిచయం చేసుకున్నాను. కానీ ఆయన గుర్తించ లేదు. అప్పుడన్నాను 'ఒకే దారి వెంట కలిసి ప్రయాణించే సహబాటసారులం కదండీ మనం. మనతో ఓ అమ్మాయి కూడా వస్తూంటుంది. ఆ అమ్మాయే మీ విషయం కనుక్కురమ్మని పంపింది' అన్నాను."

"ఆఁ" ఆశ్చర్యపోతూ అంది.

"వూఁ!" కొంటెగా చూస్తూ చెప్తున్నాడు అశ్విని.

"ఆ తాతగారేమన్నారు"

"బోలెడంత సంతోషపడిపోయారు. ఆయన వయస్సు అరవైట. పిల్లలు పెద్దవాళ్ళుఅయి రెక్కలు వచ్చి యెగిరి పోయారట. ఇంక ఆయనా, ఆయన భార్యా మిగిలిపోయారట. కష్టపడి యేదో షాపులో చిన్న వుద్యోగంచేసి ఆ డబ్బుతో కష్టం మీద భార్యా భర్త లిద్దరూ కాలం వెళ్ళ బుచ్చుకుంటున్నా

రట."

"పాపం"

"ఆ ముసలామె, అంటే మనకి నాయనమ్మగారు అనుకుందాం చాలా ఆత్మీయంగా మాట్లాడారు"

"యింకా"

"అప్పుడప్పుడూ వస్తూండు నాయనా అన్నారు"

"ఇంకా"

"వాళ్ళు అన్నది అన్నట్లు చెప్పాలంటే మీరు కోపగించుకోకూడదు."

"చెప్పండి."

"చెప్పను ... అరెరె ... మీ దారి అటు...నా దారి యిటు ... వెళ్ళిపోతున్నాను."

అశ్విని రూటు మార్చేశాడు. యిది గ్రహించింది మాధురి. అతను చెప్పాలని అనుకున్న మాటే చెప్తాడు. కానీ మరో అక్షరం కూడా చెప్పడు. అందుకే యింక యీ విషయం వదిలేసింది. అశ్విని తను వెళ్ళే రోడ్డు వచ్చినా వెళ్ళకుండా ఆగిపోయాడు. మాధురీ ఆగింది.

"ఏమిటి?" అడిగింది.

"మరి ఆలస్యానికి కారణం చెప్పారు గాదు"

మాధురి పేలవంగా నవ్వింది కానీ జవాబు చెప్పలేదు.

"సాయంకాలం వస్తారుగా"

"వూ! అయితే యిప్పటిలా ఆలస్యం చేస్తే అర్ధక్షణంకూడా వెయిట్ చెయ్యను"

"ఆలస్యం చెయ్యను. దూరంగా వున్న ఈ యింటినించి కాలేజీకి వెళ్లటం రావటం వంటరిగా వారం రోజులు మహా విసుగుపడ్డాను. దారిలో తాగుబోతులూ రౌడీలూ లారీలూ వీటి మధ్యనుంచి ప్రాణాన్ని అరిచేతిలో వుంచుకుని ప్రయాణంచేసే నాకు-మీరు పరిచయం కావటం అదృష్టం. మీరు అత్యంత ఆత్మీయుల్లా అయిపోయారు. ఒక్క రోజు మనం కల్సుకోకున్నా నాకెలాగో వుంటుంది"

మాధురి ముఖం గంభీరంగా వుంది.

"అలాగా! నాకు తెలియదే"ఆశ్చర్యం నటిస్తూ మాధురి ముఖంలోకి చూస్తూ అన్నాడు.

"మీరు అందరి అబ్బాయిల్లాంటి వారు కారు అన్పించింది చూసిన మొదటి రోజునే"

"ఎందుకని?"

"ఆడపిల్లననీ సైకిల్ మీద వస్తున్నాననీ వంటరిగా దొరికాననీ తేలిగ్గా మాట్లాడకుండా గౌరవంగా పల్కరించి నాకు సన్నిహితులైనారు"

"అలాగా"

"ఔను. ఈ సమాజంలో ఓ అబ్బాయీ, అమ్మాయీ యిలా కల్సి ప్రతిరోజూ సైకిళ్ళమీద వెళ్లటం రావటం అన్నది అరుదుగా జరుగుతుందేమో!"

"కావచ్చు"

"మీ ఆలోచనలూ మాటలూ నాకు నచ్చుతాయి"

"వూ చాలు ఇవాళ నన్ను పొగిడేస్తున్నారు. అన్నట్లు మీరిలా యింకాస్సేపు నిల్చుంటే యింకో పీరియడ్ కూడా పోతుంది మీకు. ఆ తర్వాత

మీ యిష్టం"

"మీకు యిబ్బంది లేదా!"

"యెందుకు లేదు. యివాళ నాకు చాలా పని వుంది కూడా"

"అరెరె... మీకు యిబ్బందికల్గించాను కదూ"

"ఫర్లేదు. టైముని యెప్పుడెలా సర్దుకోవాలో నాకు తెల్సు. మరి వస్తాను మాధురీదేవీ మీరూ వెళ్ళిపొండి" సైకిల్ యెక్కేసి వెళ్ళిపోయాడు అశ్విని. మాధురి కాలేజీ వైపు సైకిల్ తిప్పింది.



# 10

అశ్విని సాయంత్రం మాధురి చెప్పిన టైముకే వచ్చేశాడు. మాధురి మాత్రం యింకా రాలేదు. పది నిముషాలు పావుగంట అర్ధగంట గడిచింది. అశ్వినిలో ఓప్పు నశించింది. 'హుష్' నిట్టూర్చాడు. వెళ్ళిపోవాలని సైకిల్ తీసుకున్నాడు. కానీ మనస్సు ఒప్పటం లేదు. మాధురి వంటరిగా వెళ్ళవల్సివస్తుంది. అసలే యీ రోడ్డు మీద తాగుబోతులు యెక్కువ. కల్లు దుకాణాలూ యెక్కువే. లారీలూ సరేసరి. ఇన్నింటిని తప్పించుకుని యేం వస్తుంది ఒంటరిగా. వెయిట్ చేయక తప్పదు. మాధురి వచ్చే దిశగా చూస్తూ నిల్చున్నాడు. ఆ రోడ్డు మీది నించి సైకిల్‌లో మగాళ్ళు చాలా మందే వస్తారు. కాని ఆడపిల్ల వచ్చేది ఈ అమ్మాయి ఒక్కర్తే. అసలు మాధురి యెంత దూరంలో వున్నా గుర్తించ గలడు తను. ఈ అమ్మాయి ఒకవేళ వెళ్ళిపోలేదుగదా! వుహూ. వెళ్ళదు. మళ్ళీ చూశాడు. మాధురి కోసం. దూరంగా కన్పించింది. 'అమ్మయ్య' అనుకున్నాడు. అయితే సైకిల్ నడిపించుకుని వస్తోంది. సైకిల్ టైరులో గాలిపోయిందో లేక 'పంక్చర్' అయిందో మాధురి వచ్చేసింది.

"సారీ యిప్పుడూ ఆలశ్యంనాదే. సరీగ్గా టైముకే బయలుదేరాను. కానీ, దారిలో గాలి పోయింది. ఈ దగ్గరలో యెక్కడన్నా సైకిల్ షాపు వుందా!"

అశ్విని మాధురి ముఖంలోకి చూస్తూ వూరుకున్నాడు.

"అశ్విని గారూ! మీరే వుపాయం చెప్పాలి."

"మీరిక్కడే వుండండి. ఆ సైకిల్ ఇలా యివ్వండి. నేను త్వరగా వచ్చేస్తాను గానీ లారీలు వస్తే భయపడి యెటూ పారిపోకండి. వెతుక్కోలేక యిబ్బంది పడిపోతాను. మీరలా భయపడినట్లు గ్రహించారా ఆ లారీలవాళ్ళు మరీ ఆడిస్తారు."

మాధురికి కోపం వచ్చింది. అశ్విని యిదేం పట్టించుకోకుండా తన సైకిల్ ఎక్కి మాధురి సైకిల్ మరో చేత్తో పట్టుకుని స్పీడుగా వెళ్ళిపోయాడు.

మాధురి వంటరిగా నిల్చిపోయింది. రోడ్డు వెంట వెళ్ళేవాళ్ళూ వచ్చేవాళ్ళూ మాధురి ముఖంలోకి అదోలా చూస్తూపోతున్నారు. యిందుకు మరీ విసుగ్గా వుంది. దూరంగా లారీ వస్తోన్న శబ్దం. ఆ శబ్దం భయంకరంగా చెవుల్లో హోరెత్తిస్తూన్నట్లు అన్పిస్తూ వుంది. రోడ్డుకి దూరంగా వెళ్ళిపోయి ముఖం రెండు చేతులతోనూ మూసేసుకుంది ఆ లారీ శబ్దం యింకా యింకా దగ్గరవుతూ వుంది. మాధురి వణికిపోతూ నిల్చుంది. లారీ డ్రైవరు కళ్ళు మిటకరించి మాధురివైపు చూస్తూన్నాడు. అతని పక్కన కూర్చున్న మరో యిద్దరు గొల్లున నవ్వుతూన్నారు.

వాళ్ళ నవ్వులు లారీ వెళ్ళిపోయినా యింకా విన్పిస్తూన్నట్లే వుంది. మాధురికి వణుకు యింకా తగ్గలేదు.

"మాధురిగారూ యిదిగో మీ సైకిల్. లారీని చూసేనా యింత దూరంగా వచ్చేశారు. చూడండి రేపటినించీ యీ సైకిల్ ప్రయాణం మానేసేయండి" విసుగ్గా అన్నాడు.

మాధురి మెల్లగా కళ్ళు తెరిచింది. అశ్విని మాటలు చెవికి యెక్కలేదు.

"మీ భయం చూసి ఆ లారీలో వున్న వాళ్ళు యెలా నవ్వుతున్నారో చూశారా"

మాధురికి భయం తగ్గి అభిమానం ముంచుకువచ్చింది.

"నవ్వనివ్వండి. యేం చేస్తాను" అంది రోషంగా.

అశ్విని మాధురి బాధని అర్థం చేసుకున్నాడు.

"సరే పదండి పోదాం"

మాధురి సైకిల్ తీసుకున్నది. యిద్దరూ బయలుదేరారు.

"మీ సహాయానికి కృతజ్ఞతలు."

"మీరు నాకు కృతజ్ఞతలు చెప్పటం కాదు. కాలేజీనించి వచ్చేప్పుడు సైకిల్‌లో గాలి వుందో లేదో చూసుకోవాలి. నేను లేకుంటే ఇవాళ మీరెంత యిబ్బందిపడెవారు., చీకటి పడిపోతే యీ రోడ్డున రావటం అంత మంచిదికాదు"

"ఔను" మాధురి పొడిగా అంది. అశ్విని మాధురి ముఖంలోకి చూసి జాలిపడ్డాడు. అరె... ప్రొద్దుటి నించీ అదోలా వుంది. మర్చిపోయాను అని కోపం తగ్గించుకుని ఆత్మీయంగా అడిగాడు.

"మాధురిగారూ యివాళ యెందుకు అదోలా వున్నారు?"

"బానే వున్నానే"

"లేదు. నేను గ్రహించగలను. చెప్పండి. కారణం యేమిటి?"

"మీ దగ్గర...మీదగ్గర...రివాల్వర్ వుందా? వుంటే గురిచూసి కాల్చటం వస్తుందా?"

"మాధురీ"

"మీకు వస్తే... నాకు... నాకు... నేర్పిస్తారా!"

"మాధురీ...ఏమిటి యివాళ యిలా మాట్లాడుతూన్నారు. రివాల్వర్ ఏమిటి?"

ఆతురతగా అడుగుతూన్న అశ్విని ముఖంలోకి చూసి అతని గాభరా గుర్తించి నవ్వు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తూ "అరె! అంత ఖంగారెందుకండీ.

వుత్తినే రివాల్వర్ గురిచూసి...కాల్చటం నేర్చుకోవాలన్నది...ఒట్టి హాబీ మాత్రమే యింతే!''

"హాబీనా! యిదేం హాబీ! హాబీ అనే దెప్పుడూ మంచిదిగా వుండాలి"

"నిజమే అనుకోండి. యింతకీ మీ దగ్గర రివాల్వర్ వుందా లేదా!"

"ఎందుకు అని అడుగుతున్నాను. రివాల్వర్‌తో మీకేం పని?" తీక్షణంగా చూస్తూ అడిగాడు.

"వుట్టినే అని చెప్పాగా"

"నాకు నమ్మకం లేదు, అసలే ఈ రోజు మీరు అదోలా వున్నారు. మీ ముఖం కూడా అదోలా వుంది. కారణం చాలా సార్లు అడిగాను. చెప్పలేదు"

"అబ్బే...ఏం లేదు అన్నాగా. ఆ... మన కాలసీలు వచ్చేశాయి మరి నేను వెళ్ళి పోవాలి"

"ఆగండి" అశ్వని గట్టిగానే అన్నాడు.

"యివాళ ఇంటికి త్వరగా వెళ్ళాలి. వస్తాను" మాధురి వేగంగా వెళ్ళి పోయింది.



## 11

ధనంజయరావు నాలుగు రోజులుగా యింటికి రాలేదు. అహల్యా గాభరా పడిపోయి ఆఫీసుకి కబురంపింది.

'సెలవులో వున్నారు' అని చెప్పారు.

"సెలవు పెట్టి యీయన యెక్కడికి వెళ్ళినట్లు! నాతో చెప్పకుండా యిలా యెప్పుడూ యెక్కడికీ వెళ్ళలేదే! అని ధనంజయరావుకి పరిచయంవున్న మరి కొందరికి కబురుపంపింది వాళ్ళు "తెలి యదు. ఆయన ఈమధ్య సరిగాఆఫీసుకే రావటం లేదు" అన్నారు.

నాంచారమ్మ భర్త వచ్చాడు. అహల్యా కన్నీళ్ళు వత్తుకుంటూ అడిగింది.

"మీకైనా తెలుసునా అన్నగారూ ఈయన యెక్కడికి వెళ్ళారో"

ఆయన చాలాసేపు తటపటాయించి ఆఖరికి చెప్పాడు.

"చెల్లెమ్మా! అతనికి మధ్య గుర్ర ప్పందాలు ఆడే అలవాటు యెక్కు వైందని విన్నాను. ఆ కోకిలమ్మ మొగు డితో కల్సి మొదట వెళ్ళేవాడట కానీ... అక్కడ మరెవరితోనో పరిచయం పెరి గిందట."

"ఎవరు...వాళ్ళు"

నాంచారమ్మ మొగుడు జవాబు చెప్పకుండా తప్పించుకుంటూ

"చెల్లెమ్మా! ధనంజయరావు యివాళ యింటికి వస్తాడేమో చూద్దాం. లేకుంటే నేవెళ్ళి పిలుచుకు వస్తాను" అని చెప్పి వెళ్ళిపోయాడు— అహల్యాకి మనస్సు మనస్సులో లేదు.

ఈయనకి తిండీ తిప్పలూ బట్టలూ యిన్నీ యివ్వగల ఆ స్నేహితులెవరు! యెందుకిస్తారు! అవన్నీ యిచ్చినా

ఈయన యింటికి కూడా రాకుండా వుండవల్సినంత పని యేముంటుంది! ఈ విషయం యేమిటో అర్థం కావటం లేదు. అహల్య యింట్లో యే పనీ చేయ లేక పోతోంది. అస్తమానం వీధి వాకిలి దగ్గరే నిల్చుని భర్తరాక కోసం యెదురు చూస్తోంది. యిలా చూడగా చూడగా ధనంజయరావు వచ్చాడు. మామూలుగా వున్నాడు. నాలుగు రోజులుగా యెందుకు రాలేదో తనంత తనుగానే చేప్తాడేమో అని చూసింది అహల్య. ఆయన చెప్ప లేదు.

అహల్య ఆగలేకపోయింది. శాంతం తెచ్చుకుంటూనే అడిగింది.

''ఇన్నాళ్ళూ యెక్కడికి వెళ్ళారు.''

''పని వుండి ఓ స్నేహితుడి దగ్గర వుండి పోయాను.''

ఈ జవాబు అహల్యకి నచ్చలేదు. యదార్థం చెప్పటంలేదని తెల్సు. కానీ నిజం చెప్పించటం యెలాగో తెలియటం లేదు.

''మీరు ఆఫీసుకి సెలవు పెట్టారా?''

''కాస్త కాఫీ ఇవ్వు ముందు. నేను స్నానం చేయాలి వేడి నీళ్ళు పెట్టు.''

తన ప్రశ్నకి జవాబు చెప్పకుండా యిలా మాట మారుస్తున్నందుకు వళ్ళు భగ్గుమంది. భర్త ముఖంలోకి చుర చురా చూసింది. ఆయన యేం మాట్లాడ కుండా బట్టలు మార్చుకుంటున్నాడు. ఏదో పాకెట్ పక్కనపెట్టి బాత్ రూమ్ లోకి వెళ్ళాడు. అదేమిటో అని విప్పి చూసింది. చాలా ఖరీదైన పాంటూ, షర్టూ పట్టినవి వున్నాయి ఇవి. భర్త సైజువి' ఇంత ఖరీదైనవి కుట్టించుకునేందుకు డబ్బెలా వచ్చింది. ఇంట్లో మేం పచ్చడి మెతుకులతో కాలక్షేపం చేస్తుంటే యీయనకి యింత ఖరీదైన బట్టలా. అసలీ బట్టలకి డబ్బు యెక్కడిది! అప్పులు చేస్తున్నారా! చేస్తే తీర్చటం యెలా! ఊహు ... అప్పుచేసే అలవాటు ఇదివరకు లేదు. యిప్పుడు నేర్చు కున్నారా!

అహల్య మనస్సులో తుఫాను ప్రారంభమైంది. ధనంజయరావు ముఖం కడుక్కుని వచ్చాడు. ఇంకా అహల్య అక్కడే నిలబడి వుండటంచూసి ముఖం చిట్లించుకుంటూ "కాఫీ యేదీ!"

"కాఫీ తర్వాత యిస్తాను. ముందు నాకు జవాబు చెప్పండి. ఈ నాలుగు రోజుల నించీ యెక్కడున్నారు! యేం చేశారు? ఈ కొత్త బట్టలు యెక్కడివి? ఎవరిచ్చారు? ఎందుకిచ్చారు? మీరు ఎందుకు తీసుకొన్నారు? మీరిన్నాళ్ళూ వున్నాను అంటూన్న ఆ స్నేహితులు యెవరు? నిజం చెప్పండి."

ధనంజయరావు విసుగుపడిపోతూ ఆ గదిలో ఇటూ అటూ తిరుగుతూన్నాడు కానీ జవాబు చెప్పలేదు.

"చెప్పండి ... మీరు చెప్పి తీరాలి" అహల్యకి ఆవేశం యెక్కువ అవు తోంది.

"నీకు చెప్పవలసిన అవసరం లేదు అనవసరంగా ఆవేశపడకు" కఠినంగా అన్నాడు.

"మీకు చెప్పవల్సిన అవసరం లేకున్నా తెల్సుకోవల్సిన అవసరం

నాకుంది. చెప్పండి. చెప్పి తీరాలి? చెప్పకపోతే వూరుకోను."

"నేనెక్కడ వుంటే నీకెందుకు. ఇప్పుడు వచ్చానుగా"

"వచ్చారు. వచ్చినందుకు చాలా సంతోషం. కానీ మీరు చెప్పకుండా యెక్కడికో వెళ్ళి యిల్లు చేరకపోతే ఈ నాలుగు రోజులుగా నేనూ పిల్లలూ మీ కోసం యెంత ఆరాటపడ్డామో, ఆవేదన పడ్డామో కాస్త అయినా ఆలోచించారా!"

"ఆరాటమా! ఎందుకు?"

"ఎందుకా! మీ జీవితంలో భాగం పంచుకున్న భార్యని కనుక"

"ఔనౌను. భాగం పంచుకున్న భార్యవి కనుక నీ బాధ్యత నాకుంది. పిల్లల బాధ్యతా వుంది. అందుకే ఇదిగో మీ కోసం మీ అవసరాల కోసం డబ్బు తెచ్చాను. ఇస్తాను"

"తీసుకో హాయిగా ఖర్చు పెట్టుకుని నిశ్చింతగా వుండు. ఇదిగో అయిదు వందలు తీసుకో. చూడు నీకు తెలియకుండా నీ పెట్టెలోనించి నెలాఖరున ఖర్చుకోసం వుంచిన డబ్బు యీ మధ్య చాలా సార్లు తీసుకుని ఖర్చుచేసి నిన్ను బాధ పెట్టాను. చూడూ యిప్పుడింక నాకు డబ్బుకి లోటు లేదు. నాతోబాటు నీకూ వుండదు. నీకెంత కావాలన్నా అడుగు యిచ్చేస్తాను"

అయిదు వందల రూపాయిల కాయితాలు అహల్య ముఖం దగ్గరగా తెచ్చి యిటూ అటూ కదిలించి చేతిలో పెట్టబోయాడతను.

అహల్యే నిర్ఘాంతపోయి చూస్తోంది వందరూపాయిల కాయితాలనీ ధనంజయరావు ముఖాన్నీ. ఆయన తనెరిగిన ధనంజయరావులా లేడు. ఈయనలో యేదో పెద్ద మార్పు కన్పిస్తోంది. ఇది యేమిటో ఎలా వచ్చిందో! అయిదు వందలు ఈయన ఒక్కసారి యెలా సంపాదించగలిగాడు! ఇది వుద్యోగానికి సంబంధించిన జీతం కాదు. కాదని తెల్సిపోతూనే వుంది. మరీడబ్బు ఎలా వచ్చింది! ఆలోచిస్తూ వుంది అహల్య.

ధనంజయరావు భార్య గాభరా చూసి పెద్దగా నవ్వాడు.

"ఏం నకిలీ నోట్లు తెచ్చి నిన్ను ఆడిస్తున్నాను అనుకుంటున్నావా! కాదు అచ్చమైన నోట్లు! కావాలంటే చూసుకో. నీ అనుమానం తీర్చుకో. అయిదు వందలూ చాలకుంటే యింకా కావాలా! అడుగు యిచ్చేస్తాను. నువ్వూ నీ పిల్లలూ తిననీడి. హాయిగా బ్రతకండి. అంతే కానీ నువ్వు యెక్కడికి వెళ్ళావ్? ఏం చేస్తున్నావ్? యెవరిదగ్గర వున్నావ్? ఎలా సంపాదించావ్? అనే చవట ప్రశ్నలు మరి వెయ్యకు. వేసి నాకు విసుగు తెప్పించకు. నాతో తగాదా పెంచుకుని యిరుగూ పొరుగుని రప్పించకు. అర్థమైందా!"

అయిదు వందల రూపాయిలనీ అహల్య మీదికి విసిరి పడక గదిలోకి వెళ్ళి తలుపు బిగించుకున్నాడు ధనంజయరావు. అహల్యకి యీ ప్రపంచం అంతా గిర్రున తిరిగి పోతూన్నట్లు అన్పిస్తోంది. అది అలా తిరిగి తిరిగి తననెత్తినే పడిపోతూన్నట్లు అన్పి

స్తూంటే అహల్యకి స్పృహ తప్పినట్లు అయింది క్షణం. కానీ తననుతాను నిలవ దొంచుకో గల్గింది. తెలివి తప్ప లేదు. జరిగింది తెలుస్తూనే వుంది. భర్త అన్న మాటలు మళ్ళీ మళ్ళీ చెవుల్లో రింగ్ మంటూన్నట్లు విన్పిస్తున్నాయి. అవి చెవులని దద్దరిల్ల చేస్తూన్నట్లు అని పిస్తోంది.

ఇదంతా కలా! నిజమా! నా జీవితంలోనేనా యిలా జరుగుతూ వుంది! ఔను... జరుగుతూ వుంది. తన భర్త-తననీ పిల్లలనీ ప్రాణం కంటే మిన్నగా చూసుకునే భర్తే క్షణం క్రితం యెన్ని మాటలు అన్నాడు. ఎలా అన్నాడు! అహల్యకీ ఆలోచనల్తో తల దిమ్మెక్కి పోయింది. వందరూపాయల కాయితాలు గాలికి ఇటూ అటూ యెగురుతున్నాయి. పిచ్చిదానిలా వాటివైపు చూస్తూ వుండి పోయింది.

మాధురి కాలేజీనించి వచ్చింది. సైకిల్ లాక్ చేసి తాళంచెవీ పుస్తకాలూ తీసుకుని లోపలికి వచ్చింది. కదలిక లేనట్లు రాయిలా కూర్చున్న తల్లిని తెల్ల బోయి చూసింది. "అమ్మా! అమ్మా! యేమైందమ్మా"? గాభరాగా దగ్గరగా వస్తూ అడిగింది.

అహల్య జవాబుచెప్పగల స్థితిలో లేదు. కిందపడి యిటూ అటూ కదులు తూన్న వంద రూపాయల నోట్లని చూసింది మాధురి.

"అరె... ఏమిటివి? ఎక్కడివి?? ఇలా పారేశావేమిటీ! ఎవరిచ్చారమ్మా"

వంగి అయిదు కాయితాలనీ తీసి బొత్తిలా పెట్టి తల్లిదగ్గరగా వచ్చి మళ్ళీ అడిగింది. "అమ్మా! ఇంత డబ్బు ఎవరిచ్చారు! మనకెలా వచ్చింది! అసలు నీకేమైంది. మాట్లాడవేమ్మా."

అహల్య మెల్లమెల్లగా ఈ లోకంలోకి వచ్చింది. ముఖం నల్లగా అయిపోయింది. కళ్ళు యెర్రగా అయ్యాయి.

"మాధురీ యేవీ ఆ నోట్లు?"

మాధురి తల్లిచేతికి యిచ్చేసింది. అహల్య గభాలున నోట్లు అందుకుని వెధవడబ్బు! ఈ డబ్బు కావాలని నేనెప్పుడూ ఈయన్ని కోరలేదు. ఈ డబ్బే నాప్రాణం అనలేదు. ఇన్ని సంవత్సరాలు కాపురంచేసినా నా మనస్సు ఆయనకు తెలియలేదు. ఈ డబ్బుతెచ్చి నా ముఖానవేసి తీసుకుని నోరుమూసుకో అంటూన్నారు. వెధవడబ్బు ... నాకు అక్కర్లేదు. నోట్లని ఫర్న చించి ముక్కలు ముక్కలుచేసి దూరంగా విసి రేసింది. ధనంజయరావు గభాలున గది తలుపు తెరుచుకుని వచ్చేశాడు.

"నీకెంత పొగరు, నేయిచ్చినడబ్బు చించి పోగులు చేస్తావా!" కోపంగా అరి చాడు.

"చించటమేకాదు. నిప్పంటిస్తాను. ఇది మీరు న్యాయమార్గాన సంపాదించిన డబ్బుకాదు, అందుకే యిలా నాశనం చేశాను" ఆవేశంలో వూగిపోయింది అహల్య.

"ఎంకూశావ్?" భార్యని కొట్ట టానికి విసురుగా చెయ్యెత్తాడు.

"నాన్నారూ!" మాధురి గాభరాగా దగ్గరకి వచ్చింది. ధనంజయరావు ఆగి

పోయాడు. అహల్య భర్త ముఖంలోకి వెరిడానిలాచూసి "ఛీఛీ ... మీరు ... ఇలా ప్రవర్తిస్తున్నారా! భగవాన్" రెండుచేతులతోనూ ముఖం కప్పుకుని వంటగదిలోకి వెళ్ళిపోయింది. అక్కడ కుప్పలా కూలబడిపోయింది.

ధనంజయరావు చిరిగిన నోట్ల ముక్కలవైపు చూశాడు రెండు క్షణాలు. ఆవేశం ఎక్కువయిపోయింది. ఎదురుగా కూతురు తండ్రి ముఖంలోకి చూస్తూ నిల్చుంది. తను దోషిలా క్షణం వణికాడు. అంతలోనే అహంభావం వచ్చేసింది. విసురుగా యింట్లోనించి వెళ్ళిపోతూ అరిచాడు

"ఇది...స్వర్గంకాదు ...నరకం ... నరకం..."



## 12

రెండురోజుల తర్వాత ధనంజయరావు ఇంటికి వచ్చాడు. ఇంట్లో పిల్లలుగానీ, అహల్యగానీ యెవ్వరూ మాట్లాడలేదు. తనే మధుబాబుని పిలిచి "కాఫీ కావాలి మధూ" అని అడిగాడు. మధు తల్లినడిగితెచ్చి యిచ్చాడు. అలాగే రాత్రి భోజనం కూడా పిల్లలతో కల్సి చేశాడు. భోజనం అయిన తర్వాత ముందుగదిలోకి వచ్చి కూర్చున్నాడు తన ఈజీ ఛైర్‌లో. మాధురీ, జనార్దన్ చాలా సేపు చదువుకుని నిద్రముంచుకు వస్తూంటే పుస్తకాలు మూసి పక్కలు పర్చుకుని పడుకున్నారు. ధనంజయరావు లేచి గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. అహల్య వంటగదిలో చాలాసేపు యేదో సర్దుతూన్నట్లుంది. తర్వాత తలుపులన్నీ మూసి లైట్లు తీసేసి గదిలోకి వెళ్ళింది.

మాధురికి నిద్రపట్టటం లేదు. జనార్దన్‌కీ అంతే. గదిలోనించి యేవో మాటలు విన్పిస్తూన్నాయి. తల్లి గొణుగుతోంది. తండ్రి జవాబు చెప్పటం లేదు అహల్య సణుగుడు ఆపలేదు.

"షటప్. మాట్లాడావంటే పళ్ళురాలగొడతాను" కటువుగా అంటున్నాడు. అహల్య యింక పూరుకుంది.

గదిలో తండ్రి గుర్రు విన్పిస్తోంది. తల్లి ఎక్కిళ్ళు విన్పిస్తూన్నాయి. మాధురికి వచ్చే నిద్రకూడా యెగిరి చక్కాపోయింది. విసుగ్గా అన్పిస్తోంది. లేచి కుర్చీ కిటికీ దగ్గరగా వేసుకుని కూర్చుంది బైటకి చూస్తూ. ఆకాశంలో మబ్బుల చాటున చందమామ దోబూచులాడుతూన్నాడు. అక్కడక్కడా నక్షత్రాలు మెరుస్తూన్నాయి. అంతటా నిశ్శబ్దం ఆవరించి వుంది. అందరూ నిద్రాదేవి వడిలో విశ్రాంతి తీసుకుంటూ వున్నారు. కానీ తనకి నిద్ర కరువు అయింది. ఏవో ఆలోచనలు వస్తూన్నాయి. ఇప్పుడు అశ్విని యేం చేస్తూంటాడు !. టేబిల్ లైటు దగ్గర కూర్చుని చదువుకుంటూ వుంటాడా ! లుంగీ కట్టుకుని బనీను వేసుకుని తువ్వాలు భుజం చుట్టూ కప్పుకుని చదువులో పడి ఆకలినీ టైమునీ మర్చి

పోయిన కొడుకుని తల్లి భోజనానికి లేవరా అశ్వనీ అని పిలుస్తుందా! ఈ పిలుపు విని అప్పుడు టైము చూసుకుని పుస్తకం మూసి తల్లి వెంట వెంట గదిలోకి వస్తాడా! ఆ తల్లి కొడుకు దగ్గరగా కూర్చుని కబుర్లుచెప్తూ కొసరికొసరి వడ్డిస్తుందా!

"అబ్బబ్బ! చాలమ్మా. మరీ ఎక్కువ వెయ్యకు" అని విసుక్కుంటాడా.

"నీ కసలు పెళ్ళి చేసి ఓ గుదిబండని తగిలిస్తే కానీ చెప్పిన మాట వినవు" అంటుందా!

తల్లి యిలా అంటే అశ్వని ఏమంటాడు!

మాధురి మనస్సు యెగిరి అశ్వని దగ్గరకి చేరుకుంది. అశ్వని గురించిన ఆలోచన రాగానే మనస్సులో వున్న చికాకు యెక్కడికి పోయిందో తెలియదు. అశ్వని ముఖం కళ్ళలో మెదులుతోంది. మంచి స్నేహితుడు. ముఖ్యంగా స్త్రీని గౌరవభావంతో చూసే సంస్కారం అతనిలో వుంది. ఈ భావమే మరీ మరీ ఆకర్షణకి కారణం అయివుంటుంది. తండ్రి ప్రవర్తన చూస్తూంటే అసలు యీ మగజాతి అంటేనే అసహ్యం పెరుకుపోతోంది. కానీ అశ్వనిని చూస్తూంటే, పరిచయం పెరుగుతూవుంటే అతనంటే గౌరవం, అభిమానం, ఆత్మీయతలో మనస్సు నిండుతోంది. అతనంటే నాకిలా యెందుకు అవుతోంది. మాధురి అలా ఆ కిటికీ దగ్గర యెంత సేపో కూర్చుని ఆలోచిస్తూ అర్ధరాత్రి గడిచిన తర్వాత నిద్రపోయింది.



# 13

రెండు రోజుల తర్వాత మళ్ళీ ఆ రోజు మాధురి తనకోసం వెయిట్ చేస్తూన్న అశ్వనిని చూస్తూ సైకిల్ ఆపి అడిగింది.

"ఎక్కడికి వెళ్ళారు?"

"రెండు రోజులూ రెండు ఇంటర్వ్యూలకి వెళ్ళాను. ఇందులో ఒకటి 'రాదు' అని ఆశ వదులుకున్నాను. మరోటీ రావచ్చు, రాకపోవచ్చు" నిరాశగా అన్నాడు.

"వస్తుందనే యెదురు చూడండి. ఆ తర్వాత భగవంతుడి దయ''

"భలేవారు. మీకు దేవుడంటే నమ్మకం వుందా! ఆ దేవుడిని నమ్ముతూనే ప్రతి పని చేస్తూవుంటారా!"

"ఆ విషయం తర్వాత. ఇంటర్వ్యూలో మీరు తృప్తిగా జవాబిచ్చారా!"

"ఇచ్చాను. కానీ..."

"ఆ విషయం యింక అనుమానించకండి. మీకీసారి తప్పకుండా వుద్యోగం వస్తుంది''

... ... ...

"నే చెప్తూన్నాను. సరే గానీ అశ్వని గారూ మీరు మీ యింటి విషయాలు యెప్పుడూ ఏం చెప్పరేం"

"ప్రత్యేకత యేం లేదుగా"

"లేదా! రాత్రి నాకు చాలాసేపు నిద్ర రాలేదు. ఏం తోచలేదు. అప్పుడు మీరు గుర్తుకి వచ్చారు. అశ్వనిగారు యీ టైములో ఇంట్లో యెలా వుంటారో? యేం చేస్తూవుంటారో అని ఆలోచిస్తూ కూర్చున్నాను"

"మీ అందరిలానే వుంటాను గానీ యింతకీ నా గురించి అంతగా యేం ఆలోచించారు?"

'నా ఊహల్లో యిలా వుంటారు' అని రాత్రి ఊహించుకున్నదంతా చెప్పింది మాధురి.

"ఇప్పుడు చెప్పండి నా ఊహ కరెక్టేనా?"

అశ్వని మాధురి చెప్పేదంతా కుతూహలంగా వింటూ సైకిల్ పోనిస్తున్నాడు.

"చెప్పండి అశ్వనిగారూ"

అశ్వని చిన్నగా నవ్వాడు. కానీ అతని ముఖం గంభీరంగా మారిపోయింది.

"చెప్పండీ. వినాలని కుతూహలంగా వుంది. నా ఊహ ఎంతవరకూ కరెక్టు! చెప్పండి ఔనా కాదా ?"

"కాదు"

"మరి ?"

"మా అమ్మ వుంది. కానీ, నాకు అన్నం పెట్టలేదు. నేనే ఆమెకి పెట్టాలి" అశ్వని గొంతు భారంగా పల్కింది.

"అంటే ?"

"మా అమ్మకి కళ్ళు కనబడవు"

"అయ్యో! ఎందువల్ల?" ఆశ్చర్యంగా అడిగింది.

"ఈ ప్రపంచం ఎలా వుంటుందో మా అమ్మకి తెలియదు. ఆ నీలాకాశం ఈ విశాలమైన రోడ్లూ, ఈ రోడ్డుమీద నిర్విరామంగా తిరిగే వాహనాలు మనుషులూ, జంతువులూ వగైరా తెలియవు. అసలు సాయం సంధ్యలో యెంత అందంగా వుంటుందో యీ ప్రకృతి ! ఈ దృశ్యాన్ని అమ్మ ఎరుగదు. అంతదాకా ఎందుకు ఆమె కన్న తలిదండ్రులని కానీ, పెళ్ళాడిన భర్తనిగానీ, తన రక్తం పంచుకుని పుట్టిన బిడ్డలనిగానీ చూసి ఎరుగదు. కేవలం గొంతు విని, చేతి స్పర్శవల్లా ఎవరు ఎవరో గుర్తించగలదు."

"పుట్టు గుడ్డి అంటున్నారు కదా ! మరి పెళ్ళి ఎలా అయింది"

ఈ మాటకి అశ్వని గంభీరంగా నవ్వాడు.

"చూడండీ డబ్బు అనేది వుంటే ఈ ప్రపంచంలో కొన్ని తప్ప మిగతా చాలా కొనేయవచ్చు. పుట్టు గుడ్డి అయినా, అనాకారి అయినా, రోగిష్టి అయినా మరేం ఫర్లేదు. ఆడపిల్ల వెనక డబ్బు గనుక వుంటే మగాడు ఆ డబ్బు కోసం ఆశపడి పెళ్ళాడేస్తాడు. ఈ మన సమాజంలో ఎన్నో ఉదాహరణలు కన్పిస్తాయి చూడలేదా మీరు"

"మీ అమ్మకి చాలా డబ్బుందా !"

"ఒకప్పుడు వుండేది. మా తాత గారికి డబ్బు చాలా వుంది. అమ్మ ఒక్కగాను ఒక్క కూతురు. పైగా పుట్టు గుడ్డి. ఈ పిల్లని కంటికి రెప్పలా పెంచి పెద్దచేశారు. అమ్మకి యుక్త వయస్సు వచ్చింది. పెళ్ళిచేయాలి. కానీ

ఈ గుడ్డి పిల్లని ఎవరు చేసుకుంటారు. బైటవాళ్ళు ఎవరైనా ఒప్పుకుని ముందుకి వచ్చారంటే అర్థం అమ్మ అంటే అభిమానంవల్ల కాక ఆమె డబ్బు కోసం వస్తారని తాతయ్యకి తెల్సు ఇందుకే బైటవాళ్ళకి యివ్వకుండా మేనల్లుడికే యిచ్చి పెళ్ళిచేసి యిల్లరికం వుంచుకున్నాడు అల్లుడిని. అమ్మ దాంపత్య జీవితం కొన్ని సంవత్సరాలు సాఫీగానే సాగిపోయిందట. అప్పుడే అన్నయ్యా నేనూ పుట్టామట"

"అరె మీకో అన్నయ్య వున్నారా! ఎప్పుడూ చెప్పలేదేం. ఆయన యెక్కడున్నారు! యేం చేస్తున్నారు!"

"అన్నయ్య డిగ్రీ తీసుకుని యెన్నో వుద్యోగాల కోసం ప్రయత్నించాడు. కానీ వుద్యోగం రాలేదు. విసిగివేసారి చాలా దూరం వెళ్ళిపోయాడు"

"అయ్యో అలాగా! అన్నట్లు మీ అమ్మగారి విషయం చెప్తున్నారుగా. ఆ వివరాలు పూర్తిగా చెప్పండి. ఆ డబ్బు అంతా యిప్పటికీ వుందా మీకు"

"లేదు అదెప్పుడో అయిపోయింది.

"ఎలా పోయింది"

"మా తాతగారు బ్రతికి వున్నంత వరకూ అమ్మకి సుఖంగానే జీవితం గడిచింది! కానీ ఆయన పోగానే అమ్మ వంటరిదైంది. నాన్న అధికారం యెక్కువ అయింది. ఆ పైన కథ మామూలే. ఆస్తి నాశనం అయింది. నాన్న ఆరోగ్యం పాడైంది" నిట్టూరుస్తూ చెప్పాడు అశ్విని.

"తర్వాత" మాధురి కుతూహలంగా అడిగింది. రోడ్డుమీద వస్తూపోతూన్న కార్లనీ, ఆటోలనీ తప్పించుకుంటూ సైకిల్‌ని ముందుకు పోనిస్తూ మాధురిని అనుసరిస్తూనే చెప్తూన్నాడు అశ్విని.

"చెప్పండి తర్వాత యేమైంది"

"ఇంకేం వుంటుంది. అనారోగ్యంతో తీసుకుని తీసుకుని యిల్లు గుల్ల చేసిన తర్వాత కాలం చేశారు మా నాన్న"

"అయ్యో! తర్వాత"

"నాన్న పోయేనాటికి మా అన్నయ్య హైస్కూలు చదువు పూర్తిచేశాడు. నేనింకా చదువుతూనే వున్నాను! నాన్న పోవటం డబ్బు లేకపోవటం, అమ్మకి కళ్ళు కనపడకపోవటం అన్నయ్యా నేనూ చిన్నవాళ్ళం అవటంతో మాయిబ్బందులని అధిగమించటానికి చాలా సంవత్సరాలు పట్టింది. అన్నయ్య ఉద్యోగంలో చేరిన తర్వాతనే మా కష్టాలు గట్టెక్కాయి. నా చదువు పూర్తి అయింది. ఆర్థిక యిబ్బందుల నుంచి యిప్పుడిప్పుడే బయట పడుతున్నాం"

"చూడండి కళ్ళు కన్పించని మీ అమ్మగారు ఇంట్లో వంటరిగా యెలా వుంటారు ?"

"ఇరుగూ పొరుగూవాళ్ళు చాలా మంచివాళ్ళు. అమ్మకి కన్పించదని జాలి పడతారు. ఎవరో ఒకరు సాయంగా వుంటూ వుంటారు. పిలవగానే వస్తారు. అందువల్లనే నేను అమ్మని ఒక్కదాన్నీ వదిలి నిశ్చింతగా యిలా రాగలుగుతున్నాను."

"కొత్తవాళ్ళెవరన్నా వస్తే యెలా"

"సామాన్యంగా తలుపు మూసుకుని

లోపలే వుంటుంది. పనిమనిషిగానీ, పాల వాడుగానీ పిలిస్తే వాళ్ళగొంతు గుర్తించి తలుపు తెరుస్తుంది. ఇంక కొత్తవాళ్ళు ఎవరు వచ్చినా పొరుగునవున్న ఎవరి నన్నా పిలిచి ఆ తర్వాతనే తలుపు తెరుస్తుంది"

"మరి వంటా వగైరా"

"నేను అమ్మకి సాయం చేస్తుంటాను. ఆమె ఎలా చెయ్యాలో చెబుతుంది. చేస్తుంది కొన్నిపనులు. ఏదో యిలా గడిచిపోతూన్నాయి రోజులు. మా అమ్మ మాత్రం రాబోయే కోడలుకోసం ఇప్పటి నించీ ఎదురు చూస్తోంది. గుణవంతురాలైన పిల్ల కావాలట. అంతే...మీరటు నేనిటు. ఇవాళ ఇంత త్వరగా వచ్చేశాం యేమిటి...అన్నట్లు సాయంకాలం మీ టైము చెప్పండి!''

"నాలుగున్నర..."

"సరే ఆ టైము వస్తానుకే! మరి. సెలవా!"

అశ్వని వెళ్ళిపోయాడు మాధురి కాలేజీ వైపుగా సైకిల్ తిప్పింది. కళ్ళు కన్పించకుండా వంటరిగా ఇంట్లో కాలం గడిపే అశ్వని తల్లిగురించే ఆలోచనలు వస్తున్నాయి. పాపం...ఎంత దురదృష్టవంతురాలో. కళ్ళులేకుండా జీవితాన్ని సాగించటం అంటే ఎంతకష్టం. పెళ్ళి, మొగుడు, పిల్లలు. ఓప్ చాలా విచారకరమైన విషయం.

కాలేజీ గేటులోకి వచ్చిన తర్వాతగానీ మాధురి ఆలోచనలకి ఆనకట్ట పడలేదు.



# 14

"మాధురీ బుక్స్ ఎగ్జిబిషన్‌వుంది. అలా వెళ్ళిచూసి ఇంటికి వెడదాం వస్తారా."

సాయంకాలం కాలేజీనించి యింటికి వస్తున్న మాధురిని కల్సుకుని అడిగాడు అశ్వని. మాధురి ఆగి క్షణం ఆలోచించింది.

"మళ్ళీ సిటీలోకి వెళ్ళాలంటే వెనక్కి పోవద్దూ!"

"వెళ్ళాలి"

"ఆలస్యం అవుతుందేమో!"

"త్వరగా వచ్చేద్దాం"

"చీకటి పడుతుంది కదూ"

త్వరగా వచ్చేద్దాంగా. రండి మీరు వెళ్ళిపోతే నేను అంత దూరం నించి ఒక్కడినే రావాలంటే పరమ బోర్ అన్పిస్తుంది!" అశ్వని ఇలా అనే సరికి మాధురి యింకేం చెప్పలేక పోయింది. ఇతను తనకెప్పుడూ తోడుగా వుంటూన్నాడు. ఎప్పుడు యేదీ అడగడు. ఇవాళ ఒక్కసారి అడిగితే కాదని యెలా చెప్పటం. ఎగ్జిబిషన్‌కి వెడితే తప్పకుండా ఆలశ్యం అవుతుంది. "ఎందుకింత ఆలశ్యం అయిందని అమ్మ అడిగితే! ఏం చెప్పటం! అయినా తప్పదు."

"పదండి" అంటూ సైకిల్ వెనక్కి తిప్పింది. రద్దీగా వున్న రోడ్డు మీద ఒకరి వెనుక ఒకరు ప్రయాణిస్తూ యెగ్జిబిషన్ జరుగుతూన్న బిల్డింగ్ చేరుకున్నారు. సైకిళ్ళు స్టాండ్‌లో పెట్టి బిల్డింగ్ వైపుగా బయలు దేరారు.

"చూడండి, చాలా మంది వస్తూన్నారు"

"మనలా వూరికి చివరగా వున్న వాళ్ళు యెవరూ వుండి వుండరు వీళ్ళలో. అందులోనూ సైకిల్‌మీద వచ్చేవాళ్లు అసలు వుండరు కదూ!"

మాధురి యిష్టం లేకుండా తప్పని సరిగా వచ్చిందని మరోసారి రూఢి అయింది. అరె నేను పిలవకుండా వుండాల్సింది. ఎంత ఫ్రెండ్‌ని అయినా చీకటిలో సైకిల్‌మీద కల్సి వెళ్లటానికే కాబోలు భయపడుతుంది. కాదేమో. తల్లి దండ్రులు సంజాయిషీ అడిగితే ఏమని చెప్పాలో తెలియక యీ ఖంగారేమో! ఎంత చదువుకుంటూన్నా ఆడపిల్లలకి పెద్దల ఆంక్షలు యెక్కువ వుంటాయి మరి. సరే త్వరిగా వెళ్ళిపోవాలి అనుకుంటూ నడుస్తూన్నాడు అశ్వని. మాధురి అతన్ని అనుసరిస్తోంది.

"హల్లో అశ్వని కుమార్! యెగ్జిబిషన్‌కి వచ్చావా!" ఓ యువకుడు దగ్గరగా వస్తూ పల్కరించాడు.

"హల్లో ప్రదీప్! చూడటం అయి వెళ్ళిపోతూన్నావా!" అశ్వని అతనికి షేక్ హేండ్ యిస్తూ పల్కరించాడు.

"వూ! ఔనూ ఆ రోజు ఇంటర్వ్యూకి వెళ్ళావు కదూ! ఏమైంది!" అశ్వని పక్కనే వున్న మాధురిని పరిశీలనగా చూస్తూ అడిగాడు ప్రదీప్.

"ఆ వుద్యోగం నాకు రాదు అని అప్పుడే చెప్పేశానుగా. అన్నట్లు యీమె మిస్ మాధురి. బియ్యే ఫైనల్ చదువుతూన్నారు. మా యింటి దగ్గరలో నే వుంటారు."

పరిచయం చేశాడు అశ్వని. ప్రదీప్ చెయ్యి చాచాడు. మాధురి చేతులు జోడించి "నమస్కారం" అంది. ప్రదీప్ కూడా నవ్వి "నమస్కారం" అన్నాడు అదోలా చూస్తూ. "మాధురీదేవీ యితను నా క్లాస్ మేట్ ప్రదీప్"

"అలాగా" అన్నట్లు చూసి తల తిప్పుకుని "పోదామా" అంది.

"ఆ... వెళ్ళిపోదాం. ప్రదీప్ వస్తాను! రండి మాధురిగారూ" అంటూ అశ్వని ముందుకి కదిలాడు.

ప్రదీప్ తనని అదోలా చూడటం భరించ లేకపోయి కాస్త దూరంగా వచ్చిన తర్వాత "అమ్మయ్య" అనుకుంది. జనం గుంపులు గుంపులుగా వస్తూన్నారు పోతూన్నారు. వాళ్ళని తప్పించుకుంటూ అశ్వని ముందుకు నడుస్తూన్నాడు. మాధురి అతన్ని అనుసరిస్తోంది. రకరకాల ఫ్యాషన్స్‌లో అబ్బాయిలూ, అమ్మాయిలూ కన్పిస్తూన్నారు. ఇలా జనంలోకి వచ్చినప్పుడు మాధురికి వూపిరి సలపనట్లుగా అయిపోతుంది. ఈ మనుషుల మధ్యనుంచి ఎంత త్వరగాబైటికి పోగలనా అని అన్పిస్తుంది. అశ్వని, మాధురి యెగ్జిబిషన్

బిల్డింగ్‌కు దగ్గరగా వచ్చి లోపలికి పోబో తుండగా తెల్లగా మెరుస్తూన్న విమానం లాంటి కారు వచ్చి ఆగింది. మాధురీ, అశ్వినీ కారుని తప్పించుకుని మెట్లు యెక్కి లోపలికి పోబోయి జనం గుంపుగా లోపలినుంచి బైటికి వస్తూంటే కాస్త పక్కకి తప్పుకుని ఆగారు. విమానం కారు ఆగగానే డ్రైవర్ దిగి వచ్చి కారు వెనక తలుపు తెరిచి పట్టుకుని వినయంగా నిల్చున్నాడు. కారులో నించి దిగుతూన్న వారివైపు చూస్తూన్న మాధురి క్షణం తెల్ల బోయింది. అంతలోనే ముఖం నల్లగా అయిపోయింది.

అశ్విని ముందుకు పోబోతూ "మాధురిగారూ రండి" అని నాలుగు అడుగులు వేసి వెనక్కి చూశాడు. మాధురి రావటం లేదు. ఆగిన చోటునే రాయిలా నిల్చుంది. ముఖం కందగడ్డలా ఎర్రగా అయింది. కళ్ళు నిప్పులు కురిపిస్తూన్నట్లు తీక్షణంగా వున్నాయి. అశ్విని అర్థం కాని వాడిలా కారు వైపూ, అందులోనించి లోపలికి వస్తూన్న వాళ్ళ వైపూ మార్చి మార్చి చూశాడు. మాధురికి దగ్గరగా నడిచాడు.

"మాధురిగారూ రండి" అంటూన్న అశ్విని చేతిని గట్టిగా పట్టుకుంది.

"మనం వెళ్ళి పోదాం"

"ఎగ్జిబిషన్ చూడకుండానేనా !"

"వద్దు... చూడద్దు. యిక్కడ... ఒక్క క్షణం వుండద్దు... అశ్వినిగారూ వెళ్ళిపోదాం"

అతని చేతిని పట్టుకుని లాక్కువెళ్ళి పోతుంటే అశ్విని ఆశ్చర్యపోతూ మాధురిని అనుసరించాడు. సైకిల్ స్టాండ్ వరకూ అలానే వచ్చి చెయ్యి వదిలేసింది.

"ప్లీజ్ ! త్వరగా వెళ్ళి పోవాలి" అంటూనే సైకిల్ యెక్కేసింది. అశ్విని వస్తూన్నాడా లేదా అని కూడా చూడకుండా స్పీడుగా ముందుకు పోతూ వుంది.

మాధురి ప్రవర్తన అశ్వినికి చికాకు వచ్చేసింది. మాధురి ఎందుకిలా వెళ్ళి పోతోంది! అబ్బ! ఈ అమ్మాయికి బొత్తిగా బుద్ధిలేదు. లేకుంటే అలా వెళ్ళటం యేమిటి! కోపాన్ని మింగేసి వేగంగా వెళ్ళి మాధురిని కలుసుకున్నాడు

మాధురి మాట్లాడలేక పోతోంది. అశ్విని మాధురి ముఖంలోకి చూసేసరికి కోపం పోయి జాలి ముంచుకు వచ్చింది. ఆ కారు యెవరిది? అందులో నించీ దిగిన ఆ యిద్దరూ యెవరు? వాళ్ళని చూసి యీ అమ్మాయి యింత ఆవేశ పడవల్సిన అవసరం ఏమిటి? వాళ్ళు భార్యాభర్తల్లా వున్నారు. వయస్సు నలభై దాటిన వాళ్ళలా వున్నారు. ఆ వయస్సులోకూడా ఒకరి చేతులు ఒకరు పట్టుకుని అలా లోపలికి పోవటం యేం బాగా అన్పించటం లేదు చూసే వాళ్ళకి. కానీ వాళ్ళది పట్టించుకున్నట్లు లేరు. వాళ్ళు యెవరు?

అశ్విని తన ఆలోచనలతోనే సతమతమవుతూన్నాడు. మాధురి ఉన్మాదినిలా సైకిల్‌ని పోనిస్తోంది. ఇది చూసి ఖంగారు పడిపోతూ

"మాధురిగారూ... అంత స్పీడుగా పోకండి" అరిచినట్లే చెప్పాడు.

మాధురి జవాబు చెప్పలేదు. సైకిల్ వేగాన్ని తగ్గించనూలేదు.

"ఇవాళ యీ అమ్మాయికి దెయ్యం పట్టలేదుగదా!" అనుకుంటూ మాధురిని అనుసరిస్తూన్నాడు.

కాలనీ వచ్చేసింది. "మాధురిగారూ చీకటిపడింది. మీ యింటివరకూ వస్తాను. రమ్మంటారా" అశ్విని అడుగుతూన్న మాట విన్పించుకోకుండానే, వెడుతూన్నాను అని చెప్పకుండానే మాధురి వేగంగా సైకిల్‌ని పోనిచ్చింది. అలా వెళ్ళిపోతూన్న మాధురిని చూస్తూ వుండి పోయాడు. ఈ అమ్మాయికి నిజంగా దెయ్యం పట్టిందా యివాళ! కాదు... దెయ్యంపట్టటం కాదు. మనస్సులో ఏదో అశాంతి వుంది. ఎవరికి చెప్పుకోలేని బాధ యేదో వుంది! సామాన్య కుటుంబంలో పుట్టిన యీ అమ్మాయికీ, ఆ విమానం కారుకీ సంబంధం ఏమిటీ? అసలు ఆ కారు యెవరిదో తెల్సుకుంటే గానీ విషయం కొంతవరకూ తెలియదు. ఈ విషయం రేపు తెల్సుకు తీరాలి. మాధురిచేత చెప్పించిగానీ వదలకూడదు అనుకుంటూ అశ్విని తన యింటివైపుగా బయలుదేరాడు.



# 15

ఉదయం తొమ్మిదిన్నరకి అశ్విని మాధురి కోసం రోడ్డుమీద యెదురు చూస్తూ నిల్చున్నాడు. మాధురి ఇవాళ కాలేజీకి వస్తుందా! రాదా! వస్తే నే బాగుండు. ఎలాగో అసలు విషయం కొంతవరకన్నా తెల్సుకోవచ్చు. రాక పోతే యీ రోజంతా కూడా అశాంతిగా గడపవల్సి వస్తుంది. ఇలా ఆలోచిస్తూ ప్రతిరోజూ కంటే కూడా ముందుగానే వచ్చేశాడు అశ్విని. సైకిల్ మీద యెక్కి యిటే వస్తూన్న మాధురి కన్పించింది.

"అమ్మయ్య! వస్తోంది!" తృప్తిగా నిట్టూర్చాడు. మాధురి దగ్గరగా వచ్చేసింది

"గుడ్‌మార్నింగ్ మాధురీదేవి"

"మార్నింగ్" సైకిల్ స్లో చేసింది. అశ్విని సైకిల్ యెక్కాడు. మాధురి కాస్త వేగాన్ని పెంచింది. "మాధురి గారూ మీకివాళ చాలా చాలా థాంక్స్ చెప్పాలి. వడిలిపోయినట్లున్న మాధురి ముఖంలోకి పరీక్షగా చూస్తూ అన్నాడు.

"ఎందుకు?" నిర్లిప్తంగానే అంది.

"నిన్న యెగ్జిబిషన్ ప్రోగ్రాం కాన్సిల్ చేసుకుని త్వరగా యిల్లు చేరటం వల్ల నాకు చాలా వుపకారం జరిగింది"

"అంటే?" అర్థం కానట్లు చూస్తూ అంది.

"యింట్లో మా అమ్మ ఒక్కతే వుంటుందని చెప్పానుకదూ! నిన్న సాయంకాలం ఒకడు వచ్చి ఫ్రెండ్‌ననీ, వూరునించి వచ్చాననీ, నేనే రమ్మని వుత్తరం రాశాననీ కోతలు కోసి అమ్మని నమ్మించాడుట. అమ్మ తలుపు తెరచిందిట. నమ్మకం కలిగేలా కొన్ని కబుర్లు చెప్పేశాడు 'మీరు పెద్దవారు. మా అమ్మ లాంటివారు. అందుకే మీరంటే నాకు చాలా గౌరవం.' అంటూ రెండు యాపిల్సు చేతిలో పెట్టాడట. ఇవి మీరే తినాలి. అని పట్టుబట్టాడట. తనే కోసి ముక్కలు పెడతానన్నాడట. అమ్మ యీ మాటలకి ఐస్ అయి పోయింది."

"తర్వాత తింటాలే బాబూ" అందిట. కానీ అక్కడనించి కదలలేదట. ఇంక యిలా లాభం లేదని "కాసిని మంచినీళ్ళు యివ్వండి" అని అడిగాడట. అమ్మ లోపలికి వెళ్ళిందిట. అంతే వాడు మెల్లగా ఆ గదిలోవున్న ఫానూ, ట్రాన్సిస్టరూ బిగ్‌బెన్నూ పట్టుకుని మెల్లగా బైటకి జారుకుంటూన్నాడు. సరిగ్గా అప్పుడే నేను వెళ్ళాను." అశ్విని చెప్పటం ఆపేశాడు.

"ఎంత ధైర్యం వాడికి. ఇంతకీ మీరు నిన్న ఆలశ్యంగా యింటికి వస్తానని చెప్పారా మీ అమ్మకి"

"ఔను. చెప్పాను. అది బహుశా వీడు విని వుంటాడు. ఎప్పుడూ యెవరో ఒకరు తోడుగా వుండేవాళ్ళు యివాళ లేరు. అందువల్ల వాడిపని తేలిక అయింది"

"తర్వాత"

"తర్వాత యేం వుంది! అంతా మా మూలే. నేను యిల్లు చేరకుంటే అవన్నీ పుచ్చుకుని దర్జాగా వుడాయించే వాడు. పాపం దురదృష్టవంతుడు. నాకు చిక్కిపోయాడు. నిన్న మీరలా వచ్చేయ బట్టి నేనూ వచ్చేశాను. లేకుంటే ఆ పుస్తకాలు చూస్తూ యేర్రాత్రికో యిల్లు చేరు కునే వాడిని. అప్పటికి అంతా అయిపోయి వుండేది. మీకు మరీమరీ కృతజ్ఞతలు చెప్పుకుంటూన్నాను. ఈ మాట చెప్పాలని రాత్రినించీ ఒకటే ఆరాట పడిపోతూన్నాను. సాయంకాలం పార్టీ యిస్తాను హోటల్లో వస్తారుగా"

"పార్టీ యివాళ కాదు. వీలున్నప్పుడు నేనే అడిగి తీసుకుంటానుగానీ మీరు దొంగ అని యెలా గుర్తించగలిగారు"

"భలే ప్రశ్న మీది! నా యింట్లో దూరి సామానులు తీసుకు వెడుతూన్న వాడిని దొంగ అనుకోక దొర అనుకో మంటారా! చూడగానే అనుమానం వచ్చింది. వదిలించుకుని పారిపోవాలని చూశాడు కానీ లాభం లేకపోయింది"

"పోలీసులకి అప్పగించారా"

"నేనలా చేయను. వాళ్ళకి అప్పగిస్తే రెండురోజులు జైల్లోవుంచి వదిలేస్తారు అందుకే చావగొట్టి వదిలేశాను"

"వాడు మీ మీద పగబడితే"

"పట్టవచ్చు, నన్ను నేను రక్షించు కునే జాగ్రత్తలో వుండి తీరాలి"




మాధురి భయంగా చూసింది. అశ్విని నవ్వేశాడు.

"ఈ రోజు బుక్స్ యెగ్జిబిషన్‌కి వెళతారా" అడిగింది.

"మీరూ వస్తారా!" రారని తెలుసు. నేనే. సాయంకాలం నా కోసం వెయిట్ చేయవద్దు. ఇంటికి త్వరగా వెళ్ళిపోండి"

"అలాగేవెళ్ళిపోతాను". అంటూ సైకిల్ పోనిస్తూ దూరం నించి తన వైపే వస్తూన్న లారీని చూసింది. అ ం తే "అమ్మయ్యో! లారీ" అ ం టూ ఆగిపోయింద మాధురి.

"ఫర్లేదు. నేనున్నాగా. రండి నా వెంట."

"ఉహు! చస్తే రాను" రోడ్డుకి పక్కగా వెళ్ళిపోయింది. అశ్విని తప్పని సరిగా ఆగిపోవాల్సి వచ్చింది. లారీ వేగంగా వెళ్ళిపోతోంది. అందులోవున్న ముగ్గురు మగాళ్ళు మాధురినీ, అశ్వినినీ చూస్తూ యికిలించారు. అశ్వినికి అవ మానంగా అన్పించింది "చూశారా! మీ భయం చూసి వాళ్ళెలా నవ్వుతున్నారో" విసుగ్గా అన్నాడు. "ఫర్లేదు. నేనేం అనుకోను. పదండి పోదాం."

ఇద్దరూ సైకిళ్ళు యెక్కారు.

జనం అప్పుడే పరుగులూ వురుకుల్తో వాళ్ళ వాళ్ళ పనులకోసం బయలుదేరారు. కార్లు, సైకిళ్ళు, రిక్షాలు, ఆటోలు, సిటీ బస్‌లతో ఒకటే రద్దీగా వుంది రోడ్డు. అశ్విని ఆగిఅన్నాడు.

"మాధురిగారూ నాదారి అటు. వెళ్ళి వస్తాను. సాయంకాలం త్వరగా వెళ్ళి పోతారుగా"

"వూ..."

"అయితే రేపన్నమాట మీదర్శనం" మాధురి బలవంతంగా నవ్వుని తెచ్చు కుంది.

"వస్తాను" అశ్విని వెళ్ళిపోయాడు. తనింకా మైలుదూరమన్నా వెళ్ళాలి. ఒంటరిగా సైకిల్ మీద. అబ్బ! విసు గొచ్చింది. అయినా తప్పదుగా. అశ్విని వెంటవుంటే యెంతదూరం ప్రయాణం చేసినా విసుగురాదు. అలసట తెలియదు. నిజమే. కానీ అతను యెప్పుడూ వెంట యెలా వుంటాడు. అతని యిల్లు వేరు! కుటుంబంవేరు. వుద్యోగంవేరు. తనదీవేరే. అయితే యీ కాలేజీకి వెళ్ళేదారిలో కొంత దూరం మాత్రం కల్సి ప్రయాణించి, మళ్ళీ యెవరి గమ్యాలవైపు వాళ్ళు వెళ్ళి పోవాలి. తప్పదు. "ఈ మధ్యలో కాస్త దూరం కలిసి పయనించే సహబాట సారులం మనం" అంటాడు అశ్విని అప్పు డప్పుడూ. అతను సరదాగా అన్నా ఈ మాట మనస్సులో మారోగుతూ వుంటుంది మాధురికి. ఇదినిజం. ఇది నిజం అనుకుంటూ చేతివాచీ చూసుకుని తృళ్ళిపడింది. "అమ్మో ... చాలా టైము అయిపోయింది" మాధురి వేగంగా వెళ్ళి పోయింది.



## 16

"అహల్యమ్మ వదినగారూ యేం చేస్తు న్నారు. పనికాలేదూ యింకా"

నాంచారమ్మ చిన్న ప్లాస్టిక్ బుట్టలో పెరట్లో కాసిన కూరలని తీసుకుని పెత్త నానికి వచ్చింది.

"రండి..." ఆహ్వానిస్తూ చాప పరి చించి. మధుబాబు చదువుతూన్న పుస్తకం టక్కున మూసేసి లేచి నిల్చు న్నాడు. "అత్తగారూ మంచినీళ్లు తేనా"

"అలాగే! నీ బంగారు చేత్తో ఒక్క గ్లాసు నీళ్ళతే"

మధు పరుగునవెళ్ళి నీళ్ళుతెచ్చి యిస్తూ

"అత్తగారూ చేతులు కడుక్కుని గ్లాసుకూడా శుభ్రంగా కడిగి మరీ నీళ్ళు తెచ్చాను" బుద్ధిమంతుడిలా అంటూ ఆవిడ తెచ్చిన బుట్టలోకి చూస్తూన్నాడు.

నాంచారమ్మ గ్లాసు అందుకుని గడగడా నీళ్ళు తాగేసింది.

"అబ్బ కొబ్బరి నీళ్ళలా భలే వున్నాయి మంచినీళ్ళు"

అహల్య నవ్వింది. మధు సిగ్గుపడి పోతూ నిల్చున్నాడు.

"ఇంద నీ మామూలు. ఔనూ ఇవాళ బడికి వెళ్ళలేదేం" మధుకి చాక్లెట్లు అందిస్తూ అడిగింది.

"కాలు కాస్త నొప్పిగా వుందని వెళ్ళ లేదు"

"ఏదీ ఎక్కడ !"

"పోయింది అత్తగారూ. రేపు స్కూలుకి వెడతానండీ.. అమ్మా అలా వెళ్ళి ఆడుకుని వస్తానమ్మా"

"ఊఁ...వెళ్ళు"

మధు వీధిలోకి పరుగు తీశాడు. అహల్యా, నాంచారమ్మ కబుర్లలో పడి పోయారు.

"మాధురి కాలేజీకి వెళ్ళిందా !"

"ఊఁ !"

"ఈ కూరలు లోపల పెట్టండి. వంకాయలూ, దొండకాయలూ విరగ గాస్తున్నాయి. నాలుగు రోజులుపోతే గోంగూరా, టమాటాలు కూడా వస్తాయి"

అహల్య నవనవలాడే వంకాయలని ఓసారి చూసి లోపలపెట్టి బుట్టతెచ్చి యిచ్చింది.

"స్వంత యిల్లువుంటే యిలా ఏవైనా కూరలు పండించుకోవచ్చు. మీరు ఈ విషయంలో చాలా అదృష్టవంతులు"

"మీ నోటి వాక్యాన ఇలానే వుండ నీయండి. ఇవన్నీ సరేగానీ కోకిలమ్మ మొగుడు ఏంచేశాడో తెల్సా !"

"తెలియదు. ఏం చేశాడూ. మరో కొత్తరకం నెక్లెస్ చేయించాడా! గుర్రపు పందాల్లో ఫస్ట్ప్రైజ్ కొట్టేశాడా!"

"వాడి బొంద. గెలుపులూ లేవు, పాడూలేవు, డబ్బు వస్తోందని అబద్ధాలు చెప్తూ అందరినీ మోసంచేశాడు."

"అంటే ?"

"ఇంకా మీకు అర్థం కాలేదూ ! పెళ్ళాం నగలన్నీ అమ్మి గుర్రప్పందాల్లో డబ్బంతా తగలేసి కొత్త ఫాషనువి తెచ్చానంటూ గిల్టు నగలు తెచ్చి యిచ్చాడట. కోకిలమ్మ పాపం పిచ్చిది. మొగుడి మాటలన్నీ నమ్మింది. కొత్త నగలని చూసుకుని మురిసిపోయింది".

"అయ్యో... ఎంత పనిచేశాడు"

"వదినగారూ మగాడు చేయాలను కుంటే యేదైనా చేస్తాడండీ. అతని వ్యసనం కోసం కట్టుకున్న భార్యని ఎంత మోసం చేశాడో చూడండి. అతను ఎంత తెలివిగలవాడిని అనుకుని ప్లానుగాచేసినా నిజం నిలకడమీద తెల్సి తీరుతుందండీ ? అందుకే అంటారు నిజం నిప్పులాంటి దని."

అహల్య మనసు బాధపడింది. పాపం కోకిలమ్మ వట్టి అమాయకురాలు.

"ఈ నిజం అసలు ఎలా బయట పడింది" ఆతురతగా అడిగింది.

కోకిలమ్మకి నెలతప్పిందట. తల్లీ తండ్రీ కూతుర్ని తీసుకుపోవాలని వచ్చారట.

అల్లుడి అతి వినయం వాళ్లకి అనుమానం కల్గించిదట. కూతురు చూపించిన కొత్త నగలు చూసి మరీ గాభరాపడి కంసాలికి చూపారట. యేముందీ అల్లుడి బండారం బయట పడిపోయిందట. యింక మామగారి ఆగ్రహానికి అంతులేదట. పోయిందిపోగా ఉన్న సామానునీ కూతురునీ తీసుకుపోతూ అల్లుడిని బాగా తిట్టాడట. ఆఫీసువెళ్ళి అతని పై ఆఫీసరుకి చెప్పి జీతంలో సగం భార్యకి పంపే యేర్పాడు చేసి మరీ వెళ్ళాడట. యింక యిప్పుడెలా వెధతాడు గుర్రప్పం దాలకి చెప్పండి. అతని రోగం వదలింది."

"రోగం కుదిరించాడు మామగారు. అంతే అలానే చెయ్యాలి"

"ఈ వ్యసనం మానినరోజున నీకు బుద్ధి వచ్చిన రోజున కానీ నా కూతురు నీయింట్లో అడుగు పెట్టదు అని చెప్పి వెళ్ళాడట కోకిలమ్మ తండ్రి"

"పాపం కోకిలమ్మ సంసారం యిహా అయిపోయిందా!" అహల్య బాధపడి పోతూ అంది. "చూడండి వదినగారూ! ఈ సంసార రథం సాఫీగా సాగిపోవాలంటే ఆడదీ మగాడూ ఇద్దరూ హద్దుల్లో వుండాలండీ! ఈ హద్దులని ఏ ఒక్కరు అతిక్రమించినా యీ రథం గాడి తప్పుతుంది. ఈగాడి తప్పితే మళ్ళీ దారిలో పడటం కష్టం. ఈ విషయాన్ని భార్యాభర్తలు యిద్దరూ అనుక్షణం గుర్తు వుంచుకోవాలి. అలా వుంచుకొని ఒకర్ని ఒకరు అర్థం చేసుకుంటూ ఒకర్ని ఒకరు గౌరవించుకుంటూ, అభిమానించుకుంటూ సాగిననాడు స్వర్గం ఈ సంసారంలో కాక మరెక్కడుంటుంది చెప్పండి"

"నిజం... స్వర్గం యిక్కడ కాక మరెక్కడో వుందని చాలా మంది ఆ స్వర్గం కోసం ఎటో చూస్తూ వున్న శాంతిని కూడా పోగొట్టుకుని యీ స్వర్గాన్ని నరకం చేసుకుంటారు."

"వదినెగారూ యీ రోజుల్లో బైట ప్రపంచం బాగా లేదండీ. రకరకాల మనుషులూ, రకరకాల ప్రభావాలూ. వీటినుంచి తప్పించుకుని బ్రతకటం కష్టంగానే వుంది. సమాజ ప్రభావం ముఖ్యంగా పురుషుల మీద, పిల్లల మీద చప్పున పడిపోతోంది. ఈ ప్రభావం వల్ల మంచి కంటే చెడే యెక్కువ జరుగుతోంది."

"ఔను. కానీ యిలా అని వీటినుంచి తప్పించుకుని దూరంగా బ్రతక గలగడానికి అవకాశం లేదే"

"లేదు... అందుకేగా బాధ పడటం! సరే ఈ విషయాలకేంగానీ ఓ ముఖ్య విషయం చెప్తాను మీరు బాధ పడకండి. మన మాధురి కాలేజీకి యెవరో ఓ అబ్బాయితో కల్సి వస్తూ వెడుతూ వుందట. మీకు తెలియక పోవచ్చు. చూడండి ఆ పిల్లని ఏం అనక త్వరగా అసలు విషయం యేమిటో రాబట్టుకోండి. నాకు తెల్సిన విషయం మీకు చెప్పకుండా వుండలేక పోయాను. మాధురి నెమ్మదస్తురాలు. మీరు భయ

పడకండి"

అహల్య నిర్ఘాంతపోయింది. ముఖం నల్లగా అయిపోయింది. తన కూతురు మాధురి మితభాషి. మాధురి ఏవరినీ పట్టించుకోకుండా తన పని తను చేసుకుంటూ తన చదువులో మునిగిపోయే మాధురి—అబ్బాయితో కల్సి తిరుగుతూన్నదా! యిది ప్రేమా! స్నేహమా! ప్రేమే అయితే! ఒకవేళ మాధురి... మాధురి... వుహు అయివుండదు. యీ నమ్మకం వుంది. స్నేహమే అయివుండాలి. స్నేహమే అయినా యెలా యెక్కడ ప్రారంభమైందో యెంత వరకూ వెళ్ళిందో? యిన్నాళ్ళూ భర్త ప్రవర్తనతోనే బాధగా వుంది. ఇప్పుడు కూతురు కూడా మరో సమస్య అయి కూర్చుంటుందా!

అహల్య కళ్లలో నీళ్ళు తిరిగాయి.

"యింక వెళ్ళి వస్తాను వదినగారూ" అంటూ వెళ్ళి పోయింది. అహల్య మనసు వ్యాకుల పడిపోతూ వుంది. ఈ వార్త నాంచారమ్మ కాక మరెవర్న చెప్పినా నమ్మేది కాదు. నాంచారమ్మ స్వభావం తెల్సు. అనవసర కాలక్షేపం కోసం యెవరి మీద కల్పించి చెప్పదు. ఆవిడ యీ కుటుంబ క్షేమం కోరేమనిషి. మాధురిని ఈ విషయం గట్టిగా అడగాలి. మందలించాలి. మాధురికి జ్ఞానం తెల్సు అనుకున్నాను. ఇదీ యిలా చేసి నాకు వ్యధ కలిగిస్తుందా! మధుబాబు వీధిలో ఆడుకుంటున్న వాడల్లా పరుగున లోపలికి వస్తూ వీధి గడప తగిలి బోర్లా పడ్డాడు. మోకాళ్ల పెచ్చులు వూడి రక్తం చిమ్ముతున్నాయి. అయినా లక్ష్య పెట్టకుండా అరిచాడు.

"అమ్మా.... అమ్మా నాన్నారు... టాక్సీలో... వచ్చారమ్మా... కొత్త పాంటు వేసుకున్నారమ్మా."

ఇలా అరిచి మళ్ళీ వాకిట్లోకి పరుగు తీశాడు. అహల్య అలాగే చూస్తూ నిల్చుంది. ధనంజయరావు యింటికి వచ్చి నాలుగు రోజులు అయింది. యిలా యీయన రావటం అలవాటు అయిపోయింది. యెన్నాళ్ళ బాధ పడుతుంది. ఎన్నాళ్ల నిద్ర పోకుండా యెదురు చూస్తుంది. భోజనం చెయ్యకుండా పస్తులుంటుంది. అహల్య మొండి ధైర్యాన్ని తెచ్చుకుని కాలం వెళ్ళదీస్తూ వుంది. ఇంతలో కూతురు యెవరో అబ్బాయితో తిరుగుతూ వుందన్న వార్త గోరు చుట్టు మీద రోకటి పోటులా తగిలింది. యింత బాధని గుండెలో దాచుకుని యింటి పనులు చేసుకుంటూ వుంది

ధనంజయరావు లోపలికి వచ్చాడు. టాక్సీ వెళ్ళి పోయిన శబ్దం అయింది

"అహల్యా! వుత్తరా లేమైనా వచ్చాయా!" గదిలోనికి వెళ్ళి బట్టలు మార్చుకుంటూ అడిగాడు. రోజూలా ఆఫీసునించి అరింటికి యింటికి వచ్చిన వాడిలా అడుగుతూంటే జవాబు చెప్పగలదా!

ధనంజయరావు రెండు నిమిషాలు భార్య జవాబు కోసం ఆగాడు. ఆతర్వాత "మధూ! మధుబాబూ" అని పిలిచాడు

"వస్తూన్నా నాన్నారూ" మధు గది

లోకి వెళ్ళాడు.

"అమ్మని వేడిగా కాఫీ చేసి యిమ్మను"

మధు తల్లి దగ్గరికి వచ్చి చెప్పాడు. అహల్య కదల్లేదు.

''నేయిస్తాను నువ్వు వెళ్లు" శాంతాన్ని తెచ్చుకుంటూ అంది.

బైటకి వెళ్ళబోతూన్న కొడుకుని ధనంజయరావు పిలిచాడు.

''మధూ ఇంద బిస్కెట్లు కొనుక్కో'' రూపాయి కాయితం యిచ్చాడు. తల్లి చూసిందంటే ఈ డబ్బు పెట్టి కొనుక్కోనివ్వదని పిల్లిలా బైటకి వెళ్లాలని ప్రయత్నించాడు. కానీ అహల్య 'మధూ యిలారా' అని పిలవనే పిలిచింది. మధు అయిష్టంగానే తల్లి దగ్గరగా వస్తూ రూపాయి కాయితం వెనక్కి పెట్టుకున్నాడు.

''ఎక్కడికి వెడుతూన్నావ్!"

మధు ముఖం చిట్లించాడు. అమ్మ బిస్కెట్లకి డబ్బు ఇవ్వదు. నాన్న ఇస్తే కొనుక్కోనివ్వదు. ఇలాంటప్పుడు తల్లి మీదచాలా కోపంవస్తుంది. ఈ సారి అమ్మ మాట వినకూడదు అనుకుని ''నేను బిస్కెట్లు కొనుక్కుంటాను''అన్నాడు.

చాచి చెంప పగిలేలా కొట్టింది అహల్య. 'అబ్బా' పెద్దగా యేడవటం మొదలు పెట్టాడు మధు. రూపాయి కాయితం క్రింద పారేశాడు. ధనంజయరావు చివాలున లేచి వచ్చాడు. ఏడుస్తూన్న మధుని యెత్తుకుని భార్య ముఖంలోకి తీక్షణంగా చూశాడు. అహల్యా భర్త ముఖంలోకి అలానే చూసింది. ధనంజయరావు కొడుకుని తీసుకుని బైటకి వెళ్ళిపోయాడు.

అహల్యకి ఆవేశం ముంచుకు వచ్చింది. ఏం చేస్తుంది. ఏం చెయ్యగలదు.

ఏమిటీ సంసారం! ఏమిటీ పిల్లలు. ఎందుకీ భర్త. వీళ్ళంతా నా వాళ్ళే నని అనుక్షణం తపిస్తూ వీళ్ల సుఖ శాంతుల కోసం నేనెందుకు తపించాలి! వీళ్ళే నా సర్వస్వం, ఈ ఇల్లే నా స్వర్గం అనుకున్నాను యిన్నాళ్ళూ. కానీ వీళ్లందరూ నా వాళ్లు కాదు. ఈ యిల్లు నా స్వర్గం కాదు. కాదు. నే కోరుకున్న స్వర్గం యిది కాదు. ఇదికాదు. ఈభర్తా, పిల్లలేశత్రువుల్లా అవుతూన్నారు. నాకు శాంతి లేకుండా చేస్తున్నారు. వాళ్ల వాళ్ల సుఖం చూసుకుంటూన్నారు. నన్ను విస్మరిస్తూన్నారు. నేనెవరి కోసం బ్రతకాలి? ఎందుకు బ్రతకాలి?

ఆవేశం కోపంగా మారి అది కన్నీళ్లుగా బైటపడింది. అంతలో మాధురి వచ్చింది. సైకిల్ తాళం వేసి పుస్తకాలు పట్టుకుని లోపలికి వస్తూ తల్లి ముఖంలోకి చూసింది. అహల్య చప్పున కన్నీళ్లు తుడుచుకుంటూ లోపలికి నడిచి కుర్చీలో కూలబడింది.

''అలా వున్నావేమ్మా''?

అహల్య మాట్లాడలేదు. తల్లిని మళ్ళీ ప్రశ్నించింది మాధురి.

''ఎలా వున్నాను. చాలా సుఖంగా వున్నానమ్మా. మీ నాన్న నన్ను సుఖ పెట్టి వదిలారు. ఇంక నువ్వు ... నువ్వు... మాధురీ'' కూతుర్ని అడగ

లేక పోతోంది.

"ఏమిటమ్మా ... చెప్పు. ఏమైంది." పుస్తకాలు పట్టుకుని అలాగే నిల్చుని అడిగింది.

"ఏం లేదుగానీ నువ్వు యిప్పటికి చదివిన ఈ చదువు చాలు. ఇంక రేపటి నించీ చదువు మానేసి యింట్లో వుండు" కఠినంగా అంది అహల్య. మాధురి తెల్లబోయింది.

"అమ్మా... చదువు మానేయనా! ఎందుకు"

''అసలు నీకీ చదువు యెందుకని అడుగుతూన్నాను?''

''అమ్మా''

"అమ్మా లేదు. బొమ్మాలేదు. నా ప్రశ్నకి జవాబు చెప్పు. ఈ వంకతో నీ యిష్టం వచ్చినట్లు షికార్లు చేయటానికా యీ చదువు"

"నేనా!.తిరిగానా! ఎవరు చెప్పారు?" అర్థంకానట్లు చూసింది మాధురి.

"ఎవరూ చెప్పక్కర్లేదు. ఈనాలుగు గోడల మధ్యనుంచి కదలకున్నా నాకన్నీ తెలుస్తాయి! నువ్వేం చేస్తున్నావో ఎవరితో కలిసి కాలేజీకి వెళ్ళివస్తున్నావో నాకు ఆలస్యంగా అయినా తెల్సింది! ఇప్పుడు చెప్పు. ఎవరతను! ఎందుకు కలిసివెడుతున్నావు ?"

మాధురికి అర్థమైపోయింది. తల్లితనని అనుమానిస్తోంది. బాధ పడుతోంది. అతనెవరు అని అడుగుతోంది. అశ్వని యెవరని చెబుతుంది! స్నేహితుడనీ, మంచివాడనీ చెపితే తల్లి నమ్ముతుందా ? ఆ మంచితనం వీళ్ళకి అక్కర్లేదు. ఓ అబ్బాయీ, అమ్మాయీ కలిసి తిరుగుతూ 'స్నేహం' అంటే నమ్మేస్థితిలో లేదు యీనాటి సమాజం. ఇలాంటి స్నేహితాలు అరుదు. ఇలా అనుమానించటం తప్పు అనగలదా? అన్నా వీళ్ళు ఒప్పుకుంటారా! అందుకే మాధురి మౌనం వహించింది. కూతురి మౌనం అహల్యకి మరీ కోపకారణం అయింది.

"అమ్మా...నేను నీ కూతుర్ని. ఎప్పుడూ తప్పు అనేది చేయను. నా మీద ఈ విశ్వాసం వుంచు. నేనింతకు మించి యింకేం చెప్పలేను."

"నీవేం చెప్పినా వినను. నువ్వు చదువు మానేసెయాలి అంతే" గొంతు చించుకుని అరిచింది అహల్య. ధనంజయరావు కొడుక్కి బిస్కట్లు కొనిచ్చి లోపలికి వస్తూ యీమాట విన్నాడు.

''అహల్యా నీకేమన్నా మతి పోయిందా ? ఎందుకు మాధురిని చదువు మానమంటున్నావు ?" చికాకుగా అడిగాడు. అహల్య జవాబు చెప్పలేదు. మాధురీ జవాబు చెప్పలేదు.

''మాధురీ...ఏమిటమ్మా"

మాధురికి తండ్రిని చూడగానే ముఖం జేవురించింది. అసహ్యం, ఆవేశం పొంగి వచ్చాయి. కానీ పైకి ఏం అనకుండా తనని తను నిగ్రహించుకుంటూ తలవంచుకుని నిల్చుంది. ధనంజయరావు యిదేం పట్టించుకోలేదు.

''చూడమ్మా! మీ అమ్మమాట వినకు. చదువు మానకు. నేను వున్నాను. నేను చెపుతున్నాను. మామూలుగా కాలేజీకి వెళ్ళు నీకేమైనా డబ్బు కావాలంటే

నన్ను అడుగు. ఏం...సరేగానీ ముందు కాస్తవేడిగా కాఫీ కలిపి తెచ్చిఇవ్వమ్మా."

అహల్య ఆవేశాన్ని అణుచుకుంటూ వంటగదిలోకి వెళ్లి పీటమీద కూల బడింది.

''మధూ ఇలారా''

మధు పరుగు తీశాడు. ధనంజయ రావు తాను ఇంటికి రాని నాలుగు రోజుల్లోనూ ఏం జరిగిందీ వివరాలు అడిగాడు. మధు తెల్సినవీ, తెలియనివీ చెప్పేస్తున్నాడు. మాధురి యిదంతా భరించలేక పోయింది. అలా అని ఎక్కడికి వెడుతుంది! తల దిమ్ముగా వుంది. కణతలు నొక్కుకుంటూ అలా వుండిపోయింది. ఇల్లు నిశ్శబ్దంగా వుంది. ఒకరితోవొకరు మాట్లాడుకోవటంలేదు. ఈ నిశ్శబ్దం అంటేనే చికాకు మాధురికి. మాధురికి ఇదివరకటి రోజులు గుర్తుకి వస్తున్నాయి. అప్పుడు ఈ ఇల్లు ఎలా వుండేది. అమ్మ ఎప్పుడూ నవ్వుతూ శాంతమూర్తిలా వుండేది. కాలేజీ నించి రాగానే "అబ్బ అలిసిపోయావమ్మా. బట్టలు మార్చుకో. వేడిగా టిఫెనూ కాఫీ యిస్తాను'' అనేది. తాను త్వరత్వరగా వచ్చి తినేసి వేడి కాఫీ తాగి 'అమ్మయ్య' అనుకునేది. ఇంక తమ్ముళ్ళు అంతే. నాన్నార్లు ఆరూ ఆరున్నర కాగానే ఇంటికి వచ్చేసేవారు. వచ్చినప్పటినించీ తనతో, తమ్ముళ్లతో, అమ్మతో అస్తమానం కబుర్లు చెప్తూ, జోక్ చేస్తూ నవ్విస్తూ వుండేవారు. అందరూ కలిసి భోజనం చేసేవార్లు. ఆ రోజులు హాయిగా ఆనందంగా దొర్లిపోయాయి. కానీ ఈ మధ్య ఈ ఇల్లు నరకంలా అనిపిస్తోంది. ఇక్కడ వుండలేక, అలా అని ఎక్కడికి వెళ్ళాలో తెలియక సతమతమైపోతోంది మాధురి.



# 17

సాయంత్రం ఆరు గంటలు కావస్తోంది. సిటీలో కరెంటుదీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. బజారులన్నీ జనంతో రద్దీగావున్నాయి. అశ్విని స్నేహితుడితో పాటు బజారుకి వచ్చాడు. టార్చిలైటు ఒకటి కొన్నాడు. స్నేహితుడు వాసు ఇంకా ఏవేవో బేరాలు చేస్తూంటే విసుక్కుంటూ "చూడూ కొనే బేరం అయితే ఎంతసేపైనా నిల్చుంటాను. కాదూ? పద వెళ్ళిపోదాం'' అనటంతో వాసు బైటకి వచ్చేశాడు. అశ్విని తన సైకిల్ తీసుకుంటూ వాసు చెప్పే కబుర్లు వింటూన్నాడు. కానీ పక్కషాపు దగ్గర మాధురి సైకిల్ కన్పించేసరికి ఆశ్చర్యపోయాడు.

ఈ అమ్మాయి "త్వరగా ఇంటికి వెళ్ళాలి. మీ కోసం వెయిట్ చెయ్యాని వాళ'' అని చెప్పింది. మరి ఈ షాపులో ఏం కొనాలని వచ్చింది. చీకటి కూడా పడింది. వంటరిగా అంతదూరం ఎలా వెడుతుంది. సైకిల్‌ని చూస్తూ ఆలోచిస్తున్నాడు.

అశ్వని పరధ్యాస గుర్తించిన వాసు కబుర్లు చెప్పటం ఆపేశాడు. చుట్టూ చూ శా డు. యెవరూ కన్పించలేదు. "గురూ ఏమిటి కథ. వెళ్ళిపోవాలని నన్ను తొందరపెట్టి మళ్ళీ ఆగిపోయా వేం"

అశ్వని జవాబు చెప్పలేదు. వాసుకి కోపం వచ్చింది. వీడి గర్ల్‌ఫ్రెండ్ యీ దరిదాపుల్లో వుండి వుంటుంది. అందుకే వీడి చెవులు వినేస్థితిలో లేవు అనుకుని కోపాన్నిమింగి "వస్తా బ్రదర్. నే వెళ్ళి వస్తా" అని వెళ్ళిపోయాడు. అశ్వని మాధురికోసం చూస్తూన్నాడు. ఎక్కడా కన్పించలేదు. పక్కషాపులోకి వెళ్ళాడు. అక్కడ గాజులూ, రిబ్బన్లూ, పూసలూ, ప్లాస్టిక్ వైర్లూ, అద్దాలూ, దువ్వెనలూ వగైరా సామాన్లు వున్నాయి. అవి లైట్ల వెలుతురులో ధగధగా మెరుస్తున్నాయి. చాలా మంది అమ్మాయిలున్నారు. కానీ వాళ్ళలో మాధురి మాత్రం లేదు. అశ్వని మరో షాపులోకి వెళ్ళాడు. అక్కడా అమ్మాయిలూ, అమ్మలూ, నాన్నలూ, అన్నలూ, తమ్ములూ, భర్తలూ ఇలా చాలామందే వున్నారు. చీరెలు రకరకా లుగా వున్నాయి. అవితీసి చూస్తున్నారు. కుప్పలుగా పోగుపోస్తున్నారు. ఇంకా ఇంకా చూస్తున్నారు. "ఇవన్నీ పాత ఫాషన్. కొత్త రకాలు చూపమంటు న్నారు." వీళ్ళందరిలోనూ మాధురి కని పిస్తుందేమోనని వెతికాడు. లేదు. అశ్వని షా పు లో ని ంచి బైటికివచ్చి చుట్టూ చూస్తున్నాడు. మాధురి ఏ షాపులోకి వెళ్ళినట్లు! ఊహకి అందటం లేదు. రోడ్డుకి అటువైపుగా వున్న ఓ షాపులో వున్న అద్దంలో మాధురి ప్రతిబింబం కన్పిస్తోంది. చూశాడు. అంతే రోడ్డుదాటి అటు నడిచాడు.

తళతళా మెరుస్తున్న జానెడు పొడు గున్న కత్తిని చేత్తో పట్టుకుని పదునుని పరీక్షిస్తూ వుంది మాధురి.

"అమ్మాయిగారూ జాగ్రత్తండి.కొత్త కత్తి పట్టుకుంటే చాలు తెగిపోతుంది" అంటున్నాడు షాపువాడు.

"పదును బాగా వుందికదూ!"

"ఓ...యిలా అనిస్తే చాలు జానెడు లోతు దిగేసుకుపోయేంత పదునుంది"

"ఆఁ...ఇదే కావాలి నాకు.... ఇదే యివ్వు... దీని ఖరీదెంత"

షాపువాడు ఖరీదు చెప్తూన్నాడు.

"హల్లో మాధురిగారూ! మీ రూ షాపింగ్‌కి వచ్చారా! త్వరగా యింటికి పోవాలి అన్నారుగా మరి ఇంత ఆలశ్యం అయినా యిక్కడే వున్నారేం. ఔనూ మీరు ఈ కత్తులూ, కఠారులూ వుండే షాపులో ఏఁకొంటున్నారు"

అశ్వని గొంతు విన్పించేసరికి మాధురి ఉలిక్కిపడింది. అశ్వని దగ్గరగా వచ్చే శాడు. "మీరు...మీరు...ఇక్కడికి ఎలా వచ్చారు" తడబడుతూ అంది.

"భలేవారే...టార్చి కొనాలని వచ్చాను. మీరు...అదేమిటి మీ చేతిలో ఆ కత్తి యేమిటీ, కొంటున్నారా! ఎందుకూ!"

మాధురి మరీ ఖంగారుపడింది. షాపు అతను కత్తిని పేక్‌చేసి యిచ్చాడు.

అశ్వని మాధురి ముఖంలోని అకా రణ కంగారు చూసి ఆశ్చర్యపోతూ

పాకెట్ తను తీసుకున్నాడు.

"చూడండి. బిల్ యిచ్చి రండి. బైట వుంటాను" పాకెట్ చేతులో వుంచుకునే బైటకి వచ్చేశాడు. మనస్సులో యేదో అనుమానం. ఈ కత్తి మాధురికి యెందుకు. నన్ను చూడగానే అదోలా అయి యెందుకు గాభరాపడింది, ఇదే ఆలోచన. మాధురి అయిదు నిమిషాల తర్వాత బైటికి వచ్చింది. ఇద్దరూ రోడ్డు దాటుతూన్నారు. స్పీడుగా ఓ టాక్సీ వచ్చేసింది. మాధురి చూడలేదు. కానీ అశ్విని చూశాడు. టక్కున ఆగిపోయి మాధురి చెయ్యి పట్టుకుని వెనక్కి గుంజాడు. అనుకోని ఈ సంఘటనకి మాధురి తూలి అశ్విని మీద పడింది. కళ్ళు తిరిగి నట్లయింది. ఆ టాక్సీ తన మీదనుంచే పోయిందేమో అన్నంత గాభరా పడి అశ్వినిని గట్టిగా పట్టుకుంది. అశ్విని యిదేం పట్టించు కోనట్లు చూస్తూ "మాధురిగారూ రండి పోదాం" చెయ్యి వదలకుండానే రోడ్డు దాటించాడు. మాధురి యిప్పటికి స్తిమితాన్ని తెచ్చుకుని చుట్టూ యెవరైనా తెల్సిన వాళ్ళున్నారా అని చూస్తూ వుంది. నాంచారమ్మ భర్త తమవైపు చూస్తూన్న వాడల్లా ముఖం తిప్పుకుని వెళ్ళి పోతూన్నాడు. మాధురికి గుండె గుభేలు మంది. ఈ వార్త కూడా అమ్మకి చేరుతుంది. అశ్విని చెయ్యి వదిలేశాడు. "సైకిల్ తీసుకోండి. వెళ్ళి పోదాం'' అంటూ తనూ సైకిల్ తీసుకున్నాడు. అశ్విని సైకిల్‌ని ముందుకు పోనిస్తూంటే అతన్ని అనుసరిస్తోంది మాధురి. రద్దీగా వున్న రోడ్లనించి దాటి దూరంగా వచ్చేశారు. అశ్విని యింతవరకూ యేం మాట్లాడలేదు. ఇప్పుడన్నాడు.

"షాపింగ్‌కి వస్తానని మీరు చెప్పలేదు. నే కన్పించకుంటే ఒక్కరూ ఎలా వచ్చేవారు''

కాస్త మందలింపుగా ధ్వనించింది అతని గొంతు. మాధురి జవాబు చెప్పలేదు. ''ఈ అమ్మాయి భలేదే! ఒక్కొక్కప్పుడు యెంత మంచిగా మర్యాదగా వుంటుందో, మరొకప్పుడు రాయిలా మొండిగా ప్రవర్తిస్తుంది. ఈ విసుగు యెవరు భరించగలరు! వస్తే వస్తుందిలే అని వదిలేసి నాదారి నేను చూసూకో వల్సింది. తనలో తను విసుక్కున్నాడు. మాధురి ముఖంలోకి చూస్తూ ఆమె సైకిల్ పక్కగా తన సైకిల్‌ని పోనిస్తూన్నాడు. వివర్ణమైన ముఖం. ఇంకా స్తిమితాన్ని పొందిలేదు. కారణం అడిగినా చెప్పదు. చెప్పించటం కూడా కష్టమే. చాలా లోతు గుండె. ఇద్దరూ మౌనంగానే లేబరుబస్తీ లోనించి మళ్ళీ మెయిన్ రోడ్డు మీదకి వచ్చేశారు. కాలనీ దగ్గరికి వచ్చేస్తోంది. మాధురి మాట్లాడుతుందేమో అని చూశాడు. ఊహుం. పెదవి విప్పేలా లేదు. అసలు తల తిప్పి చూడటం లేదు. పాకెట్ యిమ్మని అడగలేదు.

పాపం మాధురి ఇంట్లో శాంతి లేనట్లుంది. జాలి ముంచుకు వచ్చింది. కాలనీ వచ్చేసింది.

"గుడ్‌నైట్ మాధురీ దేవీ" అశ్విని తన సైకిల్‌ని తనింటి వైపుగా తిప్పే

శాడు.

"ఆ...ఆ...ఆగండి ఒక్క క్షణం... నా.... నా..." మాధురి మాట పూర్తి కాలేదు. అశ్విని వెనక్కి వచ్చాడు. "అరెరె ... మర్చి పోయాను సుమా" అశ్విని పాకెట్ అందించి వేగంగా వెళ్ళి పోయాడు.

"అశ్వినిగారూ యిది మీ టార్చి లైట్." మాధురి మాట అతను విన్పించు కోలేదు. చాలా దూరం వెళ్ళి పోయాడు. మాధురి రెండు నిమిషాలు అలాగే నిల్చుండిపోయింది. ఇలా అతను కావా లనే చేశాడన్నది అర్థం అయింది. ఇంకేమీ చెయ్యలేక ఇంటికి వచ్చేసింది.

కూతురు ఇంకా యింటికి రాలేదని ఆదుర్దాపడుతూ వీధి గడపలోనే ఎదురు చూస్తూ నిల్చుంది అహల్య. "అమ్మయ్య వచ్చావా తల్లీ నీ చదువేమిటో ఈ తిరుగుడు ఏమిటో నాకర్థం కావటం లేదమ్మా. ఇప్పటివరకు కాలేజీలో చదువు తూనే వున్నావా !"

అహల్య ఈమధ్య ప్రతి చిన్న విష యానికీ చికాకు పడిపోతూ వుంది. ఇది తెల్సుగనుక, మాధురి జవాబు చెప్ప కుండా వూరుకుంది. అహల్యకి కోపం ఎక్కువైపోయింది.

"ఏమ్మా..నీకూ నిర్లక్ష్యం ఎక్కువ అయిందికదూ నేనంటే ! ఔనులే అవక ఏం చేస్తుంది ! ఆ తండ్రికి కూతురివి కదూ !"

"అమ్మా.." మాధురి అసహనంతో వూగిపోయింది. ఏదేదో అనేయాలని పిస్తూన్నా ఎంతో కష్టంమీద నిగ్రహించు కుంది. అసలే చికాకుగా వుంది. తల్లి ఎప్పుడూ అనని ఈ మాట విని మరీ బాధపడిపోయింది. అహల్య లోపలికి వెళ్ళిపోయింది. జనార్థన్ కేక పెట్టాడు.

"అక్కా భోజనానికి రా !"

తల్లికి కోపం తగ్గలేదు! లేకుంటే తనే పిలుస్తుంది ప్రతిరోజూ. ఇది ఇంకా బాధ కల్గించింది. మాధురి బాధని మౌనంగా భరించటం బాగా నేర్చుకుంది. బట్టలు మార్చుకుని భోజనానికి వెడుతూ చెప్పుల వైపు చూసింది. అందరి చెప్పులూ వున్నాయి. కానీ తండ్రివి లేవు. "నాన్న గారు ఇవాళా ఇంటికి రాలేదన్నమాట" అనుకుంటూ వంటగదిలోకి వెళ్ళింది.



## 18

అశ్విని మాధురికోసం రెండు రోజులుగా ఎదురు చూస్తూన్నాడు. ఎందుకు కాలేజీ మానేసిందో తెలియదు. తనతో బాటు సిటీలోకి వచ్చే తాతగారు మళ్ళీ ప్రతిరోజూ వస్తూన్నాడు. ఆయన అశ్వినిని అడగనే అడిగాడు.

"బాబూ మాధురి కనిపించటం లేదేం ?"

ఏమని చెప్పటానికీ తనకు తెలిస్తేగా. "తెలియదండీ" అనేసరికి ఆయన

పెద్దగా నవ్వాడు. "అదేమిటి బాబూ ! తెల్సుకోవద్దూ !" అన్నాడు.

"వాళ్ళ యిల్లు తెలియదు"

"భలేవాడివి. ఇన్నాళ్ళుగా స్నేహితులు ఆ మాత్రం అడ్రస్సే తెల్సుకోలేని మీరు ఏంపిల్లలయ్యా. పోనీ వాళ్ళ నాన్న పేరు తెల్సునా చెప్పు నే. వెళ్ళి కనుక్కొ వస్తాను"

"అదీ తెలియదు. మీరెలా వెడతారు"

"తెలియదూ! పోనీయి మాధురి అనే అమ్మాయి ప్రతిరోజూ సైకిల్ మీద కాలేజీకి వెళ్ళేది. ఆ అమ్మాయి ఇల్లెక్కడా అంటే చాలు వివరాలు వాటంతట అవే తెలుస్తాయి. చూడు అశ్వనీ ఎన్ని తెలివి తేటలు వున్నా కాస్త నోరుకూడా వుండా లయ్యా"

తాతగారి మాటలకి అశ్వనికి నవ్వు వచ్చింది.

"మీకంత శ్రమ వద్దులెండి. ఈరోజు వస్తోంది మాధురి. అదుగో"

"అమ్మయ్య వస్తోందీ! అయితే నీకు తోడు దొరికింది కనుక నే మెల్లగా వెడుతూ వుంటాను. మీరు ఆలశ్యంగా బయలుదేరినా నన్ను దాటుకుని ముందే వెళ్ళిపోతారులే వస్తాను" పంచ పైకిమడిచి తాతగారు పాత సైకిల్ ఎక్కారు. అది మెల్లగా ముందుకి పోతోంది.

అలా వెళ్ళే తాతగార్ని ఇంకా చూస్తూ సైకిల్ ఆపుకుని తనకోసం నిరీక్షిస్తున్న అశ్వనిని ఆగి పల్కరించింది.

"గుడ్‌మార్నింగ్ అశ్వనిగారూ"

అశ్వని తలతిప్పాడు. మాధురి రోజూలానే వుంది. కానీ తనకే చాలా రోజులు అయినట్లు కొత్తగా కన్పిస్తోంది. తనని పరీక్షగా చూస్తున్న అశ్వనివైపు ఓసారి చూసి "పదండి పోదాం" అంది సైకిల్‌ని పోనిస్తూ. అశ్వని మాధురిని అనుసరించాడు.

"మీరు రెండు రోజులుగా కాలేజీకి ఎందుకు రాలేదు"

"వంట్లో బాగాలేదు."

"అలాగే జరిగి వుంటుంది అనుకుని గాభరా పడ్డాను. మీ ఇల్లు వెతుక్కుంటూ వద్దామని అనుకున్నాను. అలా వచ్చినా 'వేళకాని వేళ రాకోయి అతిథీ' అని పాట మొదలు పెడతారేమో అని మానేశాను."

ఉదాసీనంగా వున్న మాధురి ఫక్కున నవ్వేసింది.

"నిజమండీ. అందుకే ఈ మెయిన్ రోడ్డుమీదే నిరీక్షించాను. కానీ మీ కాలనీ లోకి అడుగు పెట్టలేదు"

"భలేవారు."

"ఎందుకైనా మంచిది కాస్త మీ ఇంటి అడ్రెస్ నాకివ్వండి' మీరు రాకపోతే నేనే వెతుక్కుంటూ వస్తాను"

"అంత అవసరం రాదులెండి"

"అని మీరెలా చెప్పగలరు ?"

"........."

"అడ్రెస్ చెప్పటం ఇష్టంలేదా !"

"ఆఁ...ఔను"

అశ్వని ఈ మాటకి నవ్వేశాడు.

"చూడండి నాక్కావాలంటే మీ అడ్రెస్ తెలుసుకోగలను. అయితే మీకు ఇష్టం లేదని తెల్సిందికనుక తెల్సుకోను" కోపం తెలియకూడదని ప్రయత్నించినా మాటల్లో తెలుస్తూనే వుంది.

మాధురి మాటనుర్చేస్తూ అడిగింది.

"చూడండి రెండు రోజులూ వంటరిగానే వెళ్ళారా !

"తాతగారు కొంతదూరం వరకూ తోడుగా వున్నారు"

మాధురికి మళ్ళీ నవ్వు వచ్చింది. అయినా నవ్వలేదు. ఇది గ్రహించికూడా గ్రహించనట్లు అలవాటుగా కబుర్లు మొదలుపెట్టాడు

"మొన్న లేబర్ బస్తీలో ఏం జరిగిందో తెల్సునా !"

"ఏం జరిగింది"

"ఆ ఇరుకు సందులో సీనారేకు తలుపు దగ్గర ఒక అందమైన అమ్మాయి మన ఇద్దరినీ చూస్తూ ప్రతిరోజూ చెయ్యి వూపుతూ 'టాటా' చెప్తూండేదిగుర్తుందా!"

"ఉంది. ఏమైంది ఆ అమ్మాయికి" ఆతురతగా అడిగింది మాధురి.

"ఆమె భర్త తాగి వచ్చి వళ్ళు తెలియని నిషాలో కత్తితో పొడిచేశాడట"

-"ఆ..." తృళ్ళిపడింది మాధురి.

"ఆ కత్తి కొత్తదిట. జానెడు పొడుగు వుందట"

"ఆ ...అమ్మాయి...ఏమైంది...?"

"ఏమవుతుంది! చచ్చిపోయింది"

"నిజంగా" మాధురి ఎందుకో గాభరా పడిపోతూన్నట్లు వుంది. సన్నగా వణుకుతూంది.

"నిజంగా! అదేమిటి మీరలా అయిపోతూన్నారేమిటి?"

"అహ...యేంలేదు. మనస్సు బాగా లేదు"

"కారణం అడగవచ్చునా?"

"ఏం లేదండీ ... అది సరేగానీ ఆ అమ్మాయిని మొగుడు యెందుకు చంపినట్లు?"

"ఆమె ప్రవర్తన అతనికి నచ్చలేదట. పైగా అనుమానంట"

"అయ్యో! ఇది నిజం అయివుండదు"

"మనకెలా తెలుస్తుందండీ" అశ్విని సైకిల్ని ఆపి మళ్ళీ అన్నాడు.

"మీ దారి అటు. నా దారి ఇటు. మీరు సాయంత్రం ఎన్నింటికి వస్తారు?"

"నాలుగున్నర". మాధురి వెళ్ళిపోయింది. అశ్వినీ వెళ్ళిపోయాడు.

సాయంత్రం అయింది. అశ్విని వచ్చేసరికే మాధురి వెయిట్ చేస్తూ వుంది.

"సారీ కాస్త ఆలస్యం అయింది" మాధురి ముఖం ఇంకా ప్రశాంత పడలేదని అనుకుంటూ అన్నాడు. మాధురి సైకిల్ ఎక్కి బయలుదేరింది. కానీ మాట్లాడటం లేదు.

అశ్విని మామూలుగా కబుర్లు చెప్తూన్నాడు. మాధురి 'ఊఁ' అంటోంది. అశ్వనికి విసుగు వచ్చింది. అంతే మాట్లాడటం మానేశాడు. అయినా మాధురి కబుర్లు చెప్పలేదు.

"మీరీమధ్య అశాంతిగావుంటూన్నారు. ఎందువల్ల?" అడగకూడదు అనుకుంటూనే అడిగేశాడు.

"ఏం లేదండీ!...ఏం లేదు... ఈ చదువు ఎప్పుడు అయిపోతుందా అని ఎదురుచూస్తూన్నాను".

"అలాగా! తర్వాత ఏం చేస్తారు".

"ఉద్యోగం వెతుక్కోవాలి"

"ఎం.ఏ. చదవరా?"

"ఊహుఁ"

"ఎందుకని. చదువంటే ఇష్టంలేకా? లేక చదవటానికి వీలుకాకా?"

"ఈ రెండూ కారణాలు కావు"

"అవేవో చెప్పకూడదూ"

"చెప్పుకోలేనివి చాలా వుంటాయి అశ్వనిగారూ!"

"ఓహ్! అలాగా...అయితే అడగను లెండి"

మళ్ళీ మౌనం. దాదాపు యిద్దరూ యిలానే వున్నారు. కాలనీ వచ్చేసింది.

"వెళ్ళివస్తాను" మాధురి అతని జవాబు కూడా వినకుండా ఇంటివైపు సైకిల్ ని తిప్పేసింది. సైకిల్ దిగిలోపలికి వస్తూండగా బిగ్గరగా మాటలు విన్పిస్తూన్నాయి. తల్లి గొంతు ఒకటి. మేనమామ గొంతు ఒకటి. తండ్రి గొంతూ విన్పిస్తోంది. తల్లి ఇన్నాళ్ళుగా తన మనస్సులో బాధని దాచుకున్నది భరించలేక అన్నగార్కి ఉత్తరం రాసింది. ఆయన వచ్చి బావమరిదికి నచ్చచెప్తూన్నాడు.

"ధనంజయ్! నేను పెద్దవాడిని. నీకు కావాలని నా చెల్లెలిని ఇచ్చి పెళ్లి చేసిన వాడిని. ఇన్నాళ్లూ నీ సంసారం స్వర్గం అనుకున్నాం మేం అందరం. చాలీచాలని జీతం అయినా తృప్తిగా నిండుగా శాంతిగా బ్రతుకుతూ పిల్లలు ముగ్గురినీ ప్రాణంకంటే ఎక్కువగా చూసుకున్నావు. పెళ్ళి అయిన ఇన్ని సంవత్సరాల తర్వాత ఇలా మారావంటే నేను నమ్మలేకుండా వున్నాను. ఇంటినీ, భార్యనీ, పిల్లలనీ పట్టించుకోకుండా వీళ్ళ ఖర్మకి వీళ్ళని వదిలి నీవెక్కడో తిరుగుతూ నీ సుఖం నువ్వు చూసుకుంటున్నావంటే నే నేం చెప్పను. ఎదిగిన పిల్లలు, పెళ్ళికెదిగిన ఆడపిల్ల ఒకవైపు. ఏదో ఓ సంబంధం చూసి ఆ పిల్ల పెళ్ళి చేసి బాధ్యతని వదిలించుకునే ప్రయత్నం చేయవల్సిన నువ్వు నాలుగేసి రోజులు ఇంటికే రాకుండా ఉంటూన్నావంటే ఎలాగయ్యా వూరుకునేది! చెప్పు. జవాబు చెప్పు. నువ్వు ఎక్కడికి వెడుతూన్నావో ఏం చేస్తూన్నావో చెప్పు."

మేనమామ ఎంత ఆవేశపడిపోతున్నా తండ్రి జవాబు చెప్పటం లేదు.

"ఈ విషయంలో ఇంక నేను సహించలేను. నేనీ బాధని భరించలేను అన్నయ్యా..."అహల్య ఏడుస్తోంది.

"ఇదిగో బావా! చెప్తూన్నాను విను. భార్యాపిల్లలూ అనే బాధ్యత నాకుందని తెల్సు. వీళ్ళకి కావల్సిన డబ్బు ఇస్తాను. ఖర్చుచేసుకుని సుఖంగా వుండమను. కానీ నా గురించి అడగవద్దు. ఇష్టం వుంటే వస్తాను. లేకుంటే రాను. నా జీవితం నాది. నా తృప్తి నాది! నాక్కావల్సిన సుఖం నేను చూసుకుంటాను"

తండ్రి ఇలా అంటూంటే తల్లి "ఛీ ఛీ... ఇలా మాట్లాడటానికి సిగ్గులేదూ" అని అసహ్యించుకుంటోంది. తండ్రి ఆవేశంగా లేచాడు. ఇంకా ఇంకా ఏదో అంటూన్నాడు. తల్లి కోపంతో మండిపడిపోతోంది. మేనమామ చెల్లెలినీ, బావమరిదినీ శాంతింపజేయటానికి ప్రయత్నిస్తూన్నాడు. ఇద్దరూ వినటం లేదు.

మాధురి చెవులు గట్టిగా మూసుకుని

తనున్న గది తలుపు గడియ బిగించు కుంది. తలుపుని ఆనుకుని చాలాసేపు అలాగే నిల్చుండిపోయింది.

భగవాన్. ఇలాంటి స్థితిని ఏ ఆడ పిల్లకూ కలిగించకు. జనార్దన్, మధు బాబూ అయితే తమ మనస్సులోని బాధని మామయ్యతో చెప్పుకోగలరు. కానీ తను ఏమని చెపుతుంది. ఎలా చెపుతుంది! చెప్పలేకా, మింగగల శక్తి లేకా సతమతమైపోతూ అలా వుండి పోయింది మాధురి.



## 19

మర్నాడు సాయంకాలం మాధురి కాలేజీ నించి తిరిగి వస్తూండగా అశ్వని కలిశాడు. ఇద్దరూ మౌనంగానే ప్రయాణిస్తూన్నారు. మాధురి మాట్లాడితే బాగుండునని అశ్వనీ, అశ్వని ఏవైనా కబుర్లుచెపితే బాగుండునని మాధురీ మనస్సుల్లో అనుకుంటున్నారు.

"తాతగారివాళ్ళ మనకంటే ముందు సిటీకి వెళ్ళిపోయ్యారుకదూ!" మాధురే సంభాషణ మొదలెట్టింది.

"అవును"

"ఎందువల్ల"

"తెలియదు" అశ్వని నిర్లిప్తంగా జవాబు చెపుతున్నాడు.

"ఎందుకదోలా వున్నారు"

"ఏంలేదే!"

ఇతను తనని వెక్కిరిస్తున్నాడా! అప్పుడప్పుడూ తనిలాగే జవాబు చెబుతుంది. మాధురి అశ్వని ముఖంలోకి అనుమానంగా చూసింది. అతను ఎటో చూస్తున్నాడు. అశ్వని యిలా వుంటే తాను భరించలేదు. అలా అని కారణం ఏమిటని తరచి అడగనూలేదు. అసలే ఇంటికి వెళ్ళినప్పటినించీ చికాకుతప్పదు. ఈ కాస్సేపైనా అన్నీ మర్చిపోయేలా అశ్వని కబుర్లు చెప్పకూడదూ! అనుకుంది.

"అశ్వనిగారూ మీ కొత్త ఉద్యోగం ఎంతవరకు వచ్చింది" తనే అడిగింది.

"సిటీ పొలిమేరలవరకూ"

మాధురికి నవ్వొచ్చింది.

"అంటే తొందరలోనే నాకు పార్టీ వుందన్నమాట"

"ఊఁ! పార్టీ నేనిచ్చినా తీసుకోవటానికి మీకు తీరుబడి ఏది!"

"నిజం సుమా!"

"ఏమిటి నిజం. నేను పార్టీ యివ్వటమా, మీరు తీసుకోకపోవటమా!" కోపంగా అన్నాడు.

"రెండూ నిజమేగానీ మీరీవారంలో ఏం సినిమా చూశారు"

"అదుగో మాట మార్చేశారు. జవాబు చెప్పను"

"అయితే మా కాలనీ వచ్చేసింది. నా దారి యిటు. మీ దారి అటు"

"ఆగండి ఆగండి. ఒక్కక్షణం. ఇదిగో మీపాకెట్" అందించి "వస్తాను"

అంటూ వెళ్ళిపోయాడు. మాధురి గుండె వేగంగా కొట్టుకుంటూ వుంది. చేతిలోని కత్తివున్న పాకెట్ వణుకుతోంది. వళ్ళంతా చెమట పట్టేస్తోంది.

రెండు నిమిషాల తర్వాత తనని తను సంబాళించుకుని మళ్ళీ బయలు దేరి యిల్లుచేరుకుంది. కత్తివున్న పాకెట్ పుస్తకాల క్రింద దాచేసింది. కాఫీ తాగింది. బట్టలు మార్చుకుని స్నానం చేసింది. జనార్ధన్, మధు కూడా స్కూలునించి వచ్చి మళ్ళీ ఆటలకి వెళ్ళిపోయారు. అహల్య వంటగదిలో వుంది. మాధురి గదిలోకి వచ్చి పుస్తకాల కింద దాచిన పాకెట్ తీసింది. విప్పి కత్తి బైటికి తీసి అటూ ఇటూ తిప్పి చూసింది. చూస్తూ టూనే కాళ్లూ చేతులూ వణుకుతూన్నాయి ముఖం అంతా చెమట పోసింది. తనని ఎవరన్నా గమనిస్తూన్నారా అని చుట్టూ చూసింది. ఎవరివో అడుగుల చప్పుడు!

అమ్మ వస్తోందా' మాధురి చేతిలోని కత్తి కిందకి జారింది. చటుక్కున తీసి పాకెట్‌లో దాచేయబోతూంటే మడిచి పెట్టిన కాయితం క్రిందపడింది అందుకుని చూసింది.

మిస్ మాధురీ దేవికి అని రాసివుంది. ఆశ్చర్యంగా వుందే ప్రతిరోజూ కల్సి ప్రయాణించే సహ బాటసారికి వుత్తరం రాయవల్సిన అవసరం యేం వచ్చింది! ఇది యిది...... ప్రేమలేఖ కాదు కదా! ఆతురతగా విప్పి చదువు కుంది.

మిస్ మాధురీ

ప్రతిరోజూ కల్సుకుని గంటల తరబడి కబుర్లు చెప్పుకునే మన మధ్య వుత్తరాల అవసరం యేం వుంది అని ఆశ్చర్యపోతున్నావుకదూ! నిజమే. మనకి వుత్తరాల అవసరంలేదు. కానీ ఓ ముఖ్య విషయం నీకు చెప్పాలి. అయితే యెలా చెప్పాలో తెలియక ఈ వుత్తరం రాస్తూన్నాను.

మనిషి మనసు అనేది వున్నది చూశావూ అది సహజంగా మంచిదే అయివుంటుంది. కానీ పరిసరాల ప్రభావం వల్లగానీ, పరిస్థితుల వత్తిడివల్లగానీ అప్పుడప్పుడూ ఆవేశపు పొంగుతో హద్దు మీరుతూ క్రౌర్యంగా, కర్కశంగా మారుతూ వుంటుంది. మనస్సు మీద దీని ప్రభావం కొంతసేపే అయినా ఆ కాస్సే పటిలోనే మానవత్వం అడుగంటి పోతుంది. ఎంత శాంతంగా బ్రతికే జీవితాల్లో అయినా ఇలాంటి క్షణాలు ఎప్పుడో ఒకప్పుడు వస్తూనే వుంటాయి. ఈ క్షణాలు జీవితాలనే తారుమారు చేస్తూవుంటాయి. అర్థమైంది కదూ! ఇవి ఎలాంటి భయంకర పరిస్థితులని కల్పిస్తాయో! కానీ పరిస్థితి వచ్చినప్పుడు కేవలం ఆవేశమే కాక కాస్త విజ్ఞతగా ఆలోచిస్తే వచ్చిన ఆవేశం ఆవిరిలా ఎగిరిపోతుంది. ఇది నిజం. ఈ ఉపోద్ఘాతం ఎందుకు అని విసుగ్గా ముఖం పెట్టారు కదూ!

అసలు విషయంలోకి వస్తూ సూటిగా అడుగుతూన్నాను. మీరు ఆ రోజు బజారులో కత్తి యెందుకు కొన్నారు? దాని అవసరం మీకేమిటి? దానితో మీరేం చేయాలను కుంటూన్నారు!

ఈ ప్రశ్నలన్నీ నాకు అశాంతిని కల్గి స్తూన్నాయి. వీటికి మీరు జవాబు చెప్పాలి. చెప్పకుంటే నాకు శాంతి లభించదు. చెప్పితీరాలి అని అధికారంగా అడుగుతూన్నానా అని మీరు అనుకో వచ్చు. నిజం చెప్పాలంటే మీ మీద నాకు అధికారం వుంది. ఓ స్నేహితుడిగా ప్రశ్నించే హక్కుంది.

మాధురీ! జీవితం అందమైనది. అమూల్యమైనది కూడా. ఈ అమూల్య మైన జీవితాన్ని అనుక్షణం అప్రమత్త తతో కాపాడుకుంటూ తలెత్తుకు తిరగ్గ లిగేలా మనని మనం మలుచుకున్నప్పుడు జీవితం అందంగా అపురూపంగా కన్పి స్తుంది. సుఖమూ, శాంతీ లేనినాడు మనిషి మనిషిగా మనలేడు. నిజమే. అసలు యీ దేశంలో బ్రతికే మధ్య తరగతి మనిషి మనిషినీ పరిశీలించండి. సుఖ శాంతులు ఎందరి జీవితాల్లో వున్నాయోతెలుస్తుంది. శాంతి లేదు. శాంతి లేదని మనిషి రాక్షసుడిలా మారాలా! మారితే ఎలావుంటుందీ సమాజం. సంస్కారం వున్న ప్రతి మనిషి ఎలాంటి పరిస్థితి యెదురైనా వాటి ప్రభావంలో పడి కొట్టుకు పోకుండా అసలు విషయానికి పరిష్కారం ఆలో చించి ఆచరణలో పెట్టి ఆ పరిస్థితుల నించి తప్పించుకోగలగాలి. ఇంతే నే చెప్పేది మాధురీ దేవీ!

ఆఖరున ఒక్కమాట. కత్తిని యెంత జాగ్రత్తగా దాచుకుంటారో అర్థమైన నాకు, యీ వుత్తరం కూడా భద్రంగా వుండి తీరుతుందనీ మీకు తప్ప మరెవరి కళ్ళా పడదనీ తెల్సు కనుకనే రాశాను. అన్నట్లు మరో మాట. చీకటిని పారదోల టానికని టార్చిలైట్ల్ కొనుక్కున్నాను నేను. దాని అవుసరం నాకన్నా మీకే యెక్కువ వుంది అని ఇచ్చాను.

ఇంతకు మించి ఏం చెప్పాలో తెలియక ముగిస్తూన్నాను.

మిత్రుడు
అశ్విని.

ఉత్తరం చదవటం పూర్తి అయింది. మాధురి మనస్సులో పెను తుఫాను ప్రారంభమైంది. వుత్తరం ఒకసారి రెండుసార్లు నాలుగుసార్లు చదివేసింది. వాక్యం వాక్యందగ్గరా ఆగి ఆగి చది వింది. మనస్సులో రేగిన తుఫాను తీవ్రత తగ్గిపోతూ వుంది.

అశ్వనీ నా మనస్సు చదివేశావా! నీ కంతా తెల్సిపోయిందా! తెల్సి బాధ పడి నన్ను వుత్తరం ద్వారా హెచ్చ రిస్తూన్నావా! నీ వుద్దేశ్యం నాకర్థమైంది. కానీ...నా అశాంతి, నా బాధ, నా ఆవే దన నీకు అర్థం కాలేదా: అశ్వనీ...... ఈ ప్రపంచంలో నాకు సానుభూతి దొరికేది నీ ఒక్కడి దగ్గరే. నన్ను ఓదార్చగల శక్తి కూడా నీ ఒక్కడి దగ్గరే వుంది.

మాధురికి కన్నీళ్ళు ఉబికి వస్తు న్నాయి.

"అక్కా...అక్కా...నేను పందెంలో గెలిచానక్కా..." మధుబాబు పరుగున వస్తూన్నాడు. మాధురి చప్పున కన్నీళ్ళు తుడుచుకుని వుత్తరమూ కత్తీ దాచే సింది.

"అక్కా! యిక్కడ ఒక్కదానివీ ఏం చేస్తూన్నావక్కా"

"ఏం లేదురా. అన్నయ్యని పిల్చుకురా భోజనం చేద్దాం"

"అప్పుడేనా!"

"నా కాకలిగా వుంది మధూ"

అక్క ఇలా అనేసరికి మధు అన్నగారి కోసం బైటికి వెళ్ళాడు. మాధురి మెల్లగా యివతలకి వచ్చింది. అహల్య తులసి దగ్గర దీపం వెలిగించి పూజ చేసి దణ్ణం పెడుతూవుంది. రెండు చేతులూ జోడించి కళ్ళు మూసుకున్న తల్లిని చూస్తూ అలాగే నిల్చుంది మాధురి.

"అక్కా అన్నయ్యని తీసుకు వచ్చాను" మధు లోపలికి వచ్చాడు. జనార్దన్ ముఖం గంటు పెట్టుకుని "రమ్మన్నావా అక్కా" అడిగాడు.

"ఔను" అంది వంట గదిలోకి వెడుతూ.



## 20

ధనంజయరావు హుషారుగా ఇంటికి వచ్చాడు. జరీ అంచుపంచా, సిల్కు లాల్చీ, ఖరీదైన చెప్పులూ చేతికి మరీ ఖరీదైన వాచీ వున్నాయి. అహల్య, మాధురీ అతన్ని చూసి క్షణం నివ్వెర పోయినట్లు నిల్చిపోయారు. మధుబాబు పరుగున వెళ్ళి తండ్రి చెయ్యి పట్టుకున్నాడు.

"నాన్నా! ఏ వూరెళ్ళారు...ఇన్నాళ్లు ఎక్కడున్నారూ...ఈ బట్టలు ఎప్పుడు కొనుక్కున్నారూ..." ఇలా చాలా ప్రశ్నలు వేస్తున్నాడు. ధనంజయరావు చప్పున స్వీట్ పాకెట్ మధు చేతిలో పెట్టేశాడు. మధు తన ప్రశ్నల మాట మర్చిపోయాడు

"నా ఒక్కడికేనా నాన్నారూ !"

"కాదు. అక్కకీ, అన్నయ్యకీ, నీకూ"

"సరే! లోపల పెడతాను. తర్వాత మాఅందరికీ అమ్మ పెడుతుంది" అంటూ గదిలోకివెళ్ళి పాకెట్ లోని నాలుగు స్వీట్లు తీసుకుని తినేస్తూ వుండిపోయాడు. జనార్దన్ స్నానంచేసి బాత్ రూములో నించి వస్తూ తండ్రిని చూశాడు. తండ్రి వేసుకున్న బట్టలనీ చూశాడు ముఖం తిప్పేసుకుని పాంటూ, షర్టూ వేసుకుంటున్నాడు.

"జనార్దన్! స్కూలు ఫీజు కట్టావా!" అడిగాడు ధనంజయరావు.

"లేదు" తండ్రి వైపు చూడకుండానే జవాబు చెప్పేశాడు.

"ఇదిగో రెండొందలూ తీసుకుని ఫీజు కట్టు. మిగిలిన డబ్బు అమ్మకి ఇవ్వు."

"నేను చదువు మానేస్తున్నాను."

"ఏమిటీ! నువ్వు చదువు మానేస్తూన్నావా! ఎందుకు"

"ఉద్యోగం చేయటానికి"

"ఉద్యోగం ఎందుకు? అసలు నీకు

ఎవరిస్తారు?"

"అదంతా మీ కనవసరం" అంటూ విస్సురుగా ఇంట్లో నించి వెళ్ళిపోయాడు.

ధనంజయరావు మండిపడిపోయాడు.

"అహల్యా! ఏమిటిది?"

అహల్య జవాబు చెప్పలేదు. ఎన్ని సార్లు అడిగినా ప్రయోజనం లేక పోయింది. భార్యని ఇంకేం అనలేక కూతుర్ని పిలిచాడు.

"మాధురీ నీ కాలేజీ ఫీజు కట్టాలి కదూ!"

"కట్టేశాను"

"డబ్బెక్కడిది"

"అమ్మ ఇచ్చింది"

"ఎక్కడనించి తెచ్చింది?"

"తెలియదు"

"ఈ ఇంట్లో ఒకరి సంగతి ఒకరికి తెలియకుండా పోతోంది. మీ సంగతి మీ అమ్మకి తెలియదు. ఆమె సంగతి మీకు తెలియదు. ఇంతేకదూ! చదువు కున్న పిల్లవి ఆ మాత్రం తెల్సుకోవల్సిన బాధ్యత లేదా! నిన్నే అడిగేది. జవాబు చెప్పవేం?"

"అమ్మని అడగండి"

"ఊ! అడుగుతాను. భయమా! ఇవన్నీ సరే గానీ ఈ డబ్బు మీ అమ్మకివ్వు" రెండు వంద రూపాయల నోట్లు కూతురికి అందించ బోయాడు.

"మీరే ఇవ్వండి" మాధురి అక్కడ నించి వెళ్ళిపోయింది. ధనంజయరావుకి వళ్ళు భగ్గుమంది.

"అహల్యా" పెద్దగా కేక పెట్టాడు.

"ఇక్కడే వున్నాను"

"ఉన్నావు. బాగానే వుంది. కానీ ఈ యిల్లునీ, పిల్లలనీ యేం చేయాలని నీ వుద్దేశ్యం. వీళ్ళింత నిర్లక్ష్యంగా జవాబు చెప్తున్నారేమిటి? అలా చెప్తూంటే నువ్వు చూస్తూ వూరుకున్నా వేమిటి! చెప్పు."

అహల్య పెదవి కదపలేదు.

"జనార్దన్‌ని వుద్యోగం వెతుక్కోమంది నువ్వేనా"

"నేనే"

"అంటే వాడు నీకు ఇప్పటినించే సంపాదించి పెట్టాలనా నీ వుద్దేశ్యమా"

"ఔను"

"ఔనా! అయితే నే చచ్చాననుకున్నావా!''

ఈ మాటకి అహల్య జవాబు చెప్పలేదు.

"నీ వుద్దేశ్యం యేమిటి అని అడుగుతున్నాను."

"మీరీ వారం రోజులుగా ఎక్కడికి వెళ్ళారు. యెక్కడున్నారు. యేం చేశారు. ముందు నా ప్రశ్నలకి జవాబు చెప్పండి"

"అహల్యా నిన్ను పెళ్ళి చేసుకున్నందుకు నీకూ, నీ పిల్లలకీ అన్నం బట్టా ఇస్తాను. అంతే. ఇది ఇవ్వనప్పుడు మాత్రమే నన్ను ప్రశ్నించే హక్కు నీకుండేది''

"నాకు హక్కులు ఏవీ అక్కర్లేదు. ఈ యిల్లు నాది. ఈ పిల్లలు నా వాళ్ళు. వీళ్ళని పెంచి పెద్ద చేసే బాధ్యతకూడా నే భరిస్తాను. ఇక నుంచీ మీ డబ్బు

అక్కరలేదు"

"ఏమిటీ! నువ్వు డబ్బు సంపాదిస్తావా! ఎలా!" హేళనగా నవ్వేడు.

అహల్య మనస్సు భగ్గుమంది.

"జవాబు చెప్పవల్సిన అవుసరం నాకు లేదు"

"ఏం, ఎందుకని?"

"మీరు మీ బాధ్యతని సరిగా నిర్వహించటం లేదు గనుక"

"పొరబాటు. పొరపాటు అందరూ యిదేమాట. ఛీఛీ...నా జీవితం నాది. నా సంతోషం నాది. ఈ విషయంలో ఆ దేవుడు దిగివచ్చి చెప్పినా చస్తే వినను."

"మీ జీవితం మీదా! మీ సంతోషం మీదా! మీ సుఖంమీదా! ఈ వయస్సులో యిలా మాట్లాడటానికి సిగ్గుగాలేదూ!చీఛీ! చూడండీ నా జీవితం నా ఒక్కదానిదే కాదు. ఈ పిల్లలందరి జీవితాలతోనూ పెనవేసుకుంది. ఈ సత్యం నేను విస్మరించను కనకనే వీళ్ళ మంచి చెడ్డలకీ వీళ్ళ భవిష్యత్తుకీ నేను బాధ్యత వహిస్తాను. నా శక్తి వున్నట్లు పెంచుతాను. చూడండీ-మీరీ యింటికి మళ్ళీ రాకండి. ముందీ యింట్లోంచి వెళ్ళిపొండి"

"ఏం కూశావ్?" ధనంజయరావు చెయ్యి యెత్తాడు ఆవేశంగా.

"హుః దించండి ఆ చేతిని. సంసారం అనేది పవిత్ర దేవాలయం. ఇక్కడ వుండటానికి మీరు అర్హత పోగొట్టుకున్నారు. వెళ్ళిపొండి. ఈ పవిత్రమైన ఆలయంలోకి మీరు రాలేరు. రానీయను. ఈ దేవుడు లేని దేవాలయంలో రాయిలా బ్రతుకుతాను".

అహల్యకి దుఃఖం ఉప్పెనలా ముంచుకొచ్చేసింది.

"అహల్యా! నీకెంత పొగరు? చూస్తాను నువ్వు ఒక్కదానివీ ఈ పిల్లలని ఎలా పెంచగలవో చూస్తాను. ఈ యింటికి చస్తే రాను. నువ్వు వచ్చి తప్పు అయిందని నా కాళ్ళు పట్టుకునే వరకూ యీ గడప తొక్కను"

అహల్య మౌనంగా వూరుకుంది.

"అహల్యా ..... మాట్లాడవేం అహల్యా?"

"అలా పిలవద్దు. ఈ అహల్య పాషాణం అయిపోయింది. మీ పిలుపుకి చలనం రాదు. మీరు దయచేసి వెళ్ళిపొండి"

ధనంజయరావు జుట్టు పీక్కుంటూ యింట్లోనించి వెళ్ళిపోయాడు. మాధురి యిదంతా వినలేక, వినకుండా వుండలేక మనస్సంతా చేదు తిన్నట్లు అయి అలాగే వుండిపోయింది.



# 21

మాధురి కోసం అశ్విని ఉదయం తొమ్మిదిన్నరకి యెదురు చూస్తున్నాడు. మాధురి ఆవాళ ఆలశ్యంగా వచ్చింది.

"గుడ్ మార్నింగ్" పలకరించాడు అశ్విని మాధురితో బయలుదేరుతూ.

"మార్నింగ్" మాధురి పొడిగా

అంది.

"అలా వున్నారేం. జ్వరపడినట్లు నాలుగు లంఖణాలు చేసినట్లు"

"మనస్సు బాగాలేదు" నిర్లిప్తంగా అంది.

"అలాగా! మరైతే కాలేజీకి రాకుండా వుండవల్సింది"

"ఇంట్లో అస్సలు వుండలేక పోతూన్నాను"

"అలాగా !" అంటూ మాధురి ముఖంలోకి పరీక్షగా చూశాడు. మాధురి మౌనంగా సైకిల్ పోనిస్తోంది. అశ్విని తనే మాటలు మొదలెట్టాడు.

"తాతగారు మనకంటే ముందే వెళ్ళారు"

"ఊఁ"

"మాధురి గారూ! పోనీ ఇవాళ్టికి కాలేజీకి పోవద్దు. అలా పార్కుకైనా హోటల్కైనా పోదామా"

"పార్కుకి పోదాం"

ఇద్దరూ పార్కులోకి వచ్చి కూర్చున్నారు. ఉదయం పూట కావటం వల్ల పార్కులో జనం ఎక్కువ లేరు. అశ్విని పచ్చగడ్డిలో కర్చీఫ్ పరిచి కూర్చున్నాడు. మాధురి దగ్గరలోనే కూర్చుంది. పచ్చగడ్డి పరకలు తుంచుతూ తన మనస్సులోని బాధని అశ్వనికి చెప్పేయాలని అనుకుంది. అతని ఓదార్పు వల్లనైనా కాస్త శాంతి లభిస్తుందేమోనని ఆశగా వుంది. చెప్పాలి. కానీ ఎలా! తండ్రిని గురించి అశ్వనికి చెప్పటం ఎలా! విని తను ఏమనుకుంటాడో! ఊహుఁ చెప్ప కూడదని నిశ్చయించుకుంది. ఎదురుగా కూర్చున్న అశ్వని ముఖం శాంతంగా కన్పిస్తోంది. ఇతని వ్యక్తిత్వం మరీ మరీ ఆకర్షిస్తోంది. సభ్యతతో కూడిన ప్రవర్తన. అతనంటే గౌరవం ఇంకా ఇంకా పెరుగుతోంది. అశ్వని మంచి స్నేహితుడు. ఔను ఏదిచెప్పినాసహృదయంతో అర్థం చేసుకునే మంచి మనసుంది.

"అశ్వని గారూ ... మన హిందూ వివాహ వ్యవస్థ చాలా పురాతన మైనదీ, మంచిదీ అంటారు కదా! ఈ దాంపత్యాల్లో కొన్ని ఫెయిల్ అవుతూంటాయి. ఎందుకంటారు !"

"కారణాలు వేరు వేరుగా వుండచ్చునండీ"

"భార్యా భర్తల అన్యోన్యం దేనిమీద ఆధారపడి వుంటుంది?"

"కొత్తలో కేవలం ఆకర్షణ కారణంగా అయినా, తర్వాత వాళ్ళ మనస్త త్వాలమీద ఆధారపడి వుంటుంది అనుకుంటాను"

"సంసారాల్లో ఎక్కువ పురుషుడి ఆధిక్యతే కన్పిస్తుంది."

"ఔను. స్త్రీ తన కాళ్ళ మీద తను నిలబడగలిగిన ధీమా వున్నప్పుడే పురుషాధిక్యత దానంతటదే తగ్గుతూ వస్తుంది. అయితే భార్యా భర్తల సంబంధం-ఆర్థిక అవసరాలు తీర్చుకునేందుకు డబ్బు అవసరమే కాబట్టి అది వీళ్ళని కట్టి పడేస్తోంది మన దేశంలో. ఇది మంచి పద్ధతి కాదు. దాంపత్యాల్లో ప్రేమా, అభిమానం, ఆత్మీయతా, ఒకరిని ఒకరు అర్థం చేసుకోవాలన్న తపనా వుండాలి స్నేహితుల్లా జీవిస్తూ జీవితాంతం సంతోషంగా



చతుః

బ్రతకగలగాలి."

మాధురి ఈ మాటలకి నిర్లిప్తంగా నవ్వింది.

"అలాంటి దాంపత్యాలు వున్నా యంటారా!"

"ఉంటాయి."

"నాకు నమ్మకం లేదు"

"మీ వుద్దేశ్యం నాకర్థమైంది. మాధురి గారూ యీ దాంపత్యాలు చాలా వరకూ ఫెయిల్ కావటానికి కారణం, పురుషుడు అంటాను. జీవిత సహచరి అయిన అర్థాంగిని నిర్లక్ష్యం చేయటం మొదటి కారణం.

పవిత్రత అనేది స్త్రీకేకానీ పురుషుడికి కాదు అన్న అహంభావం రెండో కారణం అంటాను. మూడో కారణం పురుషుడు తప్పుచేసినా సమాజం శిక్షించదు. పైగా కట్టుకున్న భార్య ఈ మొగుడిని క్షమిస్తూనే వుంటుంది. ఇది స్త్రీ చేస్తున్న ముఖ్యమైన తప్పు. తప్పేకాదు స్త్రీ బల హీనత."

"దీనికి పరిష్కారం లేదంటారా" మాధురి ఆవేశంగా అంది.

"ఇది ప్రకృతి సహజం. దీని పరి ష్కారం ఏ సంస్కర్త చేతిలోనూ లేదు. ఇది ప్రతి వ్యక్తి తనని తను సంస్క రించుకోవల్సిన సమస్య."

"అంతే నంటారా !"

"నాకు తెల్సినంతవరకూ"

మాధురి ఆలోచిస్తూ వుండిపోయింది.

"మీ ఈ అశాంతికి కారణం.... అడగను. కానీ ఒక్క విషయం గుర్తు వుంచుకోండి. జీవితం వడ్డించిన విస్తరిలా అందరికీ వుండదండీ. ప్రతి యింట్లోనూ ప్రతివ్యక్తికీ ఏవో కొన్ని సమస్యలు వుంటాయి. ఎప్పుడూ వాటినే గుర్తు చేసుకుంటూ బాధపడటం సరైన పరిష్కారం కాదు. ఆ సమస్యనుంచి తప్పించుకోగలిగిన దారివెతుక్కోవాలి. మాధురిగారూ మనం పరిష్కరించుకో లేని సమస్యలని కాలానికే వదిలేయా లండీ"

"అంతేనంటారా "

"నాకు తెల్సినంతవరకూ అంతే ! చూడండి మీ పరీక్షలు దగ్గరలో వున్నాయి. ఇప్పుడిలా మనస్సు పాడు చేసుకోకూడదు. బాగా చదివి ఆ పరీక్ష పాసయి ఆ తర్వాత ఏదైనా ఓ వుద్యో గం చూసుకోండి. అప్పుడు మీకు కొంత స్థిమితం చిక్కుతుంది"

"నిజమే కానీ నాకు ఉద్యోగం ఎవరి స్తారు? ఎలా వస్తుంది?"

"చూడండి. నాకు తొందరలో మరో మంచి ఉద్యోగం వస్తుందని అనుకుంటు న్నాను. ఇప్పుడు నే చేసేది మీకు వచ్చేలా ప్రయత్నిస్తాను. మా బాస్ మంచివాడు. ఏమంటారు?"

"థాంక్సు అశ్వనిగారూ. మీ చల్లని స్నేహితం చాలా శాంతినిస్తోంది"

కృతజ్ఞతగా చూసింది మాధురి.

"భలేవారు. ఇంత చిన్న విషయానికి థాంక్స్ చెప్పాలా ! మాధురిగారూ ఒక్క మాట చెప్పండి

నేను కేవలం స్నేహితుడినే అను కోండి. కానీ నావల్ల ఏం కావాలన్నా సాయపడటానికి సిద్ధంగా వున్నాను. ఈ

విషయం గుర్తుంచుకోండి. మీరుతప్ప కుటుంబంలో మరెవరూ నాకు తెలియదు. తెల్సుకోవాలని నాకు కుతూహలంగా వుంది. పరిచయం చేయాలని మీకు ఆసక్తి లేదు. ఆల్‌రైట్. నేనా హద్దు దాటను."

"అశ్వనిగారూ మిమ్మల్ని పిలుస్తాను. కానీ ఇప్పుడు కాదు. సరే ...పోదాం" లేచింది మాధురి.

"కాస్త కాఫీ తాగి వెడదాం" అశ్వని దగ్గరలోనే వున్న హోటల్లోకి దారి తీశాడు. మాధురి అతన్ని అనుసరించింది.

టిఫెను ఏంకావాలి" ఫామిలీ రూంలో కూర్చున్న తర్వాత అడిగాడు అశ్వని.

"ఏంవద్దు. వట్టి కాఫీ"

"ఆకలిగా లేదూ !"

"ఊహుఁ"

"నాకు ఆకలిగా వుంది బాబూ !" అంటూ స్వీటుకీ,హాటుకీఆర్డర్ ఇచ్చాడు. సర్వర్ తెచ్చాడు. మాధురి తింటోంది కానీ మనసులో ఏదో తెలియని భయంగా వుంది. అశ్వనితో చాలా రోజులుగా పరిచయం వున్నా పార్కుకి రావటం యిదే మొదటిసారి. ఎవరన్నా తెల్సిన వాళ్ళు చూస్తే ! అమ్మకి చెప్తే ! బాధ పడుతుంది. అమ్మ నావల్ల బాధపడకూడదు. అసలు నాన్న ప్రవర్తనవల్లనే అమ్మకి శాంతిలేదు.

"మాధురిగారూ ఇక్కడకూడా మీకు ఆలోచనలేనా !" తను చెప్పేది సరిగా వినటంలేదని విసుగ్గా అన్నాడు అశ్వని.

"అహఁ ! నేనేం ఆలోచించటం లేదండీ"

"కాఫీ అయిదు నిమిషాలనించీ చల్లారిపోతోంది"

"ఆఁ... అవును కదూ !" కప్పు అందుకుని తాగేసి లేచింది.

"చాలా టైమయింది వెళ్ళిపోదాం"

"పదండి" అశ్వనీ, మాధురీ ఫామిలీ రూములోనించి బైటకి వస్తూన్నారు.

ధనంజయరావూ ఆయనవెంట మరో జంట ఆమె ఫామిలీ రూములోకి వస్తూన్నారు. మాధురి తండ్రిని చూడగానే అడుగు ముందుకు వెయ్యలేకపోయింది. అశ్వని రెండడుగులు ముందుకి వెళ్ళిపోయి మాధురి రాలేదని గుర్తించి వెనక్కి వచ్చేశాడు. ధనంజయరావు కళ్ళు అగ్నిని కురిపిస్తూన్నట్లున్నాయి.మాధురి సన్నగా వణుకుతోంది.అడుగుముందుకు వెయ్యలేక పోతూంది. తండ్రి పక్కనున్న ఆమెని చూస్తోంది. తెల్లగా, లావుగా, పొట్టిగా, గుమ్మటంలా వున్న ఆమె శ్రీమంతురాలిలా వుంది. నీలం పట్టుచీరె, నీలం జాకెట్టు, మెడలో నీలంరాళ్ళ నెక్లెస్, బాబ్డ్, హెయిర్ చేతులకి నీలంరాళ్ళ గాజులు, ముఖాన నీలం బొట్టు, కాళ్ళకి నీలం చెప్పులు. నాగరీకురాలనీ, చదువుకున్న ఆమె అనీతెలుస్తోందరూపంచూస్తే. వయస్సు నలభై దాటి వుండచ్చు. అయితే ఆమె చేసుకున్న మేకప్ ఆ వయస్సుని తక్కువగా చూపిస్తూన్నట్లుంది. ఆవిడ ధనంజయరావు చేతిని బిగించి పట్టుకుంది.

అశ్వని మొదట అర్థంకానివాడిలా క్షణం నిల్చిపోయాడు. నల్లబడిన మాధురి

ముఖాన్ని, కోపంలో ఎర్రబడ్డ కళ్ళనీ చూశాడు. చప్పున మాధురి భుజంమీద చెయ్యివేసి దగ్గరగా లాక్కుని—

"రా మాధురీ పోదాం" అంటూ ఆ అమ్మాయిని బలవంతంగా లాక్కు వెళ్ళాడు. ధనంజయరావు ఇంకా అక్కడే నిల్చున్నాడు. ఆయన కళ్ళలో ఎరుపు కాస్తకూడా తగ్గలేదు. మాధురి అశ్విని వెంట యాంత్రికంగా నడిచి హోటలు బయటికి వచ్చింది. ఆ తర్వాత అలాగే నిల్చుండిపోయింది.

"అశ్వినిగారూ ! మీరిలా ... చేశారేమిటి". మాధురి ఇప్పటికి స్థిమితపడింది.

"మాధురీ! సైకిల్ తీసుకుని పదండి చెప్తాను."

ఇద్దరూ సైకిళ్ళు తీసుకున్నారు. మాధురి వేగంగా వెళ్ళిపోతోంది. ఆమెని అనుసరిస్తూ "సారీ మాధురిగారూ. మీకు స్పృహ తప్పుతుందేమో అని భయపడ్డాను. అందుకని..."

మాధురి ముఖం యెర్రగా యింకా యింకా యెర్రగా అయిపోతోంది. కానీ అశ్వినికి జవాబు చెప్పటంలేదు. అశ్విని మరోసారి 'సారీ' చెప్పాడు. అయినా మాధురికోపం తగ్గలేదు. వేగంగా ముందుకు పోతూనేవుంది. ఆవేశాన్ని అణుచుకునే ప్రయత్నం చేస్తోంది కానీ సాధ్యం కావటంలేదు. అశ్విని సారీ అనే సరికి వెర్రికోపం వచ్చేసింది.

"ఛీఛీ. ఈ మగాళ్ళని నమ్మకూడదు. మీరుఅందరిలాంటివారు కారనుకున్నాను. మీరూ అంతేనని తెలిసిపోయింది. మీ స్నేహానికి గుడ్‌బై..." కటువుగా అనేసింది.

"మాధురీ..."

"నన్ను పిలవద్దు."

"నే చెప్పేది కాస్త వినండి"

"వినను. చస్తే వినను. ఇవాళ నా తండ్రియెదుట మీరు చాలా అవమానం చేశారు నేనెలా భరించానో యెందుకు భరించానో అర్థం కాకుండా వుంది. ఛీఛీ...నేనంటే నాకే అసహ్యంవేస్తోంది" తనలో తనేగొణుక్కుంటూ సైకిల్‌ని మరీ స్పీడుగా పోనిస్తూంది.

"మాధురిగారూ ఆయన మీ నాన్నగారని మొదట నాకు తెలియదు. తెల్సిన తర్వాత కావాలనే చేశాను. అయితే ఎందుకు చేశానో కారణం చెప్తాను. కాస్త ఆగండి."

"వినను"

"వినితీరాలి"

మాధురికి కోపం యింకా ఎక్కువయింది. కాలనీ దగ్గరికి రావటంవల్ల మెయిన్ రోడ్డునించి సైకిల్‌ని తిప్పింది. అశ్విని అడ్డుగా వచ్చేశాడు.

"కాస్త ఆగండి మాధురీ. ఆగకపోయారో మీ యింటికి వచ్చేస్తాను"

మాధురి ఆగింది. అశ్విని యేదో చెప్పబోతూన్నాడు. మాధురి చాచి చెంప పగలగొట్టింది.ఏమరుపాటుగాఉన్న అశ్విని నివ్వెరపోయాడు. ఎడంచేతితో చెంప పట్టుకుని విస్సురుగా మాధురి చెయ్యినిలాగి బిగించి పట్టుకున్నాడు.

"మాధురీ మీ మంచినికోరే నన్ను కూడా అర్థం చేసుకోకుండా ఆవేశపడు

తూన్నారు. ఇది నాకు అవమానమే. దీనికి యిప్పుడే యిక్కడే బదులు తీర్చు కోగలను కానీ...నేను అలా చెయ్యను. మీరంటే అభిమానం, ప్రేమా, స్నేహం తప్ప కోపంలేదు. వస్తా" అశ్వని వేగంగా వెళ్ళిపోయాడు. మాధురి వెళ్ళి పోతూన్న అశ్వనిని చూస్తూ అలాగే వుండిపోయింది.

నేను ... నేను ఏంచేశాను ... ఏం చేశాను. ఇవాళ అసలిలా జరిగిపోయిం దేమిటి? భగవాన్. ఎందుకిలాజరిగింది! కుమిలిపోతూ ఎలాగో యిల్లు చేసింది.



## 22

జనార్దన్ చదువు మానేశాడు. కాళ్ళు అరిగేలా తిరిగి యెందరిచేతో 'లేదు' అనిపించుకుని ఆఖరుకి ఓ చిన్న వుద్యో గం సంపాదించు కున్నాడు. బట్టల షాపులో గుమాస్తా వుద్యోగం. జీతం తక్కువే. అయినా వుద్యోగంలో ప్రవే శించాడు. "ఈ ఒక్కడి జీతంతో యిల్లు గడవటం కష్టం. యెలా!" దిగులు పడి పోతోంది అహల్య. చేతిన వున్న గాజులు అమ్మేసి ప్రస్తుతానికి రోజులు దొర్లి స్తోంది. మూడు నాలుగునెలలు కష్టపడితే మాధురి చదువు అవుతుంది. ఆ పిల్లకి యెక్కడన్నా రెండొందలు వచ్చే వుద్యో గం చూసుకుంటే! అన్న ఆలోచనలోనూ వుంది. నాంచారమ్మ సాయంతో పది మంది చిన్నపిల్లలని ప్రైవేటుకి కుదుర్చు కుంది. తలా అయిదు రూపాయలు యిస్తూన్నారు. అహల్య యాంత్రికంగా రోజులు దొర్లిస్తోందే కానీ పుట్టెడు దిగులుగా వుంది. అన్నగారు మళ్ళీ ఓ సారి వస్తానని వుత్తరం రాశాడు.

"ఎవరు వచ్చి మాత్రం యేం చేస్తారు" నిర్లిప్తంగా అనుకుంది. జనా ర్దన్ వుద్యోగానికీ, మధు స్కూలుకీ వెళ్ళారు. మాధురి రెండు రోజులుగా కాలేజి మానేసింది. ఇంట్లోనే చదువు కుంటూ వుండిపోయింది. తల్లి అడిగింది ఎందుకు వెళ్ళటం లేదమ్మా కాలేజీకి అని.

"క్లాసులు సరిగా లేవమ్మా రేపటి నించీ వెడతాను" అని సర్ది చెప్పింది మాధురి.

నాంచారమ్మా ఆమె భర్త నాంచా రయ్యా సాయంకాలం వచ్చారు. యోగ క్షేమాలు అడిగారు.అహల్య తనకీ భర్తకీ జరిగిన ఘర్షణ విషయం టూకీగా చెప్పింది. నాంచారమ్మ అహల్యని మంద లించింది.

నువ్వు రావద్దు అన్నావుగా, అదే చాలని ఆయన యింక ఇంటి ముఖం చూడటం లేదు. ఆయన కేం అక్కడ హాయిగా తింటూ తిరుగుతూ న్నాడు. ఇలా ఆయన్ని వదిలేస్తే యెలా గమ్మా"

"ఏం చేయను చెప్పండి" అహల్య వుబికి వచ్చే కన్నీళ్ళు ఆపుకొంటూ అంది.

"ఏం చేయను అని ఏడుస్తూ కూర్చుంటే ఈ పరిస్థితి చక్కపడుతుందా! మీ అన్నయ్యను రమ్మను. ఆయన్ని ఆ ఇంట్లోనించి ఈడ్చుకు వచ్చి ఇక్కడ పడేయమను. ఆ గడప తొక్కితే వూరుకోం అని చెప్పమను" నాంచారమ్మ కోపంగా అంది.

"చెప్పటం తేలిక. కానీ చేయటం కష్టం. చూడమ్మా అహల్యా ఆ హేమరాణి వుందిచూశావ్గా అదో ఆడదయ్యం. పైగా శ్రీమంతురాలు. కట్టుకున్న మొగుడిని విషం పెట్టి చంపిందట. అందం డబ్బు వున్నాయిగా. కోరిన మగాడితో స్నేహితం అంటూ పరిచయం చేసుకుని ఆ పరిచయంలో డబ్బు ఆశ చూపి వశపర్చుకుని తను జల్సాగా బ్రతుకుతోందిట. మోజున్నంత వరకూ ఈ స్నేహితం. తర్వాత నౌకర్లతో గెంటించేస్తుందిట. ఈ విషయం ఈ వూళ్ళో చాలా మందికి తెల్సుట." అన్నాడు నాంచారయ్య.

అహల్య అసహ్యంతోనూ అభిమానంతోనూ తల దించుకుంది.

"అన్నగారు వయస్సు నలభై దాటినా ఇంకా అందంగా వుంటారు. అందుకే దాని కళ్ళు పడ్డాయి. అసలు నాకు తెలియక అడుగుతా ఈ ఇద్దరికీ పరిచయం యెలా అయింది అంటారు"

"ధనంజయరావు కామధ్య డబ్బు సంపాదించి లక్షాధికారి అయిపోవాలన్న పిచ్చి యెక్కువైంది. జీతం యెన్నాళ్ళు అయినా ఏమంత పెరగదయ్యె. అందుకని సంపాదనకి మార్గాలు ఏవి ఉన్నాయా అని చాలారోజులు ఆలోచించి పేకాట నేర్చుకుని ఆడాడు. అది లాభం లేదని రేసులకి వెళ్ళాడు. అక్కడా ఒక్కసారీ గెలవలేదు. ఈ హేమరాణితో పరిచయం అయింది అక్కడే"

"ఈ గుర్రప్పందాల పిచ్చి ఆవిడకీ వుందా!"

"ఊ! బాగా వుందిట. మన ధనంజయరావు అలా పరిచయం కాగానే ఆ పిచ్చిలోనించి హేమరాణి పిచ్చిలో పడిపోయాడు. మొదట టీకనీ, సినిమా కనీ పిల్చి పరిచయాన్ని పెంచేసుకుందిట. నేను యెన్నోసార్లు చెప్పాను. వాళ్ళు శ్రీమంతులు వాళ్ళతో మనకెందుకు స్నేహితం" అని. అందుకాయన అన్నాడు గదా "కేవలం కాలక్షేపానికేనండీ" అని. యింక నేనేం చెప్పగలను"

"ఎంత దురదృష్టం. ఆ పరిచయం యీ కుటుంబాన్ని ఎలా తారుమారు చేసిందో!" నాంచారమ్మ విచారంగా అంది

"చెల్లెమ్మా. నేనోసారి వెళ్ళి ధనంజయరావుకి నచ్చచెప్పి పిల్చుకురానామ్మా" అన్నాడు నాంచారయ్య.

"వద్దండీ. వద్దు"

"ఎన్నాళ్ళని ఇలా వంటరిగా వుండగలవు"

"జీవితాంతం"

"అలా అనకు వదినమ్మా. ఆయన ఏదో వ్యామోహంలో పొరబాటు చేస్తే వదిలేసి వూరుకోవటమేనా" నాంచారమ్మ నచ్చ చెప్పబోయింది.

"నాంచారమ్మగారూ తెల్సీ తెలియని

వయస్సులో వున్న పిల్లలు తప్పుచేస్తే మనం క్షమించి తీరాలి. కానీ బాధ్యత కలిగిన ముగ్గురు బిడ్డల తండ్రి అయి జీవితంలో భార్యతో ఇరవై యేళ్ళు అన్యోన్యంగా కాపురం చేసిన యీయన తప్పు చేయటమా! భర్త ఇలా చేస్తే మరో స్త్రీ క్షమించగలదేమో కానీ నేను క్షమించలేను. దయచేసి యీ విషయం యింక చెప్పకండి"

అహల్య యిలా అనేసరికి నాంచారమ్మ యింకేం మాట్లాడ లేకపోయింది. లోపలిగదిలో కూర్చుని చదువు కుందామనుకున్న మాధురికి మాటలన్నీ విన్పిస్తూనే వున్నాయి. చదువు తలకి యెక్కటం లేదు. పుస్తకం మూసి తల పట్టుకుని కూర్చుంది.

నాంచారమ్మా, నాంచారయ్యా వెళ్ళిపోయారు. మధుబాబు స్కూలునించి వచ్చి ఏదో కావాలని గొడవ చేస్తున్నాడు. అహల్య విసుక్కుంటోంది. మధుబాబు ఏడుపు మొదలుపెట్టాడు. అయినా మాధురి కూర్చున్న చోటునించి లేవలేదు.



# 23

మాధురి మళ్ళీ కాలేజీకి వెళ్ళివస్తోంది. రెండురోజులు అశ్విని కనిపిస్తాడేమో నని యెదురు చూసింది. అతను కన్పించలేదు. ఒంటరిగా వెళ్ళి రావటం చాలా కష్టంగా అన్పిస్తోంది. ఆ రోజు అలా తను చేయటం తప్పు అని లోలోపల బాధపడి పోయింది. పొరబాటని చెప్పాలని చూస్తే అశ్విని కన్పించటం లేదు. ఓ మంచి స్నేహితుడిని దూరం చేసుకున్నానా? ఇదే బాధగా వుంది. ఆ రోజు వుదయం కాలేజీకి వెడుతూ చూసింది. అశ్విని కన్పించలేదు గానీ సైకిల్ తాతగారు కన్పించారు. మాధురిని చూడగానే పలకరింపుగా నవ్వారు. ఇద్దరూ సిటీ వైపు వెడుతున్నారు. తాతగారు ఏవేవో కబుర్లు చెప్తూన్నారు. ఇవన్నీ తలకెక్కటం లేదు మాధురికి.

"అశ్వినిగారు కన్పించటం లేదేమండీ" అని అడిగింది. తాతగారు ముందుకుపోయే సైకిల్ని క్షణం ఆపేశారు. ఆశ్చర్యంగా మాధురి ముఖంలోకి చూశారు.

"అదేమిటీ! అశ్వినికి దెబ్బలు తగిలాయిగా. నీకు తెలియదామ్మా"

"అశ్విని గారికా! దెబ్బలు తగిలాయా! ఎప్పుడూ! ఎక్కడా! ఎలా!"

"రెండు రోజుల క్రితం కాబోలు ఒక్కడూ సిటీలోనించి లేబరుబస్తీ దాటి వస్తూన్నాడట" అని ఆగి "ఔను ప్రతి రోజూ నువ్వూ అతనివెంట వుంటావుగా ఆ రోజు లేవా?"

"నేను మూడురోజులు కాలేజీకి వెళ్ళలేదు యిదంతా సరే......ఆ రోజు ఒంటరిగా అశ్వినిగారు వస్తూన్నారు. అప్పుడేమైంది" ఆతురత అణచు

వతుం

కుంటూన్నా తాతగార్కి అర్థం అయి పోయింది.

"సరిగ్గా యీ కాలనీ దగ్గరికి వచ్చి తన యింటివైపుగా సైకిల్ తిప్పాడట. ఎవరో రౌడీలు యిద్దరు వచ్చి మీద పడ్డారట. ఏమరుపాటుగా వున్నాడు కనుక వాళ్ళు కొట్టిన మొదటి దెబ్బ తలకిగాక కుడి భుజానికి బాగా తగిలిందిట. అంతలోనే సైకిల్ దిగి యెదురు తిరిగి చితకతన్ని వదిలాడట ఆయిద్దరినీ. వాళ్ళుబాగాతాగి వుండటంతోయితనిధాటికి ఆగలేకపోయి వుంటారు. పడుతూ లేస్తూ పరుగు తీసి దూరంగా ఆగివున్న తెల్లటి విమానం కారు యెక్కేసి పారిపోయారట. పాపం అశ్వనికి శత్రువులు యెవరూ లేరు. అతను చాలా మంచివాడు. చేతనైనంత వరకూ ఎదటి వాళ్ళకి మేలే తప్ప కీడు చేయటం అతని స్వభావమే కాదు. నా ముఖం. అతన్ని గురించి నే చెప్పటం యేమిటమ్మా. నీకు తెలియదూ! మీరిద్దరూ మంచి స్నేహితులు కదా!"

మాధురి గొంతు తడారి పోయింది. నోట్లోనించి మాట రావటంలేదు. విమానం కారులోవచ్చి అశ్వనిని కొట్టి దుండగులు పారిపోయారు. అశ్వనికి దెబ్బ తగిలిందా! అది యెవరు కొట్టివుంటారు. అర్థమైపోయింది. మాధురికి. అశ్వనీ నేనూ మంచి స్నేహితులం నిజమే. అందుకు అతనికి ప్రతిఫలం యిదా! నాన్న యింత నీచమైన పని చేయించారా! ఓహ్! ఎంత బాధ కల్గించే విషయం. అశ్వని... మనస్సులో ఏమనుకుంటూన్నాడో! అతన్ని కల్సుకోవటం యెలా! నా బాధని చెప్పటం యెలా.

"మాధురీ ఏమిటమ్మా ఆలోచిస్తూన్నావు"

"ఏం...ఏం లేదండీ. అశ్వనిగారు ఎలా వున్నారోనని"

"ఇవాళ వస్తూ చూసి వచ్చాను. దెబ్బ బాగా తగిలింది. రిపోర్టు చేయమని అందరం చెప్పాం. కానీ అతను 'ఇవ్వను' అన్నాడు. ఎందుకలా అంటూన్నాడో అర్థం అయి చావటంలేదు. అసలు అంత మంచి కుర్రాడిని కొట్టవల్సినంత అవసరం యెవరికి వచ్చిందో అర్థం కావటం లేదు. నా అనుమానం అతనిముందు వుంచాను. నా మాటకి నవ్వి 'తాతగారూ వాళ్ళు బహుశా మరెవరినో కొట్టబోయి పొరబాటున ఆదారినే వస్తూన్న నన్ను వేసేసి వుంటారు' అనినవ్వేశాడు. అబ్బ! అంత బాధలో అలా యెలా నవ్వగిలిగాడో నాకైతే అర్థం కాలేదమ్మా, ఆఁ... నా దారి యిటమ్మా. వెళ్ళివస్తా" తాతగారు వెళ్ళిపోయారు.

మాధురికి కాలేజీకి వెళ్ళ బుద్ధికాలేదు. అలా అని వెనక్కి తిరిగి యింటికి వెళ్ళ బుద్ధి కాలేదు. సినిమాకైనా పోవాలన్నా ఏ టాకీస్‌లో ఏ సినిమా ఆడుతోందో తెలియదు.

తెలుసుకున్నా ఒంటరిగా వెళ్ళ లేదు. అసలు ఒంటరిగా వెళ్ళటం అలవాటు లేదు. దెబ్బతిగిలి కట్టు కట్టుకుని బాధ పడిపోతూన్నట్లున్న అశ్వనిని వూహించుకుంటూ దారి తప్పి కాలేజీకి కాక మరో దారి వెంట చాలా దూరం వచ్చేసింది. ఇప్పటికి గ్రహించి ఆగి వెనక్కి తిరి

గింది. మాధురి మనస్సు మనస్సులో లేదు.

ఎలాగో కాలేజీ అయేవరకూ వుండి ఇంటికి వచ్చేసింది. తండ్రిగొంతు పెద్దగా వినిపిస్తోంది.

"అహల్యా అహంకారంతో ప్రవర్తించకు. కళ్ళు మూసుకుని పిల్లలని దేశం మీద వదలకు మాధురి కాలేజీకంటూ ఇంట్లోనించి వెళ్ళి ఏం చేస్తోందో నీకు తెలుసా? ఎక్కడ ఎవరితో తిరుగుతూ వున్నదో నీకు తెలుసా?? కావాలంటే సాక్ష్యం చూపిస్తాను. నీ కూతుర్ని శిక్షించు. ఎలా శిక్షిస్తావో చూస్తాను... నీ ముఖం నీవేం చెయ్యగలవులే. వాడి భరతం నేనేపట్టించేశాను.వాడింక జన్మలో నీ కూతురి జోలికి రాకుండా చేశాను ఇప్పుడు చెప్పు. ఈ ఇంటికి నా అవసరం వుందా లేదా?"

మాధురి వినలేక లోపలికి రాలేక నాంచారమ్మ ఇంటికి వెళ్ళిపోయింది. "ఈ రాత్రికి మాధురిని ఇక్కడ వుంచుకుని రేపు పంపిస్తాను" అని నాంచారమ్మ అహల్యకి కబురుపంపింది కానీ మాధురిని చివాట్లు వేస్తూనేవుంది చాలా సేపు.

మాధురి జరిగిన విషయం చెప్పాలని ప్రయత్నించింది. కానీ ఆవిడ వినిపించుకోలేదు. ఇంక మౌనంగా వుండి పోయింది.



## 24

అహల్య అన్న రామ్మూర్తి వచ్చాడు. ధనంజయరావుకి కబురు పెట్టాడు. ఆయన రాలేదు. తనే మాట్లాడాలని ఆఫీసుకి వెళ్ళాడు.

"ఆఫీసుకి రెండు నెలలు శలవు పెట్టారు. అసలాయన సరిగ్గా ఆఫీసుకి రావటంలేదు. ఇలా అయితే వుద్యోగం వుండటం కష్టం. వార్నింగ్ ఇచ్చినా ఆయన లక్ష్యపెట్టటం లేదు" ఇలా చెప్పారు. రామ్మూర్తి కాళ్ళీడ్చుకుంటూ ఇల్లు చేరి చెల్లెలికీవార్త చెప్పాడు.

అహల్య ఏం మాట్లాడలేదు. రామ్మూర్తికి ఇంకేం చేయటానికీ తోచక చెల్లెలితో అన్నాడు.

"అహల్యా! ఇక్కడ ఇంకా ఎందుకు. దిక్కులేనిదానిలా ఇలా ఎన్నాళ్ళు వుంటావమ్మా? చదువుకునే వయస్సులో జనార్దన్‌ని వుద్యోగంలో పెట్టావు. నువ్వు గొంతు చించుకుని పిల్లలకి పాఠాలు చెప్తూ ఇంటి చాకిరి చేస్తున్నావు. చిక్కి సగం అయ్యావు. పిల్లలు బెంగపడి పోతున్నారు. ఇక్కడ ఒక్క క్షణం వద్దు. నా దగ్గరకి వచ్చేయి."

"నేను ఈ ఇల్లు వదిలి ఎక్కడికీ రానన్నయ్యా. డబ్బు చాలకున్నా ఎలాగో

పొదుపుగా చేసుకుంటాను గానీ నాకు ఒక్క సాయం చేయన్నయ్యా"

"చెప్పమ్మా. ఏం చెయ్యమంటావో చెప్పు"

"మాధురికి పెళ్ళి చెయ్యి. ఈ ఒక్క సాయం చెయ్యి నాకింకేం అక్కరలేదు. అసలు దాన్ని ఇక్కడ వుంచవద్దు. నీ వెంట తీసుకెళ్ళు అన్నయ్యా"

"తీసుకువెడతాను. పెళ్ళి కూడా చేస్తాను. కానీ చదువు ఆపటం ఏమంత మంచి పని కాదు. పరీక్షలు కాగానే వుత్తరం రాయి. నేనేవచ్చి తీసుకువెళ్ళి పోతాను"

అహల్యకి ఇష్టం లేకున్నా అన్నగారి మాట వినక తప్పలేదు. మాధురి కాలేజీకి వెళ్ళివస్తూనేవుంది. రామ్మూర్తి నాంచారమ్మకీ ఆమె భర్తకీ కూడా చెప్పాడు.

"చూడండి. మీరీకుటుంబానికి హితులు. ధనంజయరావుని మార్చలేంగాని మాధురికి యేదైనా పెళ్ళి సంబంధం చూడండి. నేనూ వెతుకుతాను. మీ కెవరన్నా తెల్సినవాళ్ళుంటే వుత్తరం రాయండి. వచ్చి చూస్తాను." అని చెప్పి వెళ్ళి పోయాడు.

మాధురి కాలేజీకి వెడుతోంది. వస్తోంది. కానీ అశ్విని కన్పించలేదు. తాతగార్ని అడిగింది. "అశ్వినిగారెలా వున్నారు ?"

"దెబ్బ కాస్త తగ్గింది వుద్యోగానికి వెడుతూన్నాడుగా"

"నాక్కన్పించటం లేదు. రేపు 9½కి యిక్కడే వెయిట్ చేస్తూంటానని కల్సుకోమనీ కాస్త చెప్తారా"

"అలాగే" తాతగారు వెళ్ళిపోయారు.

అలాగే అన్నారుగానీ ఈ ముసలాయనకి గుర్తుండి చెప్తాడా! చెప్పినా అతను నన్ను కల్సుకుంటాడా! రాత్రి అంతా యిదే ఆలోచన మాధురికి. అతను తప్పకవస్తాడు. వస్తాడు. మనస్సు చెప్తోంది. ప్రతిరోజు కంటే త్వరగా లేచి త్వర త్వరగా స్నానం వగైరా పూర్తి చేసుకుని తొమ్మిదింటికే బయలుదేరింది మాధురి. మెయిన్ రోడ్డు దగ్గరికి వచ్చేసింది. ఆతురతగా చుట్టూ చూసింది. ఎవరూ లేరు. హతాశురాలైంది.

"రాడు అతను రాడు. ఎలా వస్తాడు! ఆత్మాభిమానంవున్న అతను రాడు. నేనే తప్పుచేశానంటే నాన్న మరీ ఘోరమైన తప్పు చేశారు. అతన్ని క్షమించమని అడిగే అర్హత కూడా లేదు. మాధురి వ్యథ పడుతూ సైకిల్ ఆపుకొని అలా నిరీక్షిస్తూనే వుంది. మెయిన్ రోడ్డు మీద కార్లూ, ఆటోలూ, టాక్సీలూ పోతూనే వున్నాయి. దూరంనించి లోడ్ నింపుకున్న లారీ వేగంగా వస్తోంది. మాధురి భయంగా కళ్ళు గట్టిగా మూసుకుంది. లారీ పెద్దగా శబ్దం చేసుకుంటూ వెళ్ళిపోయింది. లారీ దూరంగా పోయిందని ధైర్యం వచ్చిన తరువాత మెల్లగా కళ్ళు తెరచింది. అశ్విని సైకిల్ దిగి యెదురుగా నిల్చుని వున్నాడు. కాస్త చిక్కిపోయినట్లున్నా కళ్లు కాంతితో మెరుస్తూన్నాయి. భుజానికి కట్టుంది. ఒక చేత్తో నడుపుతూన్నాడేమో సైకిల్. మాధురి అతని ముఖంలోకి చూస్తూ నిల్చిపోయింది. అతనూ

అలాగే వుండి పోయాడు. తమ పరిచయం అయిన తర్వాత ఒకర్ని ఒకరు చూసుకోకుండా యిన్నాళ్లు వుండటం ఇదే మొదటిసారి. అశ్వనిని కల్సుకోమని చెప్పండి అని తాతగారితో చెప్పింది. ఇతను వచ్చాడు. కానీ తనెలా మాట్లాడాలో ఎలా క్షమాపణ అడగాలో అర్థం గాక చూస్తూ వుండిపోయింది. మాధురి పల్కరిస్తుందని చూసి చూసి విసుగెత్తి తనే పల్కరించాడు.

"నన్ను కల్సుకోమన్నారట" పొడిగా అన్నాడు.

"అవును. నేనారోజు..." మాధురి నోట్లోంచి మాట రావటం లేదు.

"ఏ రోజు ?" ముఖం చిట్లించి అడిగాడు.

"అదే... ఆ రోజు"

"ఆ విషయం నేను మర్చిపోయాను. దయచేసి గుర్తు చేయ వద్దు! ఇంతకీ నన్ను కల్సుకోమని కబురంపిన కారణం చెప్పండి. త్వరగా వెళ్ళి పోవాలి"

"నన్ను... క్షమించండి"

"మిమ్మల్నా! నేను...క్షమించటమా! ఎందుకు. చూడండి. నేను చాలా సామాన్యుడిని. మీరూ అలాంటి అమ్మాయే అనుకుని కాస్త చనువు పెంచుకున్నాను. ఫలితం అనుభవించాను. సరే ఆ విషయం అంతా మర్చిపోవటానికి ప్రయత్నిస్తాను. ఇంతకీ..." అంటూ మాధురిని అనుమానంగా చూశాడు. అంతలోనే చుట్టూ చూశాడు. మాధురి బాధగా చూస్తూ అంది.

"నన్ను విశ్వసించటం లేదు కదూ! ఎందుకలా అనుమానంగా చూస్తున్నారు?"

"ఏం లేదు. ఈ చుట్టుపట్ల తెల్లటి విమానంకారు వుందేమో అని"

మాధురి ముఖం నల్లగా అయిపోయింది.

"అశ్వనిగారూ!" గొంతు పూడుకుపోయింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"మీరు చెప్పవల్సింది ఏమన్నా వుందా? లేక నేను వెళ్ళిపోనా"

"నాకు ఎలా చెప్పాలో అర్థంకావటం లేదు. అశ్వనిగారూ నన్ను అర్థం చేసుకోండి. మీరు నాకున్న ఏకైక స్నేహితులు".

"ఇందుకు మళ్ళీ ఏదైనా బహుమానం యిస్తారా!"

"అశ్వనిగారూ! తప్పు తెల్సుకుని క్షమించమని అడుగుతూన్నాను. మా నాన్నగారలా చేసినట్లు తెల్సినప్పుడు ఎంత బాధపడ్డానో చెప్పలేను. మీ ముందు నిల్చుని మాట్లాడగల అర్హత పోగొట్టుకున్నాను. మీరు ఇదంతా మర్చిపోయి ఇదివరకులా కల్సివుండమని అర్థిస్తూన్నాను. ఈ విషయం చెప్పాలని యిన్నాళ్ళూ ఆరాటపడ్డాను. చెప్పేశాను. ఇంక మీరే...మీరే..."

అశ్వని ముఖంలోని కాఠిన్యం కరిగిపోతూ వుంది.

"ఈ మాటలన్నీ నమ్మమంటారా!"

"అశ్వనిగారూ" కన్నీళ్ళు వుబికి వచ్చాయి మాధురికి. అశ్వని కోపాన్ని మింగి శాంతం తెచ్చుకుంటూ—

"మీరు స్నేహ హస్తం చాస్తూంటే

కాదని దూరంగా తరిమేంత కఠినుడిని కాను మాధురీదేవీ. ఆరోజు చెప్పలేదూ మీరంటే నాకెప్పుడూ గౌరవమేననీ, అభిమానమేననీ"

మాధురి కళ్ళెత్తి అతని ముఖంలోకి చూసింది. మనస్సులోని బాధని నొక్కిపెట్టి మామూలుగా మాట్లాడటానికి ప్రయత్నిస్తూన్నట్లు తెలుస్తూనే వుంది. సూటిగా చూస్తూన్నాడు.

"నేను ఇంకోవారం వరకూ సిటీకి రాలేను. మరి వెళ్ళొస్తాను" వెళ్ళిపోయాడు అశ్వని. మాధురికి నీరసం ముంచుకు వచ్చింది. వెళ్ళిపోయాడు. అశ్వనీకుమార్ వెళ్ళిపోయాడు. బాధగా అనుకుని సైకిల్ ఎక్కి బయలుదేరింది. వంటరిగా ప్రయాణించటం చాలా కష్టంగా వుంది. అయినా తప్పదు.



## 25

నాంచారమ్మ మాధురికోసం వరుడిని వెతుకుతూ వుంది. తెల్సినవాళ్ళ కల్లా చెప్తోంది. 'బియ్యే ఫైనలియర్ చదివే అందమైన అమ్మాయికి అబ్బాయికావాలి. కట్నకానుకలు యివ్వలేరు. కానీ పిల్ల లక్ష్మిలా వుంటుంది. గుణవంతురాలు కూడా' ఇలా చెప్తోంటే ఒకావిడ నాంచారమ్మని నిలదీసి అడిగింది.

"ఎంత అందంవున్నా కట్నం ఇవ్వ లేకపోతే పెళ్ళి ఎవరుచేసుకుంటారమ్మా"

"ఎందుకు చేసుకోకూడదు. చదువుకున్నపిల్ల. ఉద్యోగంవస్తే నెలకి నాలుగొందలు తెచ్చి యిస్తుంది. ఇదిచాలదా!" అని దబాయించేస్తోంది నాంచారమ్మ.

జనార్థన్ జీతండబ్బు తెచ్చి తల్లికి ఇస్తున్నాడు.

"జనార్థన్! ప్రైవేటుగా చదువుకునేలా చూడునాయనా!" అంది అహల్య.

"అలాగేనమ్మా... ప్రయత్నిస్తాను" బుద్ధిగా జవాబు చెప్పాడు. మధుబాబు అల్లరి పిల్లలతో స్నేహితంమొదలెట్టాడు. స్కూలుకి పోతున్నానని చెప్పి వెళ్ళకుండా ఆటలుఆడి సాయంకాలం యింటికి వస్తున్నాడు. ఇది తెల్సుకున్న అహల్య మధుని మందలించింది. లోలోపల బాధపడింది. మధు పుస్తకాలసంచీ పారేసుకుని బట్టలన్నీ బురద చేసుకుని యిల్లు చేరాడు. అహల్య కోపంగా అడిగింది

"నీ పుస్తకాలేవి.బట్టల-తా ఈ బురద ఏమిటి!" అని. మధు జవాబుచెప్పలేదు. అహల్య ఎన్నిసార్లు అడిగినా జవాబురాకపోయేసరికి వీపు చిట్లిపోయేలా కొట్టింది. మధుని యెప్పుడూ కొట్టదు. అందుకే మధు గాభరాపడి ఏడ్చిఏడ్చి అన్నం తినకుండా నిద్రపోయాడు. మర్నాడు జ్వరం వచ్చేసింది. ఆ జ్వరతీవ్రతలో కలవరిస్తున్నాడు. "నాన్నా! అమ్మ నన్ను కొడ్తోంది. మీరురండి నాన్నా! కొట్టవద్దు అని చెప్పండి నాన్నా! నాన్నా మీరు యింటికి రండి నాన్నా! నేను మీదగ్గరే వుంటా నాన్నా! అమ్మ దగ్గరకి వెళ్ళను నాన్నా! అమ్మ మారి

పోయింది నాన్నా!"

ఇలా కలవరిస్తున్న మధుని చూస్తూంటే అహల్యకి కన్నీళ్ళు ఆగటం లేదు. 'పసివాడిని కొట్టాను. వీడి మనస్సు గాయపడింది. అయ్యో' లోలోపల దిగులు పడింది. తెల్లవారేవరకూ మధు మంచందగ్గరే కూర్చుంది. తెల్లవారింది. మధుకి కాస్త జ్వరం తగ్గింది. మాధురి కాలేజీకి వెళ్ళింది. జనార్దన్ బట్టల షాపుకి వెళ్ళాడు. మధు నిద్రపోతూ న్నాడు. అహల్య స్నానంచేసి భోజనం చేయటానికి కూర్చుంది. కడుపులో ఆకలి కరకరమంటూ వుంది. కానీ అన్నంతినాలి అన్పించటంలేదు. మధుకి కాస్త జ్వరంవస్తే తనకి ఇంత గాభరా ఎందుకు! ఇదివరకోసారి మధుకి టైఫాయిడ్ వచ్చింది. అప్పుడు అస్తమానం ధనంజయరావు మధు మంచందగ్గరే వుండిపోయాడు. మందులిస్తూండేవాడు. ఆయన తన పక్కన వున్నాడు గనుక మనస్సుకి శాంతి వుండప్పుడు. కానీ యిప్పుడు. తనకి ధైర్యం ఎవరుచెప్తారు. 'నేవున్నానుమధుకి భయంలేదు అహల్యా నువ్వు విశ్రాంతి తీసుకో' అనేవాడు. ఇప్పుడా ఆశలేదు. ఎంత దుఃఖాన్నైనా వంటరిగా మౌనంగా మింగేయాలి. ఎన్నాళ్ళిలా బ్రతకాలి. ఈ ముగ్గురు పిల్లలకోసం అయినా తను బ్రతకాలి. తప్పదు.

దాదాపు ఇరవై సంవత్సరాలు కష్టసుఖాల్లో పాలు పంచుకుంటూ శరీరాలు వేరు అయినా ఒకే ప్రాణంగా బ్రతికారు యిద్దరూ. ఆయన యిదంతా యెలా మర్చి పోగలిగారు! మరో స్త్రీతో సంబంధం యెలా పెట్టుకో గలిగారు. ఇదివరకెన్నడూ లేని యీ బలహీనత యెలా వచ్చింది. ఆయనలోని యెన్నో బలహీనతలని భరించి అతనికి అనుగుణంగా తను సర్దుకుంది. కానీ ఈ ఒక్క విషయంలో మాత్రం ఆయన్ని క్షమించ గల శక్తి తనకి లేదు. ఈ యింట్లోగానీ మనస్సులోగాని అతనికి చోటులేదు.తను యివ్వలేదు. తనే కాదు ఆత్మాభిమానం వున్న యే స్త్రీ కూడా యివ్వలేదు.

ఈ వూహల్లో మునిగి అన్నం తినాలన్న మాట మరిచిపోయి అలాగే కూర్చుండి పోయింది అహల్య.

"అమ్మా...మంచినీళ్ళమ్మా" మధు లేచి కూర్చుని అడిగాడు. అహల్య చప్పునలేచి చెయ్యి కడుక్కుని మంచి నీళ్ళు తెచ్చి యిచ్చింది. మధు నీళ్ళు తాగి గ్లాసు యిచ్చేశాడు.

"అమ్మా......నాన్నారు మనింటికి రారామ్మా"

"........................"

"చెప్పమ్మా...రారామ్మా"

"........................"

"నువ్వే రావద్దన్నావు. అందుకే నాన్నారు రావటంలేదు. నాన్న రాకుంటే నాకీ జ్వరం తగ్గదమ్మా"

అహల్య మాట మార్చేస్తూ అంది.

"మధూ బ్రెడ్ తింటావా! కాఫీ యివ్వనా"

"ఏం వద్దు"

"మరేం కావాలి"

"నాన్నారు కావాలి...నాకు నాన్న కావాలి" యేడుస్తూ పడుకుని దుప్పటి

కప్పేసుకున్నాడు. దిక్కు తోచనిదానిలా అహల్య మంచంమీద కూలబడింది. భోజనం పూర్తిగా చెయ్యనే లేదు. అంతలో నాంచారమ్మ వచ్చింది.

''మధు కెలా వుంది వదినగారూ!''

''రండి. కాస్త తగ్గింది. మందువేశాం కానీ అదోలా మాట్లాడుతూన్నాడు. నాకు భయంగా వుంది" అహల్య తన బాధని వెళ్ళ బోసుకుంది. నాంచారమ్మ మధు చెయ్యి పట్టుకొని చూసింది.

''ఏం బాబూ యేం కావాలి. కాఫీ తాగుతావా''

''నాకేం వద్దు అత్తగారూ. అమ్మ నన్ను కొట్టింది. అందుకే జ్వరం వచ్చింది'' అని మళ్ళీ దుప్పటి ముసుగు బిగించాడు 'నిజమేనా' అన్నట్లు చూసింది అహల్య వైపు.

''నిజమే వదినగారూ మధు యీ మధ్య చాలా అల్లరి నేర్చుకున్నాడు" అంటూ జరిగింది అంతా క్లుప్తంగా చెప్పేసింది.

"వదినగారూ మీ అశాంతి పిల్లలు మనస్సుని గాయ పరుస్తోంది. మరెప్పుడూ యిలా తొందర పడకండి" మెల్లగా మందలించింది నాంచారమ్మ.

"నిజమే. నా విసుగులో వీళ్ళని గమనించక పొరబాటు చేశాను"

"పోనివ్వండి. మధుకి జ్వరం అదే తగ్గుతుందిగానీ మీరు దిగులు పడకండి. అన్నట్లు మరో ముఖ్య విషయం. మన మాధురికి ఓ మంచి సంబంధం చూశాను. అబ్బాయి అస్సాంలో పనిచేస్తూన్నాడు ఇంజనీరుగా. త్వరలో శలవుల్లో వస్తాడట. మాధురిని చూపిద్దాం.

"ఇంజనీరా! అయితే వద్దు..."

"అదేమిటి అలా అంటారు"

"వాళ్ళకి కావల్సిన కట్నం మనం యివ్వలేం"

"అదా మీ భయం. వాళ్ళకి అన్నీ చెప్పాను. అమ్మాయి గుణవంతురాలూ, చదువుకున్న పిల్లా అయితే చాలు అన్నది అతని తల్లి."

"నిజంగానా"

"ఔనండీ. మన మాధురి తప్పక వాళ్ళకి నచ్చుతుంది. ఇదంతా సరేగానీ ఎందుకైనా మంచిది ఈ విషయం మాధురికి ముందే చెప్పి వుంచండి."

"ఆఁ... దానిముఖం. ఏం తెల్సు దానికి."

"ఇలా మీ మనస్సులో అనుకుని వూరుకుంటే యెలా! ఓ మాట చెప్పి వుంచటం నయం"

"పోనీ మీరు చెప్పినట్లే చేస్తానుగానీ ఈ సంబంధం ఖాయంఅయేలా చూడండి వదినెగారూ. మాధురికి మూడు ముళ్ళూ పడితేచాలు. నేనెవరినీ ఏమీ అర్థించను. ఈ మగపిల్లలని చూసుకుంటూ కాలం వెళ్ళదీస్తాను."

నాంచారమ్మ నవ్వేసింది. మధుకి బిస్కట్లు యిచ్చి వెళ్ళివస్తానని చెప్పివెళ్ళి పోయింది. ఇంక పిల్లలు బిలబిల్లాడుతూ వచ్చారు చదువుకునేందుకు. అహల్య వాళ్ళని కూర్చోమని పెరటి తలుపు మూసి వచ్చి చదువు చెప్పటంలో మునిగి పోయింది. ఎనిమిదిమందీ పదేళ్లలోపుపిల్లలే. తగని అల్లరి చేస్తూ విసిగిస్తూవున్నారు.

అయినా శాంతంగా వాళ్ళ గోల భరించి చదువు చెప్తూనే వుంది అహల్య. వీళ్ళు చదువు అయి వెళ్ళేసరికి అహల్యకి చెప్పలేనంత నీరసం ముంచుకు వచ్చేస్తుంది. అల్సిపోయి మంచం మీద వాలిపోతుంది. తలనొప్పితో పగిలిపోయేలా వుంటుంది. ఈ బాధని భరిస్తూ కళ్ళు గట్టిగా మూసుకుని అలా చాలా సేపు వుండిపోతుంది అహల్య.



## 26

ఉదయం తొమ్మిది గంటలు దాటింది. మాధురి కాలేజీకి బయలుదేరింది. అశ్విని మాధురిని చూస్తూనే "గుడ్‌మార్నింగ్ మాధురీదేవీ" పల్కరించాడు.

"మార్నింగ్! ఇవాళ చాలా వుత్సాహంగా వున్నారు. కారణం అడగవచ్చునా!"

"ఓయస్ అడగవచ్చు. అసలు మీరు అడక్కుండానే చెప్పేస్తానుగా. రేపు మా అన్నయ్య వస్తున్నాడు."

"అల్లాగా! అయితే ఇంక మీరు కన్పించరన్న మాట"

"అన్న మాటే. రేపురాను. కానీ ఎల్లుండి సాయంకాలం వస్తాను. మీరు కాలేజీనించి బయలుదేరి మనం కల్సుకునే చోటున వెయిట్ చేస్తూ వుంటాను. టైము వుంటే కాలేజీకి వస్తాను. రేపు మాత్రం మీరు త్వరగా ఇంటికి వెళ్ళిపోండి"

"మీ అప్పగింతలు చాలా బాగున్నాయి" చిరుకోపంగా చూస్తూ అంది. అశ్విని నవ్వేశాడు. "వెళ్ళిపోదామా! అన్నట్లు యివాళ మన తాతగారింకా రాలేదేం చెప్మా... ఆఁ... వస్తూన్నారు పదండి" అశ్విని బయలుదేరాడు. మాధురీ బయలు దేరింది. తాతగారు వీళ్ళిద్దరూ వెళ్ళిపోయారేమో అని త్వర త్వరగా వచ్చేసినందువల్ల ఆయాసంవచ్చేస్తోంది. రొప్పుతూ అన్నారు —

"మీ రిద్దరూ వెళ్ళిపోయారేమోనని గాభరాపడ్డాను"

"మీ కోసం ఆగామండీ. ఇంతకీ మీరీ మధ్య సరిగ్గా రావటంలేదు యెందుచేత" మాధురి తాతగారి సైకిల్ పక్కనే తన సైకిల్ పోనిస్తూ అడిగింది.

"పాతవుద్యోగం పోయింది. కొత్త వుద్యోగం వెతుక్కునే పనిలో వున్నానమ్మా"

"తాతగారూ! తలలుపండిన మీలాంటి వాళ్ళు ఓ వుద్యోగంలో ముప్పైయేళ్ళుచేసి రిటైర్‌అయిన తర్వాతకూడామళ్ళీ వుద్యోగం అంటూ మాలాంటి యువకులకి పోటీకి వస్తే యెలాగండీ" అశ్విని నవ్వుతూనే అడిగాడు. తాతగారూ కోపగించుకోలేదు

"నిజమేబాబూ! మేం మీకు పోటీ రాకూడదు. అయితే వుద్యోగంలో నించి రిటైర్ అయిన ప్రతివుద్యోగీ బాధ్యతల నించి రిటైర్ కాకపోవటంవల్ల మళ్ళీ యీ

వుద్యోగపువేట తప్పటం లేదు."

"అంటే?"

"భగవంతుడి పిలుపు వచ్చే వరకూ మనిషికి బాధ్యతలు తప్పవు. అందునా మధ్యతరగతి వాళ్లకి జీవితం ఆఖరు క్షణాల్లో శాశ్వత రిటైర్‌మెంట్" తాతగారిమాట పూర్తికాకుండానే పెద్ద దగ్గు తెర వచ్చింది. ఆయన ఆగటంవల్ల మాధురీ అశ్వనీ కూడా ఆగిపోయారు. అయిదునిమిషాలతర్వాత ఆయన స్థిమిత పడి మళ్ళీ సైకిల్ యెక్కారు. మాధురీ అశ్వనీ కూడా బయలుదేరారు.

"మీ యిద్దరితో కల్సి యిలా యెంత దూరం ప్రయాణించినా అలసట రాదు నాకు"

అశ్వనీ మాధురీ నవ్వేశారు.

"భలే ప్రయాణీకులం మనం. ఈ మన ప్రయాణం యింకెన్నాళ్ళోజరగదు కదండీ" అశ్వని అన్నాడు. తాతగారు గాభరాగా "ఎందుకనీ" అడిగారు.

"మాధురిగారి చదువు అయిపోతోంది. నాకు కొత్త వుద్యోగం రాబోతోంది. అది వస్తే నాయిష్టం వచ్చినట్లు వెళ్ళటం రావటం జరగదు కదండీ"

"నిజమే సుమా! మాధురీ మీయిద్దరి అడ్రెస్‌లూ యివ్వండి. ఓ ఆదివారంవచ్చి చూస్తాను మీవాళ్ళనందరినీ"

"తాతగారూ ఆదివారం పుదయం తొమ్మిదిగంటలలోపల అయితేనే యింట్లో వుంటాను తప్పకరండి" అంటూ యింటి అడ్రెస్ చెప్పాడు అశ్వని.

"సరే మాధురీ నువ్వు చెప్పమ్మా"

"నేను ఆదివారం అంతా యింట్లోనే వుంటాను. మీ వీలు చూసుకురండి తాత గారూ"

"ఆదివారం ఏ మార్నింగ్‌షోకన్నా వెళ్ళవామ్మా, నీలాంటి వాళ్ళు ఈకాలంలో వున్నారా? అందులోనూ ఆడపిల్లలు!"

"నాకాఅలవాట్లు లేవండీ"

వీళ్ళిద్దరూ మాటల్లోపడి కాస్త వెనక పడ్డారు. అశ్వని ముందుకు వెళ్ళబోయి, మళ్ళీ ఆగి, యిలా అవస్థపడుతున్నాడు.

"అశ్వనిగారూ! కాస్త మీ పంచ కళ్యాణ్యికి పగ్గం వెయ్యండి. తాతగారు ఆయాసపడి పోవల్సివస్తుంది" మాధురి మందలిస్తూన్నట్లు అంది.

"ఈ అశ్వాన్ని పగ్గాలు బిగించి పట్టుకున్నా సర్రున దూసుకుపోతూనే వుంది, సైకిల్ స్లో చేస్తూ అన్నాడు. అశ్వనికి తన సైకిల్ అంటే అయిదో ప్రాణం. దీనికి అన్నగారు ముద్దుగా పంచకళ్యాణి అని పేరు పెట్టాడనీ, దీని క్షేమం వుత్తరాల్లో కూడా రాస్తాడనీ ఓ సారి చెప్పాడు అశ్వని. అప్పటినించీ మాధురి కూడా పంచకళ్యాణి అనే పిలుస్తుంది. ఈ మాట తాతగారికీ అలవాటయింది. అసలు ముగ్గురూ కల్సి వెళ్ళేది వుదయమప్పుడే. సాయంకాలం తాతగారు ఆలశ్యంగా వస్తారు. అందుకని కల్సుకోలేరు. ఉదయం పూట యీ స్నేహితులు యెక్కడ త్వరగా వెళ్ళి పోతారో అని తాతగారు హడావుడిగా వచ్చేస్తారు. ఒక్కోసారి అశ్వనితో బాటు పోటీపడి సైకిల్ నడపటం ఆయనకి సరదా. ఓ సారి మాధురి యీ యిద్దరికీ పందెం వేసింది. ఎవరు ముందుగా

వెళ్ళగలరో చూస్తాను అని. అశ్వని సైకిల్ ఆపి అడిగాడు.

"పందెం గెల్చిన వాళ్ళు పార్టీ ఇవ్వాలి. తాతగారూ సరేనా"

"ఓ అలాగే"

"అయితే మనిద్దరికీ మాధురి జడ్జి. ఎవరం గెల్చినా ఈమెకి పార్టీ యిద్దాం"

"సరే"

"అయితే నేరెడీ !" రెడీగా నిల్చున్నాడు అశ్వని. ఇంక తాతగారు పంచ పైకి మడిచి దోపి, పై మీదవుత్తరీయం నడుముకి బిగించి కట్టి మరీ సైకిల్ తీసుకున్నారు. మాధురి వన్ టూ...త్రీ అనగానే యిద్దరూ బయలు దేరారు. మాధురి వాళ్ళని అనుసరించింది. అశ్వని సరదాగా నవ్వుతూ ఆయన్ని సవాల్ చేస్తూ చివరివరకూ తనే ముందుకి దూసుకుపోయి ఆఖరున కావాలని తాతగార్ని గెలిపించి వెనకబడిపోతూన్నట్లు నటించి "అయ్యొ బాబోయ్! తాతగారూ మీరు నన్నే వోడించేశారు" నవ్వుతూ వోటమిని ఒప్పుకున్నాడు. తాతగారు సంబరపడి పోయారు. మాధురి చప్పట్లు చరిచి "భలే మీరేగెలిచారు. మరి పార్టీ" అంది. తాత్తగారు షర్టు జేబు తడుము కున్నారు రొప్పుతూనే. చేతికి అర్థ రూపాయ కాసు తగలగానే ఆయన ముఖం పాలిపోయింది. ఇది గ్రహించిన అశ్వని మాట మార్చేస్తూ

"మాధురిగారూ హోటల్సులో టిఫిను బాగుండటం లేదు. సిటీలో కలరా కూడా వుంది. ఓ రోజు తాతగారింటికి యిద్దరం కల్సి వెడదాం" అన్నాడు మాధురికి యిది నచ్చలేదు. కానీ అశ్వని ముఖం లోని భావం గ్రహించి 'అలాగే' అంది. తాతగారు తేలిగ్గా గాలి పీల్చుకుని—

"చూడండర్రా! రేపు ప్రొద్దున పచ్చి మిరపకాయ బజ్జీలు వేడిగా తెస్తాను. అవి మా ఆవిడ రుచిగా చేస్తుంది. ఆ తర్వాత ఓ రోజు మీరిద్దరూ తప్పక రండి"

"అలాగే...చూడండి! పచ్చి మిరప కాయ బజ్జీలంటే నాకు చచ్చేంత యిష్టం. నా వాటాలో మరో నాలుగు యెక్కువ వేయించి తెండి" అశ్వని అడిగేశాడు.

తాతగారు "మనదారులు చీలిపోతూన్నాయర్రా వస్తాను. రేపు కలుద్దాం" అని వెళ్ళిపోయాడు. అశ్వనీ వెళ్ళి పోయాడు. మాధురీ కాలేజీకి వెళ్ళి పోయింది. తాతగారు అన్న ప్రకారం మర్నాడు పచ్చి మిరపకాయ బజ్జీల పొట్లంతో సహా వచ్చారు. అశ్వని తన వాటా కాక మాధురి వాటలోనివి కూడా రెండు తీసుకు తినేసి "అబ్బ ... కారం మంట ... నాలిక మండిపోతోంది" అని చిన్న పిల్లవాడిలా అల్లరి చేస్తూ వుంటే మాధురి వెక్కిరించింది. అశ్వని అంత బాధనీ భరిస్తూ మళ్ళీ వెక్కిరించి బదులు తీర్చేసు కున్నాడు. ఇలా కల్సి వెళ్ళటంతో ముగ్గురికీ మరీ చనువు యేర్పడింది. ఈ రోజు మాధురికి యీ విషయాలన్నీ గురుకి వచ్చాయి. అశ్వనికి కొత్త వుద్యోగంవస్తే తన చదువు అయిపోతే యిలా కల్సుకునే అవకాశం యింక

వుండదు అన్న విషయం బాధ కల్గి స్తోంది. అశ్వనికి మనస్సులో యెలా వుందో కానీ పైకి నవ్వుతూ కబుర్లు చెప్తూన్నాడు.

"మాధురీ మరి శలవా!" అశ్వని అడిగాడు.

"ఇవ్వను"

"అయితే ఇక్కడే నిల్చుంటాను"

"చాలా మంచివారు. ఇవాళ నాకు కాలేజీలో ప్రోగ్రాం వుంది వార్షికోత్స వం సందర్భంగా. డిబేట్‌లో పాల్గొ నాలి.భారత స్త్రీ నాడూ నేడూ అనే విష యం గురించి. సరేగానీ మళ్ళీ యెప్పుడు కలుద్దాం" అంది.

"నేవీలుంటే యెల్లుండి వుదయం తప్పక వస్తాను"

"ఆ రోజే మా వార్షికోత్సవం ప్రోగ్రాం లున్నాయి.

"అలాగా. కాలేజీకి రమ్మంటారా"

"వద్దు రావద్దు"

"ఏం"

"ఏంలేదు. ఆ రోజు నేను ఇంటికి రావ టానికి ఆలశ్యం కావచ్చు. మీరు అనవ సరంగా వెయిట్ చేయాలి. అందుకని. నేను నా ఫ్రెండ్ ఇంట్లో వుండి. మర్నాడు వస్తాను. మీరు రారు కదూ!"

మాధురి ఇంత గట్టిగా రావద్దు అంటున్నందుకు ఆశ్చర్యపోయినా "సరే...రాను లెండి ... చూడండీ మీ ప్రోగ్రాం చూడ్డాలనిపిస్తే మాత్రం వస్తాను"

"వద్దు."

"రాను లెండి! సరే, నేను పోతు న్నాను." అశ్వని విస్సురుగా వెళ్ళి పోయాడు. మాధురి కాలేజీకి వెళ్ళి పోయింది.



## 27

మధుకి జ్వరం తగ్గినట్లే తగ్గి మళ్ళీ ఎక్కువ అయింది.

"టైఫాయిడ్ లక్షణాలు కనిపిస్తు న్నాయి. జాగ్రత్తగా వుండాలి" అన్నాడు డాక్టర్.

ఈ మాటకు హడలిపోయింది అహల్య. నాంచారమ్మా ఆవిడ మొగుడూ రోజుకి రెండుసార్లు వచ్చి చూసి వెడు తున్నారు. అయినా అహల్యకి అధైర్యం గానే వుంది. జనార్దన్ మందులు కొని తెచ్చాడు. మాధురి మధు దగ్గరనే వుంది. మధు వళ్ళు తెలియకుండా మంచం మీద పడివున్నాడు. సాయం కాలం నించీ ఆకాశంలో మబ్బు పట్టి వుంది. ఈదురుగాలి వీస్తోంది. వర్షం ప్రారంభమైంది. రాత్రి అవుతున్న కొద్దీ అహల్యకి భయం ఎక్కువవుతున్నది. మధు జ్వర తీవ్రతతో కలవరిస్తూన్నాడు.

"నాన్నారూ...రండి...నాన్నారూ... నన్ను ... తీసుకువెళ్ళండి. నాన్నారూ

అమ్మ నన్ను కొడుతోంది...నాన్నారూ"

డాక్టర్ ఈ మాటలు విన్నాడు. "వీళ్ళనాన్నగారు వూరిలోలేరా? లేకుంటే ఎక్కడ వున్నా సరే పిలిపించండి" అని చెప్పి వెళ్లాడు. నాంచారమ్మ అహల్యకి తోడుగా ఇక్కడే వున్నది. డాక్టర్ మాటలు విన్నది. కాస్త ఇవతలకి వచ్చింది

"ఇప్పుడెలా?" అంది. అహల్య ఏం చెప్తుంది. తల వంచుకుని నేల మీద పిచ్చి గీతలు గీస్తూ వుంది. మాధురి ముఖంలోకి చూసింది నాంచారమ్మ.

నేను ఏం చేయను అత్తగారూ అన్నట్లు చూసింది. జనార్దన్‌కి మధు స్థితి చూస్తే భయంగా వుంది.

"అమ్మా ... నేవెళ్ళి నాన్న గార్ని తీసుకు వస్తానమ్మా" అన్నాడు తల్లికి దగ్గరగా వస్తూ.

"వద్దు"

"వదినగారూ! మీ భార్యా భర్తల పంతాల్లో పసివాడిని నలిగిపోనీయకండి. నేను దూరం ఆలోచించి చెప్తూన్నాను. జనార్దన్‌ని వెళ్ళనీయండి" నాంచారమ్మ బ్రతిమాలింది.

"వద్దు వద్దు! ఈ పిల్లలూ నేనూ ఏమైపోయినా ఆయనకి అక్కర్లేదు. ఈ మాట నా ముఖం మీద అనే వెళ్ళారు. ఆయనకి కావలిసింది మేం కాదు."

"వదినగారూ ఆవేశపడకండి.ఆయన కోపంలో అలా అని వుండచ్చు కానీ మధుకి ఇలా జ్వరం వచ్చిందని తెలిస్తే ఎక్కడున్నా రెక్కలు కట్టుకుని వాలతారు."

అహల్య మాట్లాడలేదు. వెళ్ళటానికి జనార్దన్‌కి అనుమతి ఇవ్వలేదు.

బైట చీకటి చిక్కపడింది. ఉరుములతో మెరుపులతో వర్షం ఉధృతంగా కురుస్తోంది. అహల్య కన్నీళ్ళు కాల్వలు కడుతున్నాయి. మాధురికి యేంచేయాలో అర్థంకాకుండావుంది. మధు పరిస్థితి బాగాలేదు. ఒకవేళ నాన్నగారు వస్తే వీడిజ్వరం తగ్గుతుందేమో! అమ్మ ఇప్పుడూ యిలా పట్టుబడితేయెలా!.

బైట యెక్కడో 'ఢాం' మని పిడుగు పడింది. మధు వులిక్కిపడిపోయాడు. "నాన్నా...నాన్నా నాకు భయం వేస్తోంది నాన్నా'' అంటున్నాడు.

"జనార్దన్ పద నేనూ వస్తాను" మాధురి గొడుగు తీసుకుని చెప్పులువేసుకుంది. 'ఆడపిల్లవి నువ్వెందుకమ్మా'' వారించింది నాంచారమ్మ.

''జనార్దన్‌కి చీకటి అంటే భయం. వాడికి నేను తోడు. నాకు వాడు తోడు! అత్తయ్యా మధునీ, అమ్మనీ చూసుకుంటూ వుండు. త్వరగా వచ్చేస్తాం"

నాంచారమ్మా అహల్యా యేదో అంటున్నారు. మాధవి విన్పించుకోలేదు.

"అక్కా, అక్కడికి నువ్వెందుకు" ఇబ్బందిగా చూశాడు జనార్దన్

"నన్నుచూసి సిగ్గుపడిఅయినా నాన్న వస్తారేమో అని ఆశరా! పద."

మాధురి చేతిలోని గొడుగుగాలి విసురుకి యెగిరిపోయేలావుంది. జనార్దన్‌తను తీసుకుని గట్టిగా పట్టుకున్నాడు. పది గజాలన్నా ముందుకుపోకముందేగొడుగు యెగిరిపోయింది. 'అయ్యయ్యో' వర్షంలో

తడిసి ముద్ద అయిపోతూ జనార్దన్ ఆగి "వెనక్కి పోదామా అక్కా" అడిగాడు.

"వద్దు పద. నాన్న దగ్గరకి వెళ్ళి తీరాలి"

జనార్దన్ నడుస్తూన్నాడు. తమ్ముడిని అనుసరిస్తోంది మాధురి.

"జనార్దన్ నీకా యిల్లు యెలాతెల్సు"

"నా ఫ్రెండ్‌తో యెక్కడికో వెళ్ళి వస్తూంటే నాన్నగారు ఆ యింట్లో కన్పించారు. ఆశ్చర్యపోయాను"

మాధురికి యింక వినటం యిష్టం లేదు. అందుకే మౌనంగా నడుస్తోంది. రోడ్డుమీద వర్షపునీరు కాలువలా ప్రవహిస్తోంది. త్వరత్వరగా నడవటానికి వీలులేకుండా వుంది. మాధురి ఒకటి రెండుసార్లు తూలిపడబోయింది. జనార్దన్ అక్కచేతిని గట్టిగా పట్టుకుని నడుస్తున్నాడు. నడిచినడిచి మాధురి అల్సిపోయింది. వర్షం యెక్కువ అయింది. జనార్దన్ తలతడిసింది. బట్టలూ ముద్ద అయ్యాయి. మాధురి తడిసిన చీరెవంటికి అంటుకపోయి నడవటానికికాళ్ళకి అడ్డం పడుతూవుంది. తలమీదనించి నీళ్ళుముఖం మీదకి కారుతుంటే ఓ చేత్తో తుడుచుకుంటూవుంది ఎక్కడా జనసంచారం లేదు. అప్పుడోకారూ అప్పుడోరిక్షా వర్షం నీళ్లని యీదుకుంటూపోతున్నాయి. మాధురి అల్సిపోతుంది. జనార్దన్ అక్కచేయి పట్టుకుని నడిపించి సందుబూ గొందులూ దాటించి విశాలమైన రోడ్డు మీదకి తీసుకువచ్చాడు. "ఇంత వర్షం పడుతున్నా యివాళ కరెంటు పోలేదు. ఇది మన అదృష్టం" అన్నాడు.

"ఔను. ఈ వర్షంలో లైట్లుకూడా లేకపోతే నాన్నకోసం రావటం జరిగేది కాదు"

"అక్కా మధుకి యేమీ కాదుగదా!"

"అహా... మరేం ఫర్లేదు. నువ్వు దిగులుపడకురా" లోలోపల తనకి భయంగా వున్నాపైకి తమ్ముడికిధైర్యం చెప్తోంది మాధురి.

"అక్కా! సంవత్సరం క్రితంవరకూ మనిల్లు యెంత బాగుండేది."

మాధురి మాట్లాడలేక పోతోంది. జనార్దన్, మౌనంగా నడవలేక పోతున్నాడు. ఇది గ్రహించింది. "ఔనురా! డబ్బు ఎక్కువ లేకున్నా మనిల్లు స్వర్గంలా వుండేది. నాన్నా, అమ్మా, మనం యెంతో తృప్తిగా బ్రతికే వాళ్ళం. ఆరోజులు మళ్ళీ వస్తాయో లేదో! జనార్దన్ ఈ రోడ్డులో అన్నీ పెద్దపెద్ద మేడలే వున్నాయికదూ! ఇంకా ఆ ఇల్లు యెంతదూరంరా. అబ్బ నేనడవలేను."

"దగ్గరికి వచ్చేశాం. అదుగో ఆరోడ్డు మలుపు తిరగాలి." ఇద్దరూ మళ్ళా ఓ అర్థగంట నడిచారు. అదుగో ఆ మూడంతస్తుల మేడ...నువ్వు యిక్కడుండు. నేవెళ్ళి పిలుస్తాను. అసలుగేటుమూసింది. మన పిలుపు విన్పిస్తుందోలేదో."

"నేనూ వస్తాను పద" మాధురి గేటు దగ్గరికి నడిచింది. పెద్ద మేడచుట్టూ యెత్తైన ప్రహరీముందు రెండుకార్లు ఒక్కసారి పోగలిగినంత పెద్ద ఇనుప గేటు. ఆ గేటుకు ఘడియ బిగించివుంది. మేడ లోపల యెక్కడనించో లైటు

వెలుతురు పడుతోంది. మాధురి ముఖం తడుచుకుంటూ చూస్తోంది. జనార్ధన్ గేటుని గట్టిగా కొట్టాడు. పదినిమిషాల తర్వాత ఓ నౌకరు వచ్చి అడిగాడు గేటు తియ్యకుండానే

"ఎవరు"

"ధనంజయరావుగారు అర్జెంటుగా కావాలి. పిలుత్వరగా"

"ఇంట్లోలేరు. ఇప్పుడిప్పుడే రారు" నౌకరు ముఖం చిట్లించి లోపలికి వెళ్ళి పోయాడు. మాధురి నిరాశగా చూస్తూ నిట్టూర్చింది. తమకష్టం అంతా వ్యర్థమేనా!

"అక్కా ఇప్పుడెలా"

"నాన్నారు వచ్చేవరకూ యిక్కడే వుందాం" నిల్చునే వోపిక లేకున్నా గేటుని ఆనుకుని నిల్చుని ఇటూ అటూ చూస్తోంది మాధురి. చలికి వణుకు వస్తోంది. జనార్ధన్ వణుకుతూన్నాడు. మాధురి విశాలంగా వున్న ఆ మేడని చూస్తోంది. ఈ మేడల్లోవుండే అవకాశం అందరికీ రాదు. వచ్చినవాళ్ళు వీటిని వదులుకుని యిరుకు అద్దెకొంప బ్రతుకు లోకి అడుగుపెడతారా! అసంభవం. అనుకుంది. దిగులు నిండిన తల్లి ముఖం కళ్ళల్లో మెదిలింది. కోపం, ఆవేశం ఉక్కిరి బిక్కిరి చేస్తూన్నాయి.

వర్షం కురుస్తోంది. పావుగంట అర్ధగంట అలా నిల్చునే వున్నారు. చలికి వణికిపోతూన్నారు. ఒకటిరెండు కార్లు వస్తూంటే ఆశగా చూశారు. అవి ఈగేటు వరకూ రాకుండానే ఆగిపోయాయి. మరో పావుగంట గడిచింది. దూరంగా కారు లైట్లు. మాధురి ఆశగా చూసింది. తెల్లటి విమానంకారు సర్రునరావటం నౌకరు పరుగున వచ్చి గేటు తెరవటం రాయిలా నిల్చుని చూస్తోంది మాధురి.

"నాన్నారూ...నాన్నారూ మధుకి జ్వరంగా వుంది. ఒక్కసారి ఇంటికి రండి. మీకోసం మధు కలవరిస్తున్నాడు. అక్కా నేనూ వర్షంలో మీకోసం వచ్చాం నాన్నగారూ. ఒక్కసారి రండి. డాక్టర్ మిమ్మల్ని తీసుకురమ్మన్నాడు. రండి నాన్నా...నడిచినడిచి అక్కకాళ్ళు నెప్పి పుట్టాయి నాన్నా."

ఇలా పదిసార్లు పిలిచినా ఈ పిలుపు ధనంజయరావుకి విన్పించలేదు. గ్లాస్ తలుపులు బిగించి సిల్కు కర్టెన్ల మధ్య మెత్తటి సీటుకి జారగిలబడి మత్తుగా హేమరాణిని అనుకుని కూర్చున్న తండ్రిని చూచేసరికి మాధురి రక్తం ఉడుకెత్తిపోయింది. మనస్సు భగ్గున మండింది. పరుగునవెళ్ళి కారు తలుపులు పగలగొట్టి ఇద్దరినీ కిందకిలాగి చావ బాదేయాలి అన్పించింది.

ఇంకా ఇంకా ఏదో చేయాలని అనిపిస్తూ వుంది.మాధురి తిమ్మిరెక్కిపోయిన కాళ్ళని కదిలించి ముందుకు రాకముందే కారు గేటుదాటి లోపలికి వెళ్ళిపోయింది. ఇనుపగేటు మూసేసి నౌకరు వెళ్ళిపోతూ వుంటే జనార్ధన్ గొంతెత్తి మళ్ళీ మళ్ళీ అరిచాడు. అయినా ఎవరూ విన్పించుకో లేదు. గేటుని తన్నాడు. చేతులతో గుద్దాడు. చెయ్యి నొప్పి పుట్టటంతప్ప ప్రయోజనం లేకపోయింది.

"నాన్నారూ...నాన్నారూ" పెద్దగా

అరిచాడు. మేడ ముందుభాగంలో లైట్లు తీసేసి లోపలికి వెళ్ళిపోయారు. అక్కడంతా చీకటి అయిపోయింది.

అక్కా.... మనం యింత కష్టపడి వచ్చినా ప్రయోజనం లేదు. నా పిలుపు నాన్నకి విన్పించలేదు.

మాధురి మేడవైపు చూసింది. రెండో అంతస్తులోని అద్దాల కిటికీలోనించి వెల్తురు కన్పిస్తోంది. ఓ రాయి తీసుకుని విసురుగా కిటికీకి గురిచూసి కొట్టింది. ఆ రాయి కిటికీవరకూ వెళ్ళలేదు. లైటుకి తగిలి ఫెళ్ళున బద్దలయిన శబ్దంతోబాటు నౌకరు గర్జన విన్పించింది. ఇక ఒక్క క్షణం ఇక్కడుండటం మంచిదికాదని జనార్దన్ అక్క చెయ్యి పట్టుకున్నాడు. మేడ గేటు తెరుచుకుంటూ వుంది. నౌకరు హిందీలో కర్కశంగా తిడుతూ యముడిలా బైటకి వస్తున్నాడు. జనార్దన్ మాధురిని తీసుకుని పరుగున ఓ సందులోకి వెళ్ళి మరో మలుపు తిరిగి 'అమ్మయ్య' ఆయాసపడిపోతూ ఆగిపోయారు. కరెంట్ పోయింది. రోడ్లన్నీ గాఢాంధకారంతో నిండిపోయాయి. జనార్దన్‌కి కోపంపోయి భయం పట్టుకుంది. చీకటిలో దారే సరిగా తెలియదు తనొక్కడే అయితే ఫర్లేదు. కానీ అక్క వుంది.

"అక్కా.... నా చెయ్యి వదలకు" అన్నాడు. మాధురి తమ్ముడి దగ్గరగా నడుస్తోంది.

"అక్కా నిజంగా మన పిలుపు నాన్నగారికి విన్పించలేదా !"

"విన్పించుకునే స్థితిలో లేరు"

ఇద్దరూ ఎంతో శక్తిని కూడదీసుకుంటూ నడుస్తున్నారు. కానీ యిల్లు రావటం లేదు.

"దారి తప్పినట్లున్నాంరా తమ్ముడూ" మాధురి ఆయాసపడుతూ అంది.

"కాదక్కా యిద్దరం అలసిపోయాం అందుకే ఇల్లు దూరం అన్పిస్తోంది"

"అంతేనంటావా! కాదురా...మనం వెళ్ళేప్పుడు...ఈ షాపులూ అవీ చూసినట్లు గుర్తులేదు..."

జనార్దన్ ఆగి పరిశీలనగా చూశాడు. నిజమే.... దారితప్పారు. వర్షం కాస్త తగ్గిందికానీ కరెంటు రాలేదు. బహుశా రాకపోవచ్చు. ఇల్లు చేరటానికి ఇంకా అర్థగంట అయినా అవ్వొచ్చు. రిక్షాకూడా ఏదీ కన్పించటం లేదు. అది కన్పించినా జేబులో ఒక్కపైస లేదు. అమ్మ దగ్గర వున్నాయో లేదో తెలియదు. ఇల్లు ఎంత దూరం అయినా అక్క ఎంత అలసిపోయినా నడవక తప్పదు అనుకుని మళ్ళీ వెనక్కి తిరిగి తను ఎక్కడ తప్పిపోయాడో గుర్తుకి తెచ్చుకుంటూ బయలుదేరాడు జనార్దన్. తమ్ముడిని అనుసరించింది మాధురి. అతి కష్టంమీద ఇల్లు చేరారు.

మధుకి జ్వరం ఎక్కువయి గాభరా అయింది. ఇరుగూ పొరుగూ వాళ్ళువచ్చి చూసిడాక్టర్‌దగ్గరకి పరుగెత్తితీసుకువచ్చి చూపించారు. ఇంజక్షన్‌యిచ్చి,మందిచ్చి-

"ఫర్లేదు. కానీ తెల్లవారాలి" అని చెప్పి వెళ్ళిపోయాడు. అహల్య అలసిపోయినదానిలా మధు మంచంమీద తల పెట్టుకుని కిందకూర్చుని వుంది. నాంచా

రమ్మ తలుపు తీసుకుని గాభరాపడుతూ వీళ్ళిద్దరి కోసమూ చూస్తోంది. నీళ్ళు వోడుతూ చలికి వణికిపోతూ తిరిగివచ్చిన వీళ్ళ వెనుక ధనంజయరావు లేకపోవటం చూసి మరేం ప్రశ్నించకుండానే చప్పున యిద్దరికీ చెరో తువ్వాలూ తెచ్చి యిచ్చింది. ఇద్దరూ మధు దగ్గరగా వచ్చి చూశారు. ఇద్దరి కళ్లలోనూ నీళ్ళు తిరిగాయి.

"బట్టలు మార్చుకోండమ్మా ముందు" నాంచారమ్మ హెచ్చరించింది.

సమయానికి తన మొగుడు వూరులో లేకపోవటం వల్ల అర్థరాత్రి ఆడపిల్లని బైటకి పంపవల్సి వచ్చింది. పంపినా ప్రయోజనం లేకపోయింది. అని బాధ పడిపోయింది నాంచారమ్మ.

మాధురీ జనార్ధన్ తడి బట్టలు మార్చుకుని తల తుడుచుకుని వెచ్చగా దుప్పటి కప్పుకున్నా ఇంకా వణుకుతూనే వున్నారు.

"జనార్ధన్! నాన్న కన్పించలేదా!" నాంచారమ్మ దగ్గరగా వచ్చి మెల్లగా అడిగింది.

"కన్పించారు"

"మరి రాలేదేం"

"నా పిలుపు విన్పించలేదు. ఇంక ఈ విషయం అడగకు అత్తా"

నాంచారమ్మ 'సరేలే' అంటూ మళ్ళీ మధు మంచం దగ్గరకి వెళ్ళి పోయింది.

మాధురి కూర్చుని చూస్తోంది. ఏం ఆలోచిస్తోందో కానీ ఆ కళ్ళు అగ్నిని కురిపిస్తున్నట్లు మండుతున్నాయి. జనార్ధన్ అక్క ముఖంలోకి చూసి భయం వేసి చప్పున కళ్ళు మూసుకున్నాడు.



## 28

ఉదయం. మాధురి కాలేజీకి బయలు దేరింది. మధుకి కాస్త తేలికగా వుండటం వల్ల 'నువ్వు వెళ్లమ్మా కాలేజికి నే వుంటానుగా అమ్మకి సాయంగా' అని నాంచారమ్మ అనటంతో మాధురి బయలు దేరింది. మెయిన్ రోడ్డు మీదకి వచ్చే సరికే అశ్వని రెడీగా వున్నాడు. తాతగారూ అతని పక్కన నిల్చుని కబుర్లు చెప్తున్నారు. మాధురి ఆగింది.

"గుడ్ మార్నింగ్" యిద్దరూ ఒకే సారి చెప్పారు. మాధురి యీ మాటకి అలవాటుగా నవ్వలేదు.

"మార్నింగ్" అంది పొడిగా.

"మాధురీ నీ ముఖం అలా వుందేం. రాత్రి అంతా నిద్ర లేనట్లుగా"

"మా తమ్ముడికి జ్వరం అండీ" అంటూనే నాలుగైదు సార్లు 'హాచ్చి' 'హాచ్చి' అంటూ తుమ్మింది.

"అలాగా. ఇప్పుడెలా వుంది"

"కాస్త ఫర్లేదు. ఔనూ యివాళ మీ సైకిల్ ఏదీ"

"వంట్లో బాగా లేదమ్మా రాలేను. కానీ యిక్కడికి వచ్చి కాసేపు మీతో కబుర్లు చెప్పి వెడదామని వచ్చాను.

యింతకీ మీ కాలేజీ వార్షికోత్సవం యెప్పుడు"

"ఇవాళేనండీ."

"నీకు ప్రైజు వున్నట్లుంది కదూ. అది తీసుకుంటుండగానే నేనూ అశ్వనీ వచ్చి చూడాలని అనుకున్నాం. కానీ నేను రాలేను. అశ్వనీ నువు తప్పకుండా వెళ్ళు. చూసి వచ్చి ప్రోగ్రాం ఎలా జరిగిందో రేపు చెప్పు"

'అలాగే' అన్నట్లు తల వూపాడు అశ్వని. మాధురి అయిష్టంగా చూస్తూ "చాలా ఆలశ్యం అవుతుందని చెప్పాను గా" అంది.

"అయితే రాను లెండి"

తాతగారు "మీకు టైమయి పోయింది నేవెళ్ళి వస్తా" అంటూ వెనక్కి వెళ్ళిపోయారు. అశ్వనీ, మాధురీ సైకిళ్ళు ఎక్కారు. మాధురి మౌనంగా సైకిల్ పోనిస్తోంది.

"సాయంకాలం ప్రోగ్రాం అయితే ఇప్పుడు వెళ్ళటం ఎందుకు"

"పని వుంది"

"ఇవాళ ఈ పుస్తకాలేమిటీ"

మాధురి త్రుళ్ళిపడినట్లయింది.

"అబ్బే ఏం లేదు ... ఇంతకీ మీ అన్నగారు వచ్చారా"

"ఓ వచ్చాడు! వస్తూ నాకీ రింగ్ తెచ్చాడు. అంటూ ఎడం చెయ్యి వేలి కున్న వుంగరం చూపాడు. నీలం రాయి పొదిగి అందంగా మెరుస్తూవుంది వుంగరం.

"బాగుందా"

"ఊఁ"

"అచ్చంగా యిలాంటి వుంగరమే తనూ చేయించుకున్నాడు."

"ఊఁ"

"మీ ముఖం ప్రశాంతంగా లేదివాళ" అశ్వని మాధురి ముఖంలోకి చూస్తూ అన్నాడు.

"ఏం లేదు. బాగున్నాను"

"లేదు. నా దృష్టి మీదా,నా మనస్సు మీదా నాకు నమ్మకం చాలా ఎక్కువ" సూటిగా చూస్తూ అన్నాడు.

మాధురి కళ్ళు తిప్పేసుకుంది. ఇంకా గట్టిగా అడగటం ఇష్టం లేక అశ్వని వూరుకున్నాడు.

మళ్ళీ ఇద్దరూ మౌనంగా సైకిళ్ళని పోనిస్తూన్నారు. అశ్వనికి ఒక్కొక్కప్పుడు చెప్పలేనంత విసుగొస్తుంది మాధురి ప్రవర్తనకి. ఎప్పుడూ సీరియస్‌గానే వుంటుంది. అబ్బ అనుకున్నా అంతలోనే జాలీ వేస్తుంది. పాపం ఏవో సమస్యలతో సతమతమైపోతూ వుంది. కోపగించుకోకూడదు" ఆలోచనలని ఆపి ఆగి అన్నాడు.

"మాధురి గారూ నా దారి యిటు. మరి సాయంకాలం?"

"మీరు వెళ్ళిపొండి" అంటూనే వెళ్ళిపోయింది మాధురి. అశ్వనికి వళ్ళు మండుకు వచ్చింది. విస్సురుగా వెళ్ళిపోతూ "ఈ అమ్మాయికి బుద్ధి లేదు" అనుకున్నాడు. రావద్దు రావద్దు అంటుంది గానీ చీకట్లో ఎలా వస్తుంది. వెధవ లారీని చూస్తేనే చచ్చే భయం. పెద్ద ధైర్యవంతురాల్లా 'రావద్దు.' అంటే నాకా నష్టం. వెళ్ళను గాక వెళ్ళను. ఊహుఁ.

మాధురి ప్రైజు తీసుకుంటూన్నప్పుడు చూడద్దూ!" ఆఫీసు దగ్గరే ఆలోచనలకి బ్రేక్ వేశాడు అశ్వని.

వార్షికోత్సవ సభ ప్రారంభమైంది.

వేదికమీద ప్రిన్సిపాల్ ముఖ్య అతిథిగా వచ్చిన హేమరాణీ, మరో ఇద్దరు లెక్చరర్లూ కూర్చునివున్నారు. అమ్మాయిలు సీతాకోక చిలుకల్లా అలంకరించుకుని ఇటూ అటూ తిరుగుతున్నారు. ప్రోగ్రాంకి చాలా మందే వచ్చారు. వచ్చిన అందరికీ కుర్చీలు చూపి కూర్చోపెడుతూన్నారు అమ్మాయిలు. అంతా సందడిగా వుంది. ప్రోగ్రాం మొదలైంది. మైక్‌లో ప్రార్థన వినిపిస్తోంది. మెల్లమెల్లగా నిశ్శబ్దం ఆవరించింది. అందరి దృష్టి వేదిక మీదకి మళ్ళింది. ప్రార్థన పాడిన అమ్మాయిలు వేదిక దిగి వచ్చేశారు. ప్రిన్సిపాల్ లేచి ఆ రోజు కార్యక్రమం క్లుప్తంగా వివరించి ముఖ్య అతిథిగా వచ్చిన హేమరాణిని గురించి క్లుప్తంగా చెప్పింది

"హేమరాణిని గురించి ఈ ఊళ్ళో ఎరుగని వారు వుండరు అనుకుంటాను. ఎందుకంటే ఈమె విద్యాధికురాలు. సాంఘిక కార్యక్రమాల్లో తరచు పాల్గొంటూ పేదలకి సేవచేస్తూవుంటారు. ఎందరో విద్యార్థులకి చదువుకి సాయపడ్డారు." ప్రిన్సిపాల్ గారు హేమరాణిని గురించి ఇలాఇంకా ఇంకా చెప్తూనే వున్నారు. ప్రేక్షకులు ఈ మాటలు వింటూ హేమరాణిని చూస్తూన్నారు. హేమరాణి తెల్లని బెనారస్ పట్టు చీర కట్టుకుంది. తెల్లని పట్టు జాకెట్ వేసుకుంది. మెడలో మంచి ముత్యాల హారం వుంది. చేతులకి ముత్యాల గాజులున్నాయి. వేలికి ముత్యం వుంగరం కూడా వుంది. ఆమె ఎంతో మర్యాద వుట్టిపడుతూ పైట భుజం చుట్టూ కప్పుకుని కూర్చుని ప్రిన్సిపాల్ చెప్పే మాటలు వింటూ వుంది. ప్రేక్షకులకి హేమరాణి అందమైన ముఖమే కనిపిస్తోంది కానీ, ప్రిన్సిపాల్ చెప్పే మాటలు వినిపించటం లేదు.

ఈ వార్షికోత్సవ సందర్భంగా జరిగిన పోటీల్లో గెల్చిన విజేతలకి హేమరాణి గారు బహుమతులు ఇస్తారు అంటూ ఆవిడ కూర్చుంది. హేమరాణి లేచి నిల్చుంది. లెక్చరర్ సావిత్రి విజేతల పేర్లు చదువుతూ ఒక్కొకరినీ పిలుస్తోంది. మరో లెక్చరర్ కప్పులు హేమరాణికి అందిస్తోంది. ఒక్కో అమ్మాయి వేదిక మీదకి వచ్చి హేమరాణికి నమస్కారం చేసి ఆమె అందించిన కప్పు అందుకుని వెళ్ళిపోతున్నారు. ఫొటోగ్రాఫర్ కెమేరా క్లిక్‌మనిపిస్తున్నాడు.

'భారత స్త్రీ నాడూ నేడూ' అనే విషయం గురించి జరిగిన డిబేట్‌లో ప్రథమ బహుమతి కుమారి మాధురి బి. ఏ. ఫైనల్ ఇయర్, పిలిచింది సావిత్రి.

మాధురి వేదికకి దూరంగా వుండటం వల్ల అందరినీ తప్పించుకురావటానికి కాస్త ఆలశ్యం అయింది. అందరూ మాధురి కోసం చూస్తున్నారు. మాధురి వేదిక మీదకి వచ్చింది. సన్నగా పొడుగ్గా తెల్లగా అందంగా వుండి గుండ్రటి ముఖం

పెద్ద కళ్ళూ నొక్కుల జుత్తూ వత్తుగా పొట్టిగా వున్న జడతో నల్లంచున్న గులాబి రంగు వాయిల్ చీర కట్టుకుని గులాబి రంగు జాకెట్ వేసుకున్న మాధురి ముఖంలోకి తదేకంగా చూస్తూ తన చేతిలోని కప్పు ఇవ్వటం మర్చిపోయి అలాగే నిలబడిపోయింది హేమరాణి. మాధురి అందరమ్మాయిల్లా హేమరాణికి నమస్కారం చెయ్యలేదు. ఇది గ్రహించిన ప్రిన్సిపాల్ విసుగ్గా ముఖం పెట్టిన హేమరాణితో 'ఈ అమ్మాయే మాధురి' అంది. హేమరాణి పరీక్షగా చూస్తూ కప్పు అందివ్వబోయింది. మాధురి కళ్ళు ఎర్రబడ్డాయి. ఆవేశంతో సన్నగా వణుకుతూ వుంది. ముఖం కందగడ్డలా వుంది. తీక్షణంగా చూస్తూ వుంది.

సరీగ్గా ఈ సమయంలోనే అశ్విని సైకిల్ లాక్‌చేసి కాలేజీ గేటు లోపలికి వచ్చాడు.

హేమరాణి మాధురి తీక్షణమైన దృష్టికి విస్తూ పోతూ అలాగే నిల్చి పోయింది. ప్రిన్సిపాలూ మిగతా లెక్చరర్లూ ఆ యిద్దరినీ క్షణం తెల్లబోయి చూశారు. ప్రేక్షకులూ చూస్తూన్నారు చిత్రంగా. ప్రిన్సిపాల్ తెప్పరిల్లింది.

"మాధురీ నీ ప్రైజు తీసుకెళ్ళు" ఆజ్ఞాపిస్తున్నట్లుగా అంది. మాధురి చప్పున కప్పు అందుకుని హేమరాణికి నమస్కారం చెయ్యకుండానే వేదిక దిగేసింది.

"సెకండ్ ప్రైజు కుమారి కస్తూరి బీకాం సెకండియర్" సావిత్రి గొంతు విన్పిస్తోంది మైక్‌లో. కస్తూరి వేదిక మీదికి వెడుతోంది. ప్రేక్షకులు యిదేం పట్టించుకోవటం లేదు.

మాధురి అలా యెందుకు చేసింది అని గుసగుసలు పోతూన్నారు. అశ్విని కూర్చునేందుకు ఖాళీ కుర్చీలు లేక యిదంతా నిల్చునే చూస్తూన్నాడు.

'చీఫ్‌గెస్ట్ హేమరాణి గారా! చచ్చాం ఆవిడని చూస్తేనే ఈ మాధురి మండిపడి పోతుందే' అనుకున్నాడు. హేమరాణి గారుంటే విమానం కారు వుండి తీరాలే అనుకుంటూ చూశాడు. కారు ఓపక్కగా వుంది చూశాడు. మళ్ళీ వేదిక వైపు దృష్టి సారించాడు. హేమరాణి మరి కొందరికి బహుమతులు యిచ్చిన తరువాత మాట్లాడింది. తరువాత తనని ఇక్కడికి పిల్చినందుకు కృతజ్ఞతలు చెప్పి కూర్చుంది. మీటింగ్ పూర్తి అయింది. వేదిక దిగి వచ్చి ముందు వరసల్లో వున్న కుర్చీల్లో కూర్చున్నారు. నాటికలూ డాన్సులూ వున్నాయనీ యెవరినీ వెళ్ళద్దు అనీ సావిత్రి మైక్‌లో చెప్తోంది. అశ్విని వాచ్ చూసుకున్నాడు. చాలా టైము అయింది. మాధురి కన్పిస్తే వస్తుందేమో అడగాలని చూస్తూన్నాడు. యెక్కడా కన్పించలేదు.

హేమరాణి అందరి దగ్గరా శలవు తీసుకుని వచ్చేస్తోంది. డ్రైవర్ కారు డోర్ తీసి పట్టుకున్నాడు. హేమరాణి వెంట ఓ లెక్చరర్ కారు వరకూ వచ్చింది. అశ్విని నిల్చున్న చోటున చీకటిగా వుంది. తనవెనక చీకటిగా వుంది. ఆ చీకటిలో యేదో కదిలిన

శబ్దం అయినట్లుంది. అశ్విని పరీక్షగా చూశాడు. మాధురి అపర కాళికాదేవిలా నిప్పులు కక్కుతూన్నట్లు నిల్చుంది. చేతిలో కత్తి తళ తళా మెరుస్తోంది. అశ్విని క్షణం నిర్ఘాంత పోయాడు.

హేమరాణి కారు దగ్గరగా వచ్చేసి లోపల కూర్చో బోతూండగా మాధురి మెరుపులా ముందుకి రాబోయింది. మాధురి యేం చేయబోతోందో యిప్పటికి అర్థమైంది అశ్వినికి. అంతే వెనగ్గా వచ్చి అమాంతం రెండు చేతూలలోనూ బిగించి పట్టేసుకున్నాడు మాధురి వున్మాదనిలా పెనుగులాడుతోంది. అశ్విని వదల్లేదు. కారు వెళ్ళిపోయింది. మాధురి ఆవేశంగా పెనుగులాడటంలో కత్తి అశ్విని చేతిలో దిగేసుకు పోయింది. రక్తం బుస్సున పైకి వచ్చింది. "అబ్బా" బాధగా అరవ బోయి మింగేశాడు. హేమరాణిని పంపటానికి వచ్చిన లెక్చరర్ తిరిగి పోబోతూ క్షణం ఆగి "ఎవరు" అంది. అశ్విని గాభరా పడ్డాడు.

మాధురిని మరీ చీకట్లోకి లాక్కు పోయాడు. వేదిక మీద డాన్సు ప్రారంభం కావటం వల్ల అందరి దృష్టి అటే ఉంది. అశ్విని చేతినించి యెర్రటి రక్తం ధారగా కారుతూంటే చూసి యిప్పటికి అతన్ని గుర్తించింది. "మీరా!" వెర్రిదానిలా కేక పెడుతూంటే "హుష్ పదండి" అంటూ మాధురిని లాక్కుని వచ్చాడు. కుడిచేతిని యెడంచేత్తో బిగించి పట్టుకుని కర్చీఫ్‌తో రక్తం స్రవించకుండా నొక్కి పట్టాలని ప్రయత్నిస్తూన్నాడు.

మాధురి నిద్రలేచినదానిలా "మీరు... వచ్చారా... నేను... ఏం చేశాను... ఏం జరిగింది" అంటూ నోరుకొట్టుకుంది. అశ్విని బాధగా కళ్ళు మూసుకున్నాడు.

"మాధురి ఆటో చూడు త్వరగా నర్సింగ్ హోమ్‌కి వెళ్ళాలి"

మాధురి అశ్విని చేతి నించి కారే రక్తాన్ని చూస్తూ వణికి పోయింది.

"మాధురీ... ఆటో..."

మాధురి కాస్త దూరంలో వున్న ఆటోని పిల్చింది. అశ్విని యెక్కి కూర్చుని నర్సింగ్ హోమ్ పేరు చెప్పాడు. బయలుదేరుతూండగా ఆటో యెక్కేసింది మాధురి.

అశ్విని నిట్టూరుస్తూ కళ్ళు మూసుకుని ఆటోలో వెనక్కి వాలాడు. వళ్ళంతా చెమటలు పడుతూన్నాయి. నిస్సత్తువగా వుంది. స్పృహ తప్పేలా వుంది. అశ్వినిని చూస్తూంటే మాధురి కళ్ళలో నీళ్ళు వుబికి వస్తూన్నాయి.

"మీరు...ఎందుకొచ్చారు. రాకుంటే... బాగుండేది" వెక్కుతూ అంది. అశ్వినికి మండిపోయింది.

"మీరు చేయాలనుకున్న పని యెంత హేయమైందో యిప్పటికైనా అర్థమైందా! హేమరాణిని చంపేస్తే సమస్య పరిష్కారం అవుతుందా! హేమరాణి ఒక్కర్తే దోషి అని అనుకోవటం ఏమిటి! తప్పుకి యిద్దరూ బాధ్యులైనప్పుడు ఒక్కరిని శిక్షించాలని కత్తి దూయటం అవివేకం. ఈ రోజు నేను రాకుంటే ఏం జరిగి వుండేది! మీరు పోలీసుల మధ్య కటకటాల వెనక వుండాల్సి వచ్చేది" పళ్ళు కొరికాడు అశ్విని. మాధురి భయంతో




బిగుసుకు పోయినట్లు కూర్చుంది. కత్తి దిగబడిన అశ్విని చేతిని చూస్తూ వుండి పోయింది. అతను పెదవులు బిగించి బాధని భరించటం చూసి విలవిల్లాడి పోయింది.

"ఆ॑..." అశ్విని గిలగిల్లాడి పోతూ న్నాడు.

మాధురి అతనికి దగ్గరగా ఇంకా దగ్గరగా జరిగి కూర్చుంది.

"నేనెంత దుర్మార్గురాలిని. మీకెంత బాధ కల్గించాను"

"మాధురీ' నా కిప్పుడెంత బాధగా వున్నా నువ్వు ఆవేశంతో చేయబోయే హత్యని ఆపగలిగానని తృప్తిగా వుంది.

యిది నిజం"

"భగవాన్ ! నేనేం చేయాలను కున్నాను. జరిగింది యేమిటి!"

పొంగి పొరలి వచ్చే దుఃఖాన్ని మింగుతూ సొమ్మసిల్లినట్లు పడుకున్న అశ్వనికి దగ్గరగా జరిగి అతనికి ఆసరా యిస్తూన్నట్లు కూర్చుంది.

"బాబూ ఆటోని త్వరగా తీసుకు వెళ్లు" అంది. ఆటో వేగంగా పోతూ వుంది. ఇప్పటికి గుర్తుకి వచ్చింది. తమ యిద్దరి సైకిళ్ళూ కాలేజీలోనే వది లేసినట్లు. వుండే వుండనీయి పోతే పోనివ్వు. అనుకుంది.



# 29

తెల తెల వారు తూండగా అశ్వని కళ్లు తెరిచాడు. ఒక్క క్షణం తను యెక్కడ వున్నాడో అర్థం కాలేదు. పక్కకి తిరగబోయి చెయ్యి బాండేజీతో బరువుగా బాధగా అన్పించేసరికి రాత్రి జరిగిన విషయం గుర్తుకి వచ్చింది. తెల్లటి గోడలూ, పైన ఫానూ అద్దాల కిటికీలూ కొత్తగా అన్పిస్తూంటే చుట్టూ చూశాడు. తన మంచం దగ్గరే కుర్చీలో కూర్చుని నిద్రలో జోగుతూన్న మాధురినిచూశాడు ముఖం వాడిపోయివుంది. కన్నీళ్ల చారికలు మాధురి బుగ్గలమీద స్పష్టంగా కన్పిస్తు న్నాయి. రాత్రి జరిగినదంతా ఓసారి కళ్లముందు గిర్రున తిరిగింది. ఎక్కడ నించో గడియారం ఆరు గంటలు కొట్టిన శబ్దం అయింది. అశ్వని వులిక్కి పడి నట్లు చూశాడు.

"అరె ... ఈ అమ్మాయి రాత్రి అంతా నా దగ్గరే వున్నదా ' వాళ్ల వాళ్లు ఏమనుకుంటారు ! ఎంత ఖంగారు పడ్డారో మాధురిని యింటికి పంపేయాలి"

"మాధురీ... మాధురీ"

"ఆఁ" వులిక్కిపడి కళ్లు తెరిచింది. హాస్పిటల్ గదినీ మంచంమీద పరిచిన తెల్లని దుప్పటినీ, దిండుమీద తల పెట్టుకుని నీరసం నిండిన ముఖంతో పడుకుని వున్న అశ్వనినీ, అతని చేతికివున్న కట్టునీ మార్చి మార్చి చూసింది. నిన్న నవ్వుతూ తుళ్లుతూ కబుర్లు చెప్పిన అశ్వని ఇవాళ యెంత నీరసపడి పోయాడో ! దీనికంతకీ కారణం తను. అన్న ఆలోచన రాగానే తప్పు చేసినట్లు తలవంచుకుంది.

"మాధురీ" ఏక వచన ప్రయోగం యిప్పుడే మొదటిసారి విన్నట్లుగా విస్తు పోయి చూసింది. 'మాధురీ' అన్న పిలుపు మధురంగా విన్పిస్తోంది. తన మనస్సులో అట్టడుగున దాగివున్న యేదో అస్పష్ట భావాన్ని పట్టి పైకి లాగినట్లు అన్పిస్తోంది.

"మాధురీ"మళ్ళీ అదే తీయటి పిలుపు.

"ఆఁ"తెలియకుండానే జవాబిచ్చింది.

"ఇంటికి వెళ్ళిపో మాధురీ"

"అపును వెళ్ళిపోవాలి. అమ్మ ఎదురు

చూస్తూ వుంటుంది." ఈ విషయం ఇప్పుడే గుర్తుకి వచ్చినట్లుగా చటుక్కున లేచింది,

"వెళ్ళొస్తాను" అని రెండడుగులు వేసి వెనక్కి వచ్చింది.

"మరి మీకు కాఫీ..."

"అదంతా నేను చూసుకుంటాను గానీ మీరు త్వరగా వెళ్ళండి"

ఇంటికి వెళ్ళు అంటూన్న అశ్వని ముఖంలోకి క్షణం చూసింది. నవ్వొచ్చింది అతని కంగారుకు. ఆడపిల్ల రాత్రి అంతా బైటవుండి, తెల్లవారి ఇంటికి వస్తే అక్కడ వాతావరణం యెలా వుంటుందో అతనికి తెల్సు. అందుకే వెళ్ళిపొమ్మని తొందర చేస్తూన్నాడు.

"నేచేసిన తప్పు ఆ క్షణంలో వున్న ఆవేశంలో తెలియలేదు. కానీ తర్వాత తెల్సుకున్నాను. తెల్సుకున్నా యిప్పుడు ప్రయోజనం లేదనుకోండి. అశ్వనిగారూ ఘోరమైన తప్పు చేయకుండా నన్ను రక్షించారు కానీ...మీరు గాయపడ్డారు. మీ యిప్పటి బాధకి కారణం నేనే ... నన్ను శిక్షించండి."

"శిక్షా! మిమ్మల్నా"

"ఔను. తప్పుకి శిక్ష వెయ్యక తప్పదు"

"అయితే యీ అవకాశం వుంచండి. అవకాశం వచ్చినప్పుడు ఉపయోగించుకుంటాను"

"వెళ్ళివస్తాను" మాధురి అశ్వని చేతికున్న కట్టువైపు ఓసారిచూసి తలవంచుకుని బైటికి వెళ్ళిపోతూ వుంది.

"మాధురీ", మళ్ళీ అదే తియ్యటి పిలుపు. మంత్ర ముగ్ధలా అయి అడుగు ముందుకు పడలేదు.

"ఇలారా! నా దగ్గరగా ఒక్కసారి రా"

మాధురి వచ్చింది.

"కూర్చో"

కూర్చుంది.

"చూడు. ఈ వేలికి వున్న ఉంగరం తియ్యి" తన వేలితో తనే ఉంగరాన్ని తీయాలని ప్రయత్నించి సాధ్యంకాక మాధురిని తీయమని అడిగాడు. ఉంగరం తీసి యిస్తూ అంది "ఇది యిప్పుడు తీయటం యెందుకు?"

"దీని అవసరం మరెప్పుడో వస్తుంది అనుకున్నాను. అయితే ఈ క్షణంలో ఈ నర్సింగ్ హోమ్‌లో బెడ్ మీదఉండగా వస్తుందనుకోలేదు."

"అంటే?" అర్థంకాక తెల్లబోయి చూసింది.

"ఏదీ మీ కుడిచెయ్యి ఇలాఇవ్వండి"

మాధురి చెయ్యి చాచింది. ఆ చేతిని పట్టుకుని అడిగాడు. "మాధురీ అవసరం వస్తే మీ పక్కన నిల్చుని మాట్లాడ గలిగిన అధికారం నాకు కావాలి. అదెలా వస్తుందంటారు"

"అంటే?"

"ఇంకా అర్థంకాలేదూ! ఇవాళ ఓ అరగంట క్రితం మిమ్మల్ని పూర్తిగాఅర్థం చేసుకున్నాను. ఇది సరే ఆ రోజు హోటల్లో మీ నాన్నగార్ని చూసి వణికి మూర్ఛపోయేలా వుంటే మీకు యెలా ఆసరా యివ్వాలో తెలియక కాస్త చనువుగా ప్రవర్తించాను. వెంటనే దానికి శిక్ష అనుభవించాను. ఇక ముందు అలా

కాకుండా వుండాలని మీ మీద అధికారం కావాలని అడుగుతూన్నాను. అదెలా వస్తుందంటారూ!"

"తెలియదు"

"మీ మనస్సే మీకు తెలియదు. కానీ మనిద్దరి మనస్సుల్లో యేముందో నాకు తెల్సు. ఇందుకే మీ మనస్సునీ మిమ్మల్నీ నా స్వంతం చేసుకునేందుకిది నాందిగా వుంగరం మీ చేతికి తొడుగుతున్నాను. అభ్యంతరమా!"

ఎడంచేతి వేళ్ళలో మాధురి వేలికి వుంగరం తొడగటానికి సతమతమయే అశ్వనివైపు వెర్రిదానిలా చూసింది.

"మీరు...మీరు..."

"ఏమిటి మీరు! నేనంటే యిష్టం లేకున్నా నాకు మనస్సు యివ్వకున్నా యీ వుంగరం వద్దు అని చెప్పండి. లేకుంటే నన్నిప్పుడు వారించవద్దు మాధురీ" అశ్వని ఒక్క చేత్తోనే మాధురి వేలికి వుంగరం తొడిగేశాడు ఆ చేతిని దగ్గరగా లాక్కొని పెదవులకి హత్తుకుంటూ వుండిపోయాడు. మాధురి నిశ్చేష్టురాలైనట్లు చూస్తూ వుండిపోయింది ఒక్క క్షణం. అంతలోనె కన్నీళ్ళు జల జలా రాలాయి.

"నేను...చేసిన... తప్పుకి యిదా శిక్ష" అంది వెక్కుతూ.

"మాధురీ!...యిది తీయని శిక్ష" అన్నట్లు నిన్న మీ కాలేజీకి నువ్వొరావద్దన్నా యెందుకు వచ్చానో చెప్పలేదు కదూ! ఈ వుళ్ళోనే కాలేజీలో లెక్చరర్‌గా ఆర్డర్స్ యిచ్చారు. ఈ సంతోష వార్త నీకు త్వరగా చెప్పాలని వచ్చాను. ఈ ఆర్డర్ రాకుంటె నే రాకుంటే అనే విషయం ఆలోచిస్తే గుండె ఆగిపోయేలా వుంది."

"నిజంగా మీకు మంచి వుద్యోగం వచ్చేసిందా!'' కళ్ళు తుడుచుకుని అడిగింది.

"వూఁ...వచ్చింది. ఇప్పుడు నేను భారాన్ని కూడా వహించగలను" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

అశ్వని ముఖంలోకి చూస్తూ వుంది. ఇంత మంచితనం మనషిలో వుంటుందా? రాత్రి డాక్టర్ యిలా కత్తి యెలా దిగబడింది అని అడిగితే అశ్వని యదార్థం చెప్పలేదు. తన అజాగ్రత్తవల్ల జరిగింది అని చెప్పాడు. ఈ మాటకి యెంత సిగ్గు వేసిందో ఎలా చెప్పటం. మొన్న రాత్రినించి నా మనస్సు నా అధీనంలో లేదు. మధు జ్వరం రోజు రాత్రి వర్షంలో తడుస్తూ హేమరాణి యింటికి వెళ్ళటం, తన పిలుపు ఆయన అన్పించుకునే స్థితిలో లేకపోవటం, అందుకు తను ఆవేశపడి యేదోయేదో ఆలోచించి హేమ రాణిని హత్య చేయాలని ప్రయత్నించటం, సరిగ్గా అప్పుడే అక్కడికి వచ్చిన అశ్వని పరిస్థితి అర్థం చేసుకుని వారించటం, ఆ పెనుగులాటలో యితను గాయపడటం ఇదంతా యేమిటి! యిలా జరిగిందేమిటి! నేనేనా యిలా చేసింది. మాధురి తనని తను మర్చి ఆలోచనల్లో మునిగిపోవటం గ్రహించి "మాధురీ వెళ్ళిపో యింటికి." అన్నాడు. మాధురి చప్పున లేచి బైటకి వచ్చేసింది.

మాధురి గదిలోనించి యివతలకి

వస్తూండగా ఓ యువకుడు ఆ గదిలోకి వచ్చాడు.

"అశ్వనీ యీ దెబ్బ నీకెలా తగిలిందిరా! అమ్మ గాభరాపడిపోయిందిరా"

గదిలోనించి యింకా యేవో మాటలు విన్పిస్తూవున్నాయి. మాధురి గదిలోకి వెళ్ళిన యువకుడిని తలెత్తి చూడలేదు. మనస్సంతా యింటి దగ్గరుంది. అమ్మా తమ్ముడూ అందరూ రాత్రంతా నిద్రపోయి వుండరు. ఎక్కడెక్కడ వెతికారో! ఎందర్ని అడిగారో!

మాధురి ఓ రిక్షా పిల్చి అడ్రెస్ చెప్పి అందులో కూలబడింది. కుడిచేతికి అశ్వని తొడిగిన నీలంరాయి వుంగరాన్ని చూసుకుంటూ పరిసరాలని మర్చిపోయింది. రిక్షా వెడుతూనే వుంది.



# 30

రాత్రి భోజనానికి వచ్చిన జనార్దన్‌తో అహల్య చెప్పింది.

"అక్కకి కాలేజీలో ప్రోగ్రాం వుంది. రావటం ఆలశ్యం కావచ్చు. నువు వెళ్ళి వెంట వుండి తీసుకురా అని" జనార్దన్ తొమ్మిది దాటుతూండగా కాలేజీకి వెళ్ళాడు. ప్రోగ్రాం అయేవరకూ వుండి అక్కకోసం వెతికాడు ఎక్కడా కన్పించక "ఏవరన్నా ఫ్రెండ్ ఇంటికి వెళ్ళి వుంటుంది" అనుకున్నాడు. అయినా సైకిల్ స్టాండ్‌లో చూశాడు అక్క సైకిల్ వుంది. 'అరె' ఏమైనట్లు అనుకున్నా అక్కడవుండి చేసేది యేమీ లేక యింటికి వచ్చేశాడు. మాధురి యింటికి రాలేదు. అక్కడా లేదు. ఏమైనట్లు! అహల్య గాభరాపడిపోయింది.

"అక్కడంతా సరిగ్గా చూశావా! దాని స్నేహితులని అడిగావా" అంది.

"చూశానమ్మా. అక్క యే ఫ్రెండ్ యింటికో వెళ్ళి వుంటుంది. తెల్లవారేసరికి వస్తుంది. దిగులు పడకు" అని నిశ్చింతగా నిద్రపోయాడు జనార్దన్. అహల్యకి నిద్రరాలేదు. ఏవేవో పిచ్చి ఆలోచనలు గాభరా పెట్టేస్తూన్నాయి. యిలాంటప్పుడు చప్పున భర్త గుర్తుకి వస్తాడు. ఆయన యింట్లో వుంటే యెంత ధైర్యంగా వు డేది! జనార్దన్‌లా కన్పించ లేదు అని తిరిగి వచ్చేవారా! ఊరంతా గాలించి అయినా యింటికి తీసుకుని వచ్చేవారు. ఆడపిల్ల వంటరిగా వెళ్ళి రాత్రికి యిల్లు చేరకుంటే యే తల్లి దండ్రులకి మాత్రం నిద్రపడుతుంది. తెల్లవారింది. అహల్య లోపల పని చేసుకుంటూవుంది. మాధురి రిక్షా దిగి డబ్బిచ్చి పంపి లోపలికి వచ్చింది. జనార్దన్ చూసి కేకపెట్టాడు.

"అమ్మా అక్క వచ్చింది. క్షేమంగా వుంది. రాత్రి అంతా నన్ను చంపావు" అనేసి మళ్ళీ దుప్పటి ముసుగు పెట్టేసుకున్నాడు. అహల్య పరుగున వచ్చి కూతురి ముఖంలోకి చూస్తూ "రాత్రి రాలేదేం అమ్మా! ఎక్కడున్నావ్!" అంది

మాధురి జవాబు చెప్పలేక పోయింది.

"మాట్లాడవేమే"

"స్నేహితురాలి దగ్గరున్నానమ్మా"

"ఈ మాట వెంటనే చెప్ప కూడదూ! రా. ముందు కాఫీ తాగూ"

కాఫీ తాగుతూన్న కూతురి ముఖం అదోలా వుండటం పసికట్టేసింది అహల్య. ఏమైంది దీనికి. ముఖం అలా ఉందేం! ఆలోచిస్తోనే పని చేసుకుంటూ వుంది అహల్య.

మాధురిస్నానంచేసి జడ వేసుకుని అద్దంముందు నిల్చుని బొట్టుపెట్టుకుంటూ వుంది. వెనకనించి చూస్తున్న అహల్యకి కూతూరివేసుకున్న నీలంరాయి వుంగరం కన్పించింది. యీ వుంగరం యెక్కడిది కళ్ళు నులుముకుని చూసింది అహల్య. యే స్నేహితురాలిదన్నా నా! అలాయెరువు నగలు పెట్టుకోవటం మాధురికిఅలవాటు లేదే! మరి యిదెలా వచ్చింది.!

అహల్యమనస్సులో అన్నీ ప్రశ్నలే. జనార్దన్ భోజనం చేస్తున్నాడు. "అక్కా అన్నానికి రారాదూ!'

"ఆకలి లేదురా. తర్వాత తింటాను" అంటూ వెనక్కితిరిగిన కూతురు ముఖం లోకి చూస్తూ "ఆ వుంగరం యెక్కడి దమ్మా" అడిగింది అహల్య. మాధురి క్షణం తొట్రుపడింది. వెంటనే జవాబు చెప్పలేకపోయింది.

"ఆ వుంగరం యెక్కడిది అని అడుగుతున్నాను" అహల్య గర్జించింది.

మాధురి తలవంచుకుని ఆలోచిస్తోంది. జరిగినదంతా తల్లికి చెప్పేయాలి. తల్లిమూడ్ చూసి చెప్పాలనుకుంది. కానీ అహల్య వుంగరం చూసింది. యింక చెప్పితీరాలి. అశ్వినిని గురించి అమ్మకి చెప్పాలి. కానీ యెలా మొదలు పెట్టి చెప్పాలి!

కూతురు తన ప్రశ్నకి నిర్లక్ష్యంగా జవాబు చెప్పలేదనుకుంది అహల్య. "నీకెంతపొగరే! నాకే జవాబుచెప్పవూ" చాచి చెంప పగిలిపోయేలా కొట్టింది.

"అయ్యో. మాధురి చెంప పట్టుకునినిల్చి పోయింది. కన్నీళ్ళు గిర్రున తిరిగాయి.

జనార్దన్ అన్నంవదిలి గభాలున లేచి వచ్చి తల్లిని యివతలికి లాగాడు.

"ఆవేశపడకమ్మా అసలేం జరిగిందో అక్క చెప్తుందిలే" అంటూ సర్దేశాడు. నేనడిగి తెల్సుకుంటానమ్మా" అనిభరోసా యిచ్చాడు. మాధురి తను చెప్పాలనుకున్న విషయం మింగేసి చెంప పట్టుకుని తనగదిలోకి వెళ్ళిపోయింది.

"అమ్మా నేను అక్క కాలేజీకి వెళ్ళి సైకిల్ తీసుకుని అలాగే నా షాపుకి పోతానమ్మా"

"అలావద్దు. నువ్వు సైకిల్ తీసుకుని షాపులో శలవు కావాలనిచెప్పిరా. యివాళ పెళ్ళికొడుకు అక్కనిచూడటానికిసాయంకాలం వస్తాడని నాంచారమ్మ అత్తయ్య కబురుపంపింది. అప్పుడు నువ్వుకూడా వుండాలిబాబూ"

"ఆ వరుడేమిటో అతని వివరాలు యేమిటో అక్కకి చెప్పారామ్మా"

"చెప్పాలనే అనుకున్నాను. యిప్పుడింక చెప్పే అవుసరంలేదు"

"అమ్మా"

"జనార్దన్ నీకేంతెలియదురా వూరుకో

బాబూ! దీని చ దు వు తగలబడనీయి ఫర్లేదు. యివాళనించీ యిల్లు కదలటానికి వీల్లేదు. యీ సంబంధం మంచిది. యిది ఖాయంఅయి పెళ్ళిఅయిపోతే ఆ దేవుడికి శతకోటి నమస్కారాలు చేస్తాను. యిదే నా నిర్ణయం. నువ్వు మ రో ప్ర శ్న వెయ్యక, దీని ఆటలు కట్టిం చేస్తాను యీ రోజునించీ. ''కోపంగా అని విస్సురుగా వెళ్ళిపోయింది అక్కడనించి. మధుకి జ్వరం కాస్త తగ్గింది.

మాధురి ఈ మాటలన్నీ వింటూనే వుంది. తల్లి వెళ్ళగానే తమ్ముడిని పిలి చింది

"జనార్దన్ నాకిప్పుడు మనస్సేమీ బాగాలేదు. ఈ పెళ్ళిచూపులు వద్దురా. ఏదోచెప్పి తప్పిపోయేలా చేయరా" ప్రబతిమలాడింది.

"అబ్బ. పెళ్ళికొడుకు వచ్చి చూడ గానే పెళ్ళి ఖాయం అయిపోతుందేమో నని గాభరా పడిపోత్తున్నావేమిటే! ఆ వచ్చే వరుడికి నువ్వు నచ్చాలి, నీకు ఆయన నచ్చాలి! ఆ తర్వాత చూసు కుందాం అప్పటివరకూ అమ్మ మాటకి ఎదురు చెప్పకు. నీకు దణ్ణం పెడతా నక్కా"

మా ధు రి ఏదో చెప్పబోయింది. జనార్దన్ ఇంకేమి వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు.

మాధురి మనస్సులో తుఫాను వీచటం ప్రారంభమైంది.

ఇప్పుడేంచెయ్యాలి! ఏం చెప్పినా తల్లి వినేలా లేదు. ఏంచెప్పి తప్పించు కోవాలీ పెళ్ళిచూపులు. తల దిమ్మెక్కి పోతూ వుంది. వేలి ఉంగరాన్ని చూసు కుంటూ అలాగే కూర్చుండిపోయింది మాధురి.



## 31

హాస్పిటల్‌లో వున్న తమ్ముడి దగ్గర కూర్చుని అన్నం వడ్డిస్తున్నాడు రాజారావు. అన్నగారు చెప్పే కబుర్లు వింటూ భోజనం చేస్తూ మధ్యమధ్య పెద్దగా నవ్వుతున్నాడు అశ్వని.

"ఒరేయ్! నీ చేతిలోకి ఆ కత్తి ఎలా దిగిందరా!"

ఈ ప్రశ్న ఇప్పటికి చాలాసార్లువేసి జవాబు చెప్పించలేకపోయినా మళ్ళీ అడిగాడు. అశ్వని ఈ మాటని తప్పించా లని ప్రయత్నించాడు. రా జా రా వు వదల్లేదు.

"చెప్తే ఏం చేస్తావన్నయ్యా?" నవ్వేస్తూ అన్నాడు.

"పోలీస్ రిపోర్టు యిచ్చి పట్టించి శిక్ష పడేలా చేస్తాను"

"శిక్ష నేనే వెయ్యగలను. ఆ అవ కాశం పోలీసులకి ఇవ్వను"

"నాన్సెన్స్. నువ్వు పరిహాసంగా తేల్చేస్తున్నావు. నేనిది సహించలేను"

అ న్న గా రి ముఖంలోకి చూస్తూ

నవ్వబోయి ఆగి, నేలచూపులు చూస్తూ వుండిపోయాడు.

చెప్పవా !"

చెప్తాను కానీ, ఇప్పుడు కాదు. అన్నట్లు నువ్వు పెళ్ళికూతుర్ని చూసేది యివాళేకగా"

"ఔను. కానీ యివాళ చూడటం వాయిదా వేస్తాను. నువ్వు హాస్పిటల్ నించి యింటికి వచ్చేసిన తర్వాత ఇద్దరం కల్సి చూద్దాం"

"వద్దువద్దు. ఆ అమ్మాయి నేనే పెళ్ళి కొడుకునని అనుకుంటే డేంజర్! కనుక ఇవాళేవెళ్ళి చూసి సరాసరి యిక్కడికి వచ్చి ఎలా వుందో చెప్పు ! చూడూ ఫొటో ఏదైనా వుంటే అడిగి పట్టుకురా చూస్తాను"

"అలా అడగటం బాగుండదురా ! అయినా నచ్చిన తర్వాతకదా విషయం"

"ఏం ఫర్లేదు. ఫొటో నాక్కాదు నా తమ్ముడికి అని చెప్పు"

రాజారావు నవ్వేశాడు.

"ఇంతకీ ఆ అమ్మాయి వివరాలు చెప్పలేదు. ఏం చదువుకుంది. పేరేమిటి ; ఇల్లెక్కడ ?"

"అవేం సరిగా నాకేం తెలియవు. అమ్మని అడిగాలి ! చదువు కున్న అమ్మాయి అనీ, బాగానే వుంటుందనీ చెప్పింది అమ్మ. బస్! యిది చాలు నాకు"

"అయితే ఈ సంబంధం ఖాయం కావచ్చు నన్నమాట"

"అనే అనుకోవచ్చు"

"అనుకోవచ్చు కాదు. అయితీరాలి"

"నీకెందుకంత తొందర! నీ బ్రెయిన్ ప్లాట్ ఫారం మీదకి రావటానికి నేను అడ్డంగా వున్నాననా"

అంటూ చిరు కోపంతో చూసి తమ్ముడి భోజనం పూర్తి అవటంతో చెయ్యి కడిగి భోజనం చేసి ప్లేటు తీసేసి కడిగి పెట్టాడు. ఈ పనులన్నీ చేస్తూన్న అన్నగారిని చూస్తూ అనుకున్నాడు. 'అన్నయ్యకి నేనంటే ప్రాణం' అని

"ఇంటికి వెళ్ళి వస్తాను" లేచాడు రాజారావు. ట్రాన్సిస్టర్ తమ్ముడికి దగ్గరగా పెట్టి ఇంటికి వెళ్ళి పోయాడు రాజారావు. అశ్విని ట్రాన్సిస్టర్ ఆన్ చేశాడు. హిందీ పాటలు వస్తూన్నాయి. అవి వింటూ పడుకున్నాడు. పాట హాయిగా విన్పిస్తోంది. చేతి దెబ్బ బాధగా ఉంది. మనస్సులో మాధురి రూపం కదులుతోంది.

"అశ్వనీ...అశ్వనీ" సైకిల్ తాతగారి పిలుపు విన్పించి ట్రాన్సిస్టర్ సౌండ్ తగ్గించి మెల్లగా లేచి కూర్చున్నాడు. ముసలాయన యెండలో రావటం వల్ల వళ్ళంతా చెమట పట్టేసింది. ముఖంలో ఆందోళన కన్పిస్తోంది. దగ్గరగా వస్తూనే బాధగా చూస్తూ "అశ్వనీ! ఈ ఘోరం యెలా జరిగింది బాబూ ; దేవుడిలాంటి నీకీ కష్టం యేమిటి ! ఎవరు చేశారీ పని" గుక్కతిప్పు కోకుండా మాట్లాడేస్తూన్నాడు తాతగారు.

"అలా కుర్చీలో కూర్చోండి తాతగారూ"

ఆయన కూర్చుని మళ్ళీ మొదలు పెట్టాడు.

"నీ కోసం మాధురి కోసం మన కాలనీ మెయిన్ రోడ్డు మీద యెదురు చూసి చూసి విసుగెత్తి మీ ఇల్లు వెతుక్కుంటూ వెనక్కి వెళ్ళాను. అక్కడ మీ అమ్మగారు దుఃఖపడుతూ ఈ వార్త చెప్పారు. అంతే! నిన్ను చూసి పోదామని ఇలా వచ్చాను" చెప్పటం ఆపి చెమట తుడుచుకుంటూ కూర్చున్నారు.

"మీరింకా భోజనం చేయలేదులా వుంది"

"మరేం ఫర్లేదుగానీ ఈ దెబ్బ నీకెలా తగిలింది."

అశ్విని తాతగారి ప్రశ్నకి జవాబు చెప్పకుండా "మాధురి కూడా కన్పించ లేదా !"

"లేదు"

"అరె... ఏమైందో అన్నట్లు వాళ్ల అడ్రెస్ మీ దగ్గరుందిగా. ఇవాళ వెళ్ళి చూసి వీలుంటే సాయంకాలం లేకుంటే రేపు మాధురి క్షేమం చెప్తారు కదూ !"

"అలాగే" అంటూ ఇంకాస్సేపు కూర్చుని ఇంటికి బయలు దేరారు తాత గారు.

గదివాకిలివరకూ వెళ్ళి తిరిగి వచ్చారు. 'ఏమిటి' అడిగాడు అశ్విని.

"అశ్వినీ! మాధురి అంటే నీకూ, నువ్వంటే మాధురికీ యిష్టం అన్న విషయంలో నాకు సాక్ష్యం అక్కర్లేదు. మరి అలాంటప్పుడు యీ ముసుగులో గుద్దులాట యెందుకూ. నేరుగావెళ్ళి ఆమాధురి తండ్రితో మాట్టాడేస్తే సరిపోలా!" ఎన్నన్నా చెప్పు. ప్రేమించేసుకున్నాం అనుకుని కూర్చోకూడదు. పెళ్ళి ఖాయం చేసేసుకోవాలి"

"ఈ హాస్పిటల్ నించి యింటికి రాగానే..."

"అలాఅన్నావ్ బాగుంది. అయితే వెళ్ళి మాధురిని చూసి వచ్చిచెప్తా!" అన్నట్లు నీ వుద్యోగం ఆర్డరువచ్చిందా!"

"అరె...చెప్పటంమరిచాను. నిన్ననే ఆర్డర్స్ వచ్చాయి. ఈ వూళ్ళో నే లెక్చరర్‌గా"

"శుభం. అయితేయింకేం అడ్డులేదు. సరే నీకు వుద్యోగం వచ్చింది కనుక నన్ను వుద్యోగం కోసం ప్రయత్నించమంటావా! నీకు పోటీకానుగా"

అశ్విని నవ్వేశాడు.



# 32

మాధురిని పెళ్ళికొడుకు వచ్చి చూసి వెళ్ళాడు. నాంచారమ్మా ఆమె మొగుడూ నిలబడి అంతా పూర్తిచేశారు. వాళ్ళు అటువెళ్ళగానే అహల్యా అడిగింది.

"అన్నగారూ ఏమని చెప్పారు"

"వారంరోజుల్లో వాళ్ళ అభిప్రాయం చెప్తానన్నారమ్మా" నాంచారయ్యా చెప్పాడు.

"ఆ అబ్బాయి వరసచూస్తే మన మాధురి నచ్చినట్లేవుంది" నాంచారమ్మ సంతోషంగా అంది.

"అప్పుడే పేకమేడలు కట్టకూడదు" జనార్ధన్ పెద్దవాడిలా అన్నాడు.

"ఆ విషయం నాకు తెల్సుగానీ అబ్బాయిది మంచి పర్సనాలిటీ కదూ! మన మాధురికి సరిగ్గా సరిపోతాడు. ఈ సంబంధం అయితే యిద్దరూ చిలుకా గోరువంకల్లా వుంటారు! పిల్ల నచ్చితే కానీ కట్నం వద్దు అన్నారు. ఇంతకు మించి ఏంకావాలి"

నాంచారమ్మ పెళ్ళివారిని పొగిడేస్తోంది. అహల్య అంతా వింటోందిగానీ ఏం మాట్లాడటం లేదు.

"చెల్లెమ్మా.... ఇలారా!" నాంచారయ్య అహల్యతో గొంతు తగ్గించి అడిగాడు.

"ఆ అబ్బాయి మొదట మాధురిని చూడగానే హుషారుగా కన్పించాడు. ఆ తర్వాత కూడా నవ్వుతూ ఎన్నో ప్రశ్నలు వేశాడు. మాధురి చాలా క్లుప్తంగా జవాబిచ్చిందనుకో... కాఫీలు అయిన తర్వాత...అతని ముఖంలో ఏదో మార్పు కన్పించింది. కారణం ఏమై వుంటుందబ్బా అని ఆలోచిస్తూన్నాను. ఏమైవుంటుంది!"

"నాకేం తెలియదు అన్నగారూ"

"అబ్బ మీద్కంతా అనుమానం. అతను చివరివరకూ నవ్వుతూనే వున్నాడు" నాంచారమ్మ భర్తమాటకి ప్రాధాన్యత యివ్వలేదు.

"నీ ముఖంలే. నీకేం తెలియదు. ఒకవేళ మాధురిగానీ ఇతన్ని ఇదివరకే ఎరుగుందా!"

"అయ్యోరామ. అతను ఈ ఊళ్ళో ఉద్యోగం చేయటంలేదుగా. ఎలా తెలుస్తుంది" నాంచారమ్మ మళ్ళీ సందేహం వెలిబుచ్చింది.

"అక్కకి అతను తెలియదు" జనార్ధన్ కూడా అనటంతో తన ఊహ తప్పు కావచ్చునని అనుకుని నాంచారయ్య ఇంక ఆ విషయం వదిలేసి లేచాడు.

"నేనేవెళ్ళి ఏ కబురూ తెల్సుకుని వస్తాను చెల్లెమ్మా" నాంచారమ్మ కూడా అహల్యకి చెప్పి భర్తతో వెళ్ళిపోయింది. జనార్ధన్ ఆలోచిస్తూన్నాడు.

అక్కలో ఏదో తెలియని మార్పు కన్పిస్తోంది. ఏమిటది! అర్థం కావటం లేదు. అక్క చేతికివున్న ఉంగరం ఎవరిదో తెలియలేదు. ఆ పెళ్ళికొడుకు అక్క వేలి ఉంగరం మొదట చూడలేదు గానీ ఆఖరున చూశాడు. అది చూసిన తర్వాతే అతని ముఖంలో మార్పు కనిపించింది. ఏమిటిదంతా! తన స్నేహితులు ఇద్దరు ముగ్గురు చెప్పారు

జనార్ధన్ మీ అక్క ఓ బాయ్‌ఫ్రెండ్‌తో అక్కడక్కడా కన్పిస్తోందిరా. అతను చాలా అందంగా వున్నాడుస్మీ అని. ఇదివరకీ విషయాన్ని అంతగా పట్టించుకోలేదుగానీ యిప్పుడు అనుకున్నాడు. అతనెవరో ఎక్కడుంటాడో తెల్సుకోవటం అవసరం అని.

మధుబాబు లేచికూర్చుని "అమ్మా... అమ్మా" అని ఏడుస్తూన్నాడు. అహల్య దగ్గరగావచ్చి అడిగింది "ఏంకావాలి బాబూ!"

"జిలేబి తినాలన్పిస్తోందమ్మా"

"అన్నయ్యకిచెప్పి రేపు తెప్పిస్తాను"

"నాకిప్పుడే కావాలి"

అహల్య ఏం చెప్పలేకపోయింది. జనార్దన్ తమ్ముడి దగ్గర కూర్చుని బ్రతిమలాడుతున్నాడు. ఇంతలో సైకిల్ తాతగారు వాకిట్లో నిలబడి అడుగుతున్నారు.

"మాధురి అనే అమ్మాయి యిల్లు యిదేనా?"

జనార్దన్ లేచి వెళ్ళాడు. తాతగార్ని చూస్తూ అడిగాడు.

"ఇదేనండీ. మీరెవరు"

"కాస్త లోపలికి రానీబాబూ! చూడూ కాసిని మంచినీళ్ళు యివ్వు, నేనెవరినో చెప్తాను" జనార్దన్ లోపలికి వెళ్ళి మంచినీళ్ళు తెచ్చాడు. అహల్య కూడా వచ్చింది.

నీళ్ళుతాగి ఖాళీగ్లాసు అందించి అహల్యని చూస్తూ

"మాధురి తల్లిగారేనమ్మా మీరు"

"అవునండీ. మీరు"

"నేను మాధురికి స్నేహితుడిని" అంటూ నవ్వాడు.

జనార్దన్, అహల్య తెల్లబోయారు. తాతగారు తనూ మాధురీ కల్సి సైకిళ్ళ మీద సిటీకి వెళ్ళటం రావటంలో పరిచయం ఏర్పడిందని చెప్తూ,

"మాధురి ఈ కాలంపిల్లకాదు. చాలా మంచి అమ్మాయి. ఇందుకు మీరు గర్వపడాలి సుమా...మాధురి ఏదీ"

జనార్దన్ తనగదిలో నిద్రపోతున్న మాధురిని లేపాడు. నీకోసం ఎవరో తాతగారు వచ్చారు అని చెప్పాడు. మాధురి కళ్ళు నులుపుకుంటూ లేచి వచ్చింది. తాతగార్ని చూస్తూనే ఆశ్చర్యపోయింది,

"మీరా!" అంది.

"ఔనమ్మా నేనే! నువు కన్పించకపోతే తోచలేదు. అదీకాక ఓసారి మీ యిల్లు చూడాలని వస్తానన్నాకదూ" కూర్చోమ్మా.

మాధురి కూర్చుంది. అహల్య కాఫీ కలిపి తేవటానికి వంటగదిలోకి వెళ్ళింది. కాఫీపొడి లేదు. ఇంట్లో అన్నింటికీ యిబ్బందిగానే వుంది. ఎంత పొదుపుగా ఖర్చు చేసుకున్నా అన్నంమానేసి జొన్నరొట్టె తింటున్నా జనార్దన్‌కీ తనకీ వచ్చే డబ్బు చాలటంలేదు. అన్నగారు ఓసారి రెండువందలు పంపాడు. పెళ్ళిచూపుల కంటూ పెళ్ళివారొస్తే అప్పటికి కావల్సినవన్నీ నాంచారమ్మ తెచ్చి సాయపడింది. ఇలా అందరిసాయం తీసుకోవటం బాధగానే వుంది. కానీ ఏంచెయ్యాలి. మరో పదిమంది పిల్లలకి చదువు చెప్పుకోవాలి. పిల్లలు రావద్దూ. ఆర్థిక యిబ్బందులని తట్టుకోలేక సతమతమైపోతోంది అహల్య.

ఇంక తాతగారు మాధురిక్షేమం అడిగి అశ్వనికి తగిలిన గాయం గురించి చెప్పబోతోంటే "నాకు తెల్సు. ఇప్పుడెలా వున్నారు" అడిగింది.

"నీకెలా తెల్సు" తాతగారు తెలివిగా ప్రశ్నించి జరిగిన విషయం మాధురి చెప్పగావిని ఆశ్చర్యపోతూ. "అమ్మా... అశ్వనీ ... నాకే మస్కాయిద్దామా" అనుకుని యింకాస్సేపు కూర్చుని లేచారు. అహల్య యింకా వంట గదిలోనే వుంది.

"అహల్యా. చూడమ్మా నేను నీ

తండ్రిలాంటివాడిని అప్పుడప్పుడూ వచ్చి చూసిపోతూంటాను, నీకేం అభ్యంతరం వుండదుగా. ఈసారి మా ముసలామెని కూడా తీసుకువస్తాను. మరి వెడతాను" అనిలేచి అన్నట్లు "మాధురీ రేపు కాలేజీకి వస్తావుగా" అడిగాడు.

మాధురి జవాబుచెప్పలేదు. "రాదండీ. పెళ్ళి ప్రయత్నంలో వున్నాం."

"ఏమిటీమాధురికి పెళ్ళిప్రయత్నంలో వున్నారా !" మళ్ళీ యిదోవిపత్తు మనస్సులో అనుకున్నాడు.

"ఔను" ఇవ్వాళ ఓఅబ్బాయి చూసి వెళ్ళాడు"

"అలాగా ! ఇవన్నీసరే. ఇన్నాళ్ళూ చదివిన చదువు...చివరిలో..." నసిగారు తాతగారు.

అహల్య జవాబు చెప్పటం యిష్టంలేని దానిలా వుండిపోయింది. తాతగారు వెళ్ళిపోయారు. మాధురి దిగులుగా కూర్చుండిపోయింది.



# 33

"అశ్వనీ కుమార్...యేం చేస్తూన్నావయ్యాబాబూ...అవతలు కొంపలు అంటుకు పోతూన్నాయ్" తాతగారు హడావుడిగా వచ్చి చెప్పారు, మాధురి యింటికి వెళ్ళిన సంగతీ పెళ్ళి చూపుల సంగతీ.

అంతా విన్న అశ్వని ముఖం క్షణం పాలిపోయినట్లు అయింది.

మాధురికి పెళ్ళి ప్రయత్నం చేస్తున్నారా! వాళ్ళు చేస్తూంటే మాత్రం ఈ మొద్దు రాచిప్ప యెలా వూరుకుంది. బుద్ధిలేదు. ధైర్యం అంతకన్నా లేదు. అన్నీ నేనే పరిష్కరించాలి. ఆవేశపడిపోయాడు అశ్వని ఇప్పుడేం చెయ్యాలి' అని ఆలోచిస్తూ వుండిపోయాడు.

"ఇక్కడ వుండి నువ్వు యేం చెయ్యగలవు. ఇంటికి వీలున్నంత త్వరగా వచ్చేయి. ఈ లోపల నేను యెప్పటి విషయం అప్పుడు నీకు చేరవేస్తూంటానుగానీ అశ్వనీ నీకు దెబ్బ యెలా తగిలింది అని అగిడితే నాకే 'థోకా' యిచ్చి మాధురికేం తెలియదు అని చూసి రమ్మన్నావా! ఆఁ"

మందలిస్తూన్నట్లు చూశారు తాతగారు.

'తెలివిలేని పెద్దమ్మ అన్నీ చెప్పేసి వుంటుంది' అనుకుని పైకి మాత్రం నవ్వేశాడు.

"ఇదేమన్నా ఘనకార్యం కనుక యదార్థం మీ కందరికీ చెప్పుకోమంటారా? ఎదురు ప్రశ్న వేశాడు. తాతగారు అశ్వని తెలివికి మురిసిపోతూ.

"ఆఁ...అద్గదీ మగాడంటే యిలా సమర్థించుకో గల్గిన సామర్థ్యం వుండాలి" అంటూ వెన్ను చరిచి పనివుందంటూ వెళ్ళిపోయారు తాతగారు. రాజారావు తల్లిని తీసుకుని హాస్పటల్ కి వచ్చాడు.

తల్లి తడుముకుంటూ కొడుకు దగ్గరకి వచ్చి చెయ్యి పట్టుకుంది.

"నాయనా యీ దెబ్బ నీకెలా తగిలించిరా!" బాధపడిపోతూ అడిగింది.

"కాస్త దెబ్బేనమ్మా. ఇది సరేగానీ నేయింటికి వచ్చేస్తాను. కట్టు కట్టించు కోటానికి యిక్కడికి వస్తూంటాను. అన్నయ్యా డాక్టర్‌తో మాట్లాడి నన్ను యింటికి తీసుకుపో అన్నయ్యా."

"మరో రెండురోజులు యిక్కడే వుండు" అని అన్నగారు అన్నా అశ్విని విన్పించుకోలేదు. రాజారావు డాక్టర్‌తో మాట్లాడటానికి వెళ్ళాడు. తల్లి మళ్ళీ అడిగింది.

"నీకీ దెబ్బ యెలా తగిలిందిరా" అని.

"ఇది సరేగానీ అన్నయ్య పెళ్ళి కూతుర్ని చూశాడా!"

"చూశాడు"

"నచ్చిందా

"అన్నట్లే చెప్పాడు"

"ఓ... అశ్విని సంతోషంతో కేక పెట్టాడు" పెళ్ళి కూతురి ఫొటో తెమ్మన్నాను తెచ్చాడా "

"తర్వాత యిస్తామన్నారుట"

రాజారావు వచ్చేశాడు. "ఏమన్నాడు డాక్టర్" ఆతురతగా అడిగాడు అశ్విని.

"రెండురోజుల వరకైనా నోరు మూసుకుని బెడ్ మీద పడుకోమన్నాడు. చాలునా"

అశ్విని మూతి ముడుచుకున్నాడు. రాజారావు తమ్ముడి దగ్గరగా కూర్చుని కబుర్లు చెప్తూ తమ్ముడి కోపాన్ని పోగొట్టాలని ప్రయత్నిస్తున్నాడు. అశ్విని చేత్తో ముఖం కప్పుకున్నాడు.

"అశ్వనీ...వుంగరం యేదిరా?"

అశ్విని వులిక్కి పడినట్లు అయి చెయ్యి ముఖం మీదనించి తీసేశాడు. రాజారావు మళ్ళీ అడిగాడు.

"వుంగరమా...వుంది అన్నయ్యా... వుంది" తడబడుతూ చెప్పాడు.

"ఎక్కడ వుంది?"

"జాగ్రత్తగానే దాచాను"

"ఎక్కడ దాచావు అని అడుగుతున్నాను" రాజారావు గొంతులో పిసరంత ఆవేశం ధ్వనించింది.

"అబ్బబ్బ...మీరిద్దరూ నన్ను వేపుకు తినేస్తున్నారురా!" తల్లి యీ విషయం వదిలి మరేవో చెప్పటం మొదలు పెట్టే సరికి 'అమ్మయ్య' అనుకున్నాడు అశ్విని.



## 34

అహల్యా వదినగారూ... శుభవార్త మోసుకొచ్చాను" యెండలో ఆయాస పడిపోతూ వచ్చింది నాంచారమ్మ. అహల్యా తన ప్రైవేట్ పిల్లలకి చదువు చెప్పి యింటికి పంపి అలిసిపోయినట్లు పడుకుని వుంది. నాంచారమ్మ పిలుపుకి కళ్ళు తెరిచి లేచి కూర్చుంది. నాంచారమ్మకి కుర్చీ చూపిస్తూ ఏమిటా శుభ

వార్త త్వరగా చెప్పండి" అంది.

"ముందు కాసిని మంచినీళ్ళు"

అహల్య చప్పునలేచి వెళ్ళి తెచ్చి యిచ్చింది. నాంచారమ్మ నీళ్ళు అన్నీ తాగేసింది.

"మన మాధురి ఆ పెళ్ళికొడుక్కి నచ్చిందట"

"నిజంగా'' నమ్మలేనట్లు అడిగింది అహల్య.

''నిజం వదినగారూ ! వెంటనే మీ అన్నగారికి వుత్తరం రాయండి త్వరగా రమ్మని. వెంటనే లగ్నాలు పెట్టేసుకునే యేర్పాటు చేసుకుందాం"

అహల్యకి సంతోషంతో నోటమాట రావటంలేదు. గదిలోకూర్చుని యిదంతా వింటూన్న మాధురినెత్తిన పిడుగు పడి నట్లు అయింది. కళ్ళు గట్టిగా మూసు కుంది.

"ఇప్పుడేం చేయాలి?'' ఇదే ప్రశ్న మాధురితలలో గిరగిరా తిరుగుతోంది. ఆవతలనించి నాంచారమ్మ హుషారుగా చెప్పేకబుర్లు విన్పిస్తూన్నాయి. మాధురి విసుగ్గా చెవులు కప్పేసుకుంది. దీన్నుంచీ తప్పించుకోవడం ఎలా? ఎలా?"

జనార్దన్ యింటికి రాగానే యీ సంతోషవార్త చెప్పేసింది అహల్య. జనార్దన్ ఏదో చెప్పబోతుండగా వాకిట్లో రిక్షాఆగటం కన్పించింది. అందులోనించి మేనమామ దిగటం చూసి "అమ్మా మామయ్య వచ్చాడమ్మా'' అంటూ వీధి లోకి పరుగెత్తాడు. అహల్య చెదరిన మనస్సుని కూడదీస్కుకుంటూ అన్నగారికి యెదురువెళ్ళింది.

"వుత్తరం రాయకుండా వచ్చావేం అన్నయ్యా. నేనివాళేరాద్దాం అనుకుంటు న్నాను"

"అలాగా! నేనేవచ్చాగా మరి వుత్త రం యెందుకుగానీ మాధురికి ఓ సంబం ధం చూశానమ్మా. పిల్లని చూస్తాం అన్నారు. తీసుకెళ్ళి చూపిద్దాం అని వచ్చాను. నేవచ్చినపని చెప్పాను. ఇంక నువ్వుచెప్పు. ఏ విషయమై వుత్తరం రాద్దామనుకున్నావు.''

''మాధురికి ఓ సంబంధం చూశాం. అమ్మాయి నచ్చింది అని చెప్పారు"

"గుడ్... అయితే యిదే ఖాయం చేసుకుందాం"

అన్నగార్ని చూసేసరికి అహల్యకి కొండంత ధైర్యం వచ్చేసింది. ఈ బాధ్యత నెత్తిన వేసుకుంటాడు. ఇంక యీ విషయంలో నిశ్చింతగా వుండచ్చు. అన్నగారికి కాఫీచేసి తెచ్చేందుకు లోప లికి వెళ్ళింది.

ఇంక జనార్దన్ మేనమామ దగ్గర కూర్చుని పెళ్ళికొడుకు వివరాలన్నీ చెప్పేశాడు.

"అబ్బాయికూడా చాలబాగున్నాడు మామయ్యా" అన్నాడు.

"ఇంకేం. అయితే యిదే ఖాయం చేసుకుందాం. అన్నట్లు మాధురి యిష్ట పడిందా"

''దానికేంతెల్సు అన్నయ్యా'' కాఫీ గ్లాసు అందిస్తూ అంది అహల్య.

"అదేం మాటమ్మా. అభిప్రాయం అడిగి తెల్సుకోవటం మంచిది"

"దానిక్షేమం మనం ఆలోచించటం

లేదా!'' అడగక్కరలేదు అన్నట్లు చూసింది అహల్య. రామ్మూర్తిగారు ఒప్పుకోలేదు.

"మాధురీ ఇలారామ్మా" పిలిచాడు. గదిలోనించి మెల్లగావచ్చి నిల్చుంది.

"ఈ పెళ్ళి విషయంలో నీ అభిప్రాయం యేమిటి'' సూటిగా చూస్తూ అడిగాడు.

"నాకీ పెళ్ళివద్దు మామయ్యా"

"ఎందుకనీ"

''చదువు పూర్తిచేసుకుని వుద్యోగం చూసుకుని తమ్ముడికి సాయంగా నిల్చి వాడిని చదివించాలనివుంది."

"అవేంనువ్వు చెయ్యక్కర్లేదు తల్లీ పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళు. చాలు. నాకు శాంతి కల్గుతుంది" అహల్య ఆవేశంగా అంటూంటే రామ్మూర్తి వారిస్తూ

"మాధురీ సరే నీ యిష్టప్రకారమే వుద్యోగం చేస్తావనుకో. ఎన్నాళ్ళనిఅలా వుంటావు చెప్పు ! ఎప్పటికైనా పెళ్ళి చేసుకోవాలిగా ! నీ పెళ్ళి అయితేనే మీ అమ్మకి శాంతికల్గేది. ఈ విషయం నువ్వు ఆలోచించటంలేదు"

మాధురి జవాబు చెప్పలేదు. మేనమామ చెల్లెలివైపూ, జనార్దన్‌వైపూ, మాధురివైపూ చూశాడు. ఏదో వుంది కారణం. ఇప్పుడు తెల్సుకోవటం కష్టం. ఆతర్వాత మెల్లగా కనుక్కోవాలి అనుకున్నాడు.

"మామయ్యా... నాకు పనివుంది. వస్తాను'' బైటకివెళ్ళాడు జనార్దన్. మాధురి గదిలోకివెళ్ళిపోయింది. అహల్య వెక్కివెక్కి యేడుస్తూ కూర్చుండిపోయింది.

"అమ్మా. అహల్యా...! అధైర్యపడకమ్మా...అన్నీ సవ్యంగాజరిగేలా ప్రయత్నిద్దాం" చెల్లెలికిధైర్యం చెప్తున్నాడు. అహల్య కాస్త వూరట చెంది కళ్ళు తుడుచుకుంది.

"మధు కులాసాగా వున్నాడా. ఏడీ! అప్పుడే బైటికి వెళ్ళాడా!"

"పిలుస్తాను. మధూ" అంటూ కేక పెడుతూ పక్క యింట్లోకి వెళ్ళింది అహల్య.

'ఈయిల్లు ఒకప్పుడెంత నిండుగా సంతోషంగా వుండేది ... ఇప్పుడు... ఎలావుంది. ధనంజయరావు బాధ్యతారహితంగా అలాతనసుఖం తనుచూసుకోవటం వల్లకదూ ఈ తిప్పలు ఈ యింటికి.' నిట్టూర్చారాయన.



# 35

జనార్దన్, నాంచారమ్మా, నాంచారయ్యా, అహల్యా, రామ్మూర్తి మాధురి పెళ్ళి యెలాయేర్పాటు చెయ్యాలో ఆలోచిస్తున్నారు.

ధనంజయరావులేకుండా పెళ్ళి చేయటం యెలా! ఇప్పటికే పెళ్ళికొడుకుతల్లి నాలుగుసార్లు అడిగింది: "పిల్లతండ్రి యేడీ రాలేదేం'' అని అందినాంచారమ్మ.

"నేవెళ్ళిఆయన్ని యీడ్చుకువస్తాను. పెళ్ళి అయ్యేవరకూ ఇల్లు క దిలా డా కాళ్ళు విరక్కొడతాను."

అహల్య అన్నగారి కోపం చూసి మాట్లాడలేదు.

"నిజంగా నువ్వే వెళ్ళు మావయ్యా. నాన్నారు తప్పక వస్తారు" జనార్దన్ ఉత్సాహంగా అన్నాడు.

"వద్దు అన్నయ్యా ఆయన్ని పిలవద్దు. మాధురికి కన్యధార నాంచారమ్మ వంపతులు పోస్తారు"

"ఛా...ఇదేంమాట. ఇలా వీల్లేదు" నాంచారమ్మ వారించింది.

"అహల్యా మాధురి పెళ్ళి సవ్యంగా అయేవరకూ కాస్త నామాట వినుతల్లీ. భార్యాభర్తల సంబంధం పొమ్మంటే పోయేది కాదమ్మా. జీవితాంతం కలిసి ప్రయాణంచేసే సహ బాటసారులు. వీళ్ళలో ఒకరు పొరబాటుగా తప్పు చేసినా మరొకరు క్షమించక తప్పదమ్మా"

"ఆయన చేసిన పొరబాటు సామాన్యమైనదా! నా గుండెలో మండే మంట మీకెవరికీ అర్థం కాదన్నయ్యా! కేవలం ఆర్థిక అవసరాలని ఆసరాగా చేసుకుని మగాడు ఆడదాన్ని నిర్లక్ష్యం చేస్తూన్నాడు. ఇది నేసహించలేను. నేను ఆయన అండలేకున్నా బతగ్గలను"

"నే బతగ్గలను అంటూ పిల్లలకి ప్రైవేట్లు చెప్పి ఓ వంద సంపాదించేస్తే జీవితం అయిపోతుందా! జనార్దన్ తెచ్చే వంద చాలా? అదీకాక నా బతుకు నే బతగ్గలను అనటం ఈ సమస్యకి పరిష్కారం కాదమ్మా"

"ఆయన ప్రవర్తనకి నా మనస్సు వ్రక్కలై పోయింది. నేను రాజీపడలేను" ఆవేశంగా అంది అహల్య.

"అహల్యా! ఆవేశపడకు. పిల్లల భవిష్యత్తు కాస్త ఆలోచించు. సరే ముందు మాధురి పెళ్ళి కానివ్వు. ఎప్పుడేంచేయాలో నే చూసుకుంటాను. కాస్త దూరం ఆలోచించు"

అహల్యా జవాబు చెప్పలేకపోయింది. ఇదంతా వింటూ లోపలగదిలో కూర్చున్న మాధురి "ఏం చేయాలి!" అని ఆలోచిస్తోంది. మావయ్య కూడా తనమాట విన్పించుకోవటం లేదు.



# 36

అశ్విని హాస్పటల్నించి యింటికి వచ్చేశాడు. ఉద్యోగంలో జాయిన్ అయాడు. చేతిగాయం ఇంకా పూర్తిగా మానలేదు. రాజారావు తమ్ముడితో కబుర్లు చెప్తూ అడిగాడు.

"అశ్వనీ నీ ఉద్యోగం ఎలా వుంది"

బానే వుందిగానీ పెళ్ళికూతురి ఫొటో మాపించలేదు.

"వాళ్ళివ్వలేదు"

"మరెలా"

"నే వర్ణించి చెప్పనా" కొంటెగా

చూస్తూన్నాడు తమ్ముడివైపు.

"చెప్పు త్వరగా"

"ఆ అమ్మాయి పేరు...ఆ పేరు తర్వాత చెప్తాలే. బియ్యే ఫైనల్ చదువు తోంది. తెల్లగా సన్నగా పొడుగ్గా వుంటుంది. నొక్కుల జుట్టు.పొట్టి జడ. సైకిల్ మీద కాలేజీకి వెళ్ళి వస్తుంది. పేరు..." ఆగిపోయాడు రాజారావు.

అన్నగారు చెప్పేది మొదట ఆ సక్తిగా వింటూ ఆ తర్వాత కనుబొమ్మలు ముడిచి "ఆ అమ్మాయి పేరేమిటి? ఇల్లెక్కడ ? అడిగాడు.

"మన కాలనీకి అటువైపున్న కాలనీలో. పేరు మాధురి. పేరు స్వీట్‌గా వుందికదూ?"

"అన్నయ్యా" పెద్ద కేక పెట్టాడు.

"ఏమిట్రా నీకా అమ్మాయిని చూడాలని వుందా! నావెంట రా చూపిస్తాను"

"అన్నయ్యా... మ- ... ఆ అమ్మాయికి... పెళ్ళి అయిపోయింది" అక్షరం అక్షరం తూచి తూచి అన్నాడు అశ్వని.

"ఏమిటీ! పెళ్ళి అయిన అమ్మాయిని పెళ్ళి చూపులంటూ నాకు చూపించారంటావా. పిచ్చి ముఖమా"

"ఆ అమ్మాయికి పెళ్ళి అయినట్లు వాళ్ళ తల్లిదండ్రులకి తెలియదు"

"అంటే ! గాంధర్వ వివాహమా ! అయినా ఇదంతా నీకెలా తెల్సు ?"

"అన్నయ్యా... మాధురిని పెళ్ళి చేసు కోవాలను కున్నదీ, చేసుకున్నదీ నేనే"

"ఆ... నువ్వు మాకు తెలియకుండా పెళ్ళి చేసుకున్నావా ! ఇది నమ్మమంటావా !"

కొడుకులు ఇద్దరూ ఏదో తీవ్రంగా మాట్లాడటం విని తల్లి కూడా అక్కడికి వచ్చింది. అశ్వని చెప్పింది అంతా విన్నది. ఏమిటీ తన చిన్న కొడుకు ప్రాణానికి ప్రాణంగా పెంచిన చిన్న కొడుకు ప్రతిరోజూ "అమ్మా...అమ్మా" అంటూ ప్రతి చిన్న విషయమూ చెప్పే చిన్న కొడుకు అన్నగారి పెళ్ళి కాకుండా తనకి చెప్పకుండా పెళ్ళి చేసేసుకున్నాడా : ఆవిడకి నోట మాట రావటం లేదు. అశ్వని అన్నకీ, తల్లికీ జరిగిందంతా క్లుప్తంగా చెప్పేశాడు.

"అయితే ఈ విషయం ముందే నాకెందుకు చెప్పలేదు !" కోపంగా అడిగాడు రాజారావు.

"నువ్వు చూస్తూన్న పెళ్ళి కూతురు మాధురే అని నాకు తెలియదు"

"మరి ఆ అమ్మాయి పెళ్ళి చూపులకి యెలా ఒప్పుకుంది!"

"అది నాకు తెలియదు. బహుశా పెద్దవాళ్ళు ఆ అమ్మాయి మాట విన్పించుకుని వుండరు"

"అంటే అర్థం! పట్టి పప్పుసుద్దలాంటి అమ్మాయన్నమాట"

అన్నగారు అప్పుడే పరిహాసంలోకి దిగాడని గ్రహించేశాడు అశ్వని. అందుకే మాట్లాడలేదు.

"చూడూ ఈ విషయంలో ఏదో అనుమానం అన్పించింది నాకు. పెళ్ళి చూపులకి వెళ్ళినప్పుడు మాధురి ముఖంలో సంతోషం లేదు. ఇది గ్రహించాను. బహుశా ఈ పిల్లకి నేను నచ్చలేదేమో

అనుకున్నాను. అసలు నా వైపు ఆసక్తిగా చూడలేదు. కానీ ఆ అమ్మాయి చేతి వేలికి వున్న నీలంరాయి వుంగరం చూశాను. విషయం సగం అర్థమైంది. ఆ తర్వాత నీ చేతి వుంగరం మాయమైంది. ఏమైంది అని అడిగినా నువు చెప్పలేదు. కానీ నీకు ఫ్రెండ్‌ని అంటూ హాస్పటల్‌కి వచ్చిపోయే తాతగారికి గాస్ కొట్టి అసలు విషయం లాగేశాను. చూడు తమ్ముడూ ఇప్పుడు నీ నోటి వెంటే అంతా చెప్పించాను. అమ్మకి కూడా చెప్పలేదు"

తల్లి ఆశ్చర్యంగా వింటోంది. అశ్విని తెల్లముఖం వేశాడు.

"ఒరేయ్ తమ్ముడూ తెలుగు సినిమాల్లో హీరోయిన్‌లాగా ఓ పెట్టె పట్టుకుని యేరైలైనా యెక్కేస్తుందేమో నీ మాధురి. ఇష్టంలేని పెళ్ళి వద్దు అని చెప్పగలిగిన ధైర్యం వుండదుగానీ వంటరిగా రైలు యెక్కే ధైర్యం వాళ్లకి ఎలా వస్తుందో నా కర్థం కాదు. ఇంతకీ నీ హీరోయిన్ అసలు ఇంట్లో వుందో లేదో చూసిరానా?'' నవ్వుతూ అన్నాడు రాజారావుగంభీరంగా వున్న వాతావరణాన్ని తేలిక చేస్తున్నట్లుగా.

అశ్విని వుడికిపోతూ "అంత అవసరమే వస్తే నేనే వెతుక్కు తెచ్చుకుంటాను" అన్నాడు కోపాన్ని మింగేస్తూ.

"ఏడిశావ్!" అంటూ వాకిలివైపు చూశాడు. ఎవరో అమ్మాయి నిలబడి వుంది. రాజా లేచి వెళ్ళాడు. మాధురి. రాజాని అక్కడ చూస్తూనే మాధురి గాభరా పడిపోయింది

"ఇది...యిది...మీ యిల్లా...... నాకు...అశ్వనిగారు కావాలి"

తడబడి పోయింది మాధురి. రాజాకి కాస్సేపు యీ అమ్మాయిని ఏడిపిస్తే బాగుండునన్పించింది. కానీ మాధురి గొంతు వింటూనే అశ్విని చటుక్కున బైటకి వచ్చాడు. రాజా వెనక్కి తప్పుకోక తప్పలేదు.

"మాధురీ...నీ కోసం నేనే రావాలని బయలుదేరుతూన్నాను. ఔను యిలా వచ్చావెందుకూ"

"నాకు...నాకు పెళ్ళి ఖాయం చేసేయాలని...మా వాళ్ళు..." మాధురి చెప్పలేక పోతోంది.

"ఆ విషయం అంతా నాకు తెల్సింది. నీకేం భయం లేదు. ఆ పెళ్ళి కొడుకు మా అన్నయ్యే.నేను అంతా చెప్పేశాను. దిగులు పడకు, లోపలికిరా. అమ్మకీ అన్నయ్యకీ పరిచయం చేస్తాను"

"అం...నాకు భయం వేస్తోంది" ముఖాన పట్టిన చెమటని తుడుచుకుంటూ వెనక్కి పోబోతున్న మాధురికి ధైర్యం చెప్పి చెయిపట్టుకుని లోపలికి తీసుకు వచ్చాడు."అమ్మా...మాధురి నీకు నమస్కారం చేస్తోందమ్మా"

అశ్విని తల్లికిదంతా అయోమయంగా అన్పిస్తోంది. అయినా నమస్కరించే మాధురిని లేవనెత్తి ముఖాన్ని తడిమి చూస్తూ వుంది. అశ్వని తల్లికి తనూ నమస్కారం చేస్తూంటే "ఒరేయ్ నాకు కాదురా! అన్నయ్య దేవుడు, వాడికి నమస్కారం చెయ్యి. మీరిద్దరూ

చెయ్యండి" అంది. అశ్వనీ, మా ధు రీ ఒకేసారి రాజా దగ్గరగా వచ్చారు.

"అరెరే......" రాజా దూరంగా జరుగుతూన్నా అశ్వని లాగి నిలబెట్టి మరీ నమస్కారం చేశాడు. మాధురీ రాజా పాదాలని తాకి కళ్ళకద్దు కుంది.

"నాకు ఏ మ ని ఆశీర్వదించాలో తెలియదమ్మా. ఔను యీ అమ్మాయి వాళ్ళ వాళ్ళకి చెప్పివచ్చిందో చెప్ప కుండా వచ్చిందో ముందు కనుక్కోరా అశ్వనీ. వాళ్ళు పోలీస్ రిపోర్టు యిస్తే ముందు నన్ను అరెస్ట్ చేస్తారు"

మాధురి రాజా ముఖంలోకి చూసి తలవంచుకుంది.

"అమ్మా నీ కోడలు యె లా గూ వచ్చేసిందిగా. ఇంక యిక్కడే వుంచేసు కుందామా!"

"వీల్లేదు. తీసుకువెళ్ళి వాళ్ళ యింటి దగ్గర దింపి రండి. ఆ మూడు ముళ్ళూ వేసి మరి తీసుకొచ్చుకుంటాం అనీ, లగ్నం త్వరగా పెట్టించమనీ చెప్పి రండి. ఇది మర్యాద"

"అమ్మ ఆజ్ఞ విన్నావుగా. అశ్వనీ మాధురిని తీసుకువెళ్ళు!"

"వాడు కాదు. ఈ యింటికి పెద్ద వాడివి, నువ్వు తీసుకువెళ్ళి వాళ్ళకి మాధురిని ఏమీ అనవద్దని చెప్పి రా"

"అమ్మా... నేనా!" ఇంతవరకూ హుషారుగా కబుర్లు చెప్పిన రాజా గుండె పట్టుకున్నాడు.

"తిక్క కుదిరింది. చూడు జాగ్రత్తగా తీసుకువెళ్ళు అన్నయ్యా" అన్నట్లుగా చూశాడు అశ్వని.

"అశ్వనీ ఆటో ఒకటి పిలవరా" అన్నాడు అధికారంగా. అశ్వని వెళ్ళి ఆటో తెచ్చాడు. మా ధు రి కళ్ళతోనే అశ్వని దగ్గర శలవు తీసుకుని అత్త గారికి చెప్పి ఆటోయెక్కి కూర్చుంది. రాజాకూడా యెక్కి వదిగి కూర్చున్న మాధురివైపు ఓసారిచూసి 'సారీ' అన్నాడు.

తల్లికి చెప్పకుండా ఇల్లు దాటేప్పుడు యింక ఈ ఇంట్లోకి రాగలనో లేదో అను కుంది. వీళ్ళు ఎంత మంచివాళ్ళు. తను నిజంగా అదృష్టవంతురాలు

రాజాకి కృతజ్ఞతలు చెప్పాలని ప్రయత్నిస్తూ అతనివైపు చూసింది. రాజా అచ్చంగా అశ్వనిలానే వున్నాడు. కానీ చాలా చిలిపిగా మాట్లాడటం అలవాటులా వుంది. మౌనంగా వుండిపోయాడెందుకో!

మాధురి ఆలోచనలో వుండగానే యిల్లు దగ్గరపడడం గ్రహించింది.

"మీరు...మీరు...నన్ను క్షమిం... చాలి" ఎలాగో అంది.

"ఏం తప్పు చేశారని ?" గా లి కి క్రాపు చెదరిపోతూంటే ఎడంచేతితో సర్దుకుంటూ ముందుకేచూస్తూ అడిగాడు.

"మీ సంస్కారానికీ, మీ మంచి మన సుకీ..." ఇంకేం చెప్పాలో తెలియక ఆగిపోయింది మాధురి. ఇల్లు కాస్త దూరంలో వుండగానే ఆపేసి ది గా డు రాజా. మాధురి అర్థంకానట్లు చూసింది.

"మీరు ఇక్కడే ఆటోలోకూర్చోండి. అక్కడి వాతావరణం యెలా వుందో చూసి యిప్పుడే వస్తాను"

"వద్దు...మీరు వెళ్ళద్దు"

రాజా తీక్షణంగా చూశాడు. ఆటో దిగబోతూన్న మాధురి చప్పున కూర్చుండిపోయింది. రాజా చకచకా నడిచాడు. అహల్య రాజాను చూడగానే గాభరా పడిపోయింది. ఇంట్లో తనుతప్ప మరెవరూలేరు. మాధురి కన్పించలేదని యెక్కడికి వెళ్ళిందో తెలియక వెతకటానికి జనార్దన్, మేనమామా కలిసి వెళ్ళారు. అహల్య కూతురిమీద కారాలూ మిరియాలూ నూరుతూ ఇంట్లోనించి బైటకీ, బైటనించి యింట్లోకీ తిరుగుతూ రాజాని చూసింది.

"రండి బాబూ...రండి...కూర్చోండి" అంది కుర్చీ చూపిస్తూ.

"నమస్కారం అత్తగారూ! అన్నట్లు మా అమ్మగారు చెప్పమన్న కబురు చెప్పాలని వచ్చాను. మాధురి నాన్నగారు ఏదో పనిమీద ఊరువెళ్ళారని చెప్పారుగా. ఆయన వచ్చారా" కుర్చీలో స్థిమితంగా కూర్చుని అడుగుతూంటే అహల్య నోట్లోనించి మాటే రావటంలేదు.

"ఆయన . . . యింకా . . . రాలేదు. వచ్చేస్తారు..."

"అలాగా! అయితే నేను రేపు మళ్ళీ వస్తాను. మరో చిన్న విషయం. నా స్నేహితుడు ఒకతను అనుకోకుండా ఊరు నించి వచ్చాడు. ఇవాళే వెళ్ళిపోతున్నాడు. మాధురిని చూడాలని కుతూహల పడుతున్నాడు. మీ అమ్మాయిని ఒక్కసారి నాతో పంపితే అతనికి చూపించి తీసుకువచ్చి దింపేస్తాను. ఇందుకు మీకేం అభ్యంతరం వుండదు అనుకుంటాను."

అహల్య ముఖంలో కత్తి వాటుకి నెత్తురు చుక్కలేదు. మాటి మాటికీ వీధి వాకిలివైపు చూస్తూ రాజాకి ఏదో చెప్పాలని అనుకుంది. కానీ చెప్పలేక సతమతమైపోతూ "మంచి నీళ్ళు కావాలా" లోపలికి వెళ్ళబోయింది.

"అక్కర్లేదండీ. త్వరగా మాధురిని పంపండి"

"కాస్త...కాఫీ...తెస్తాను"

"అహ...ఇప్పుడే త్రాగివచ్చాను"

"ఫర్లేదు...కాస్త...తెస్తాను"

"మీ అమ్మాయి...మాట"

అహల్య జవాబు చెప్పకుండానే వంటగదిలోకి వెళ్ళి "భగవాన్ ..." తల తిరిగి పోతున్నట్లు అయితే గోడని ఆనుకుని నిల్చుండిపోయింది. అంతలోనే తెలివి తెచ్చుకుని చటుక్కున కాఫీ కలిపి కప్పులో పోసి రాజా వున్న గదిలోకి రాబోతుండగా మాధురి పెరటితోవగుండా వచ్చి రాజాకీ, తల్లికీ జరిగిన మాటలన్నీ వినేసి చప్పున తల్లి చేతిలోని కాఫీ కప్పు అందుకుని "నేయిస్తానమ్మా" అంది. అహల్యకి కూతురు సమయానికి వచ్చి తన పరువు కాపాడింది అన్న సంతోషంతోబాటు చెప్పకుండా ఎక్కడికో వెళ్ళి తనని నరక బాధ పెట్టిందని కోపమూ వచ్చింది. తనే కాఫీ ఇస్తానంటూ కప్పు తీసుకువెళ్ళినందుకు ఆశ్చర్యమూ వేస్తోంది. అసలీ పెళ్ళి వద్దు అని గొడవ చేస్తున్న మాధురి ఇంత హఠాత్తుగా ఇంతలా ఎలా మారిపోయింది అని విస్తుపోయింది. ఏది ఏమైనా కాబోయే అల్లుడి దగ్గర పరువు నిల్చింది అన్న తృప్తితో ఆమె ముఖం

లోకి కాంతి వచ్చింది.

"కాఫీ తీసుకోండి"

రాజా వులిక్కిపడి తలెత్తి చూశాడు. మాధురి కప్పూ సాసరూ అందిస్తోంది. "ఈ అమ్మాయి దొడ్డి దారిన ఇంట్లో దూరి అమ్మ పక్కన చేరిందా!" అను కున్నాడు ఇంక లాభం లేదని రెండు గుక్కల్లో కాఫీ తాగేసి లేచాడు.

"అత్తగారూ పోసివ్వండి మాధురిని మా ఫ్రెండ్ మరోసారి చూస్తాడు. మరి నేవెళ్ళి వస్తాను"

జనార్దన్ రామ్మూర్తి మాధురి కోసం తిరిగి తిరిగి కన్పించక అల్సిపోయి కాళ్ళీడ్చుకుంటూ ఇల్లు చేరారు. రాజాని చూసి కొయ్యబొమ్మలా అయిపోయారు.

"మీ...మీరు.. వచ్చారా ... ఎంత సేపైందీ ... వచ్చి" తడబడుతూ అడి గాడు మాధురి మేనమామ.

ఆయన అవస్థకి జాలేసింది రాజాకి.

"చూడండి మాధురి ఎక్కడికీ వెళ్ళ లేదు. మా ఇంటికే వచ్చింది. మీరు గాభరా పడకండి ఆ అమ్మాయిని జాగ్ర త్తగా తీసుకువచ్చి వాళ్ళ అమ్మగార్కి అప్పగించాను" అని ఆగాడు రాజా.

"ఆఁ", నోరు తెరిచారు ఇద్దరూ.

"మీరూ మేమూ ఒకటి అవబోతు న్నాం. ఇంక ముసుగులో గుద్దులాట వద్దు. కనుక నేనే జరగవల్సింది చెప్తూ న్నాను. పెళ్ళికి లగ్నం పెట్టించండి. మేం సిద్ధంగా వున్నాం. అయితే చిన్న సవరణ"

అహల్య మళ్ళీ గాభరా పడింది. ఏమిటి అన్నట్లు చూస్తోంది. "మాధురి మా ఇంటి కోడలిగానే వస్తుంది. అయితే పెద్ద కోడలుగా కాక చిన్న కోడలుగా చేసుకుంటున్నాం. ఈ విషయంలో పెద్దల మైన మన ఇష్టం విషయం ఎలా వున్నా వాళ్ళు ఇద్దరూ మనసులు ఇచ్చి పుచ్చేసు కున్నారు కనుక ఇంక మనం అక్షింతలు వెయ్యటంతప్ప ఇంకేం చేయలేం.అయినా ఇది మనందరికీ సంతోషాన్నే కల్గిస్తుంది. మా ఇంటికి నేనే పెద్దవాడిని గనుక నేనే మాట్లాడ వల్సి వచ్చింది. వస్తాను. మాధురి నాన్నగార్ని ఓసారి మా అమ్మ గారు పంపమన్నారు." రాజా అందరికీ నమస్కారం చేసి మాధురి ముఖంలోకి చూశాడు. మాధురి చేతులు జోడిం చింది.

అహల్యకి నోట్లోనించి మాటలు రావటం లేదు. అందరూ శిలావిగ్రహాల్లా నిల్చిపోయారు. రాజా టకటకానడిచి ఆగి వున్న ఆటో యెక్కేసి వెళ్ళి పోయాడు.

"అబ్బ! రాజా ఎంత విజ్ఞతగా ప్రవ ర్తించాడు. మనందరినీ ఒక వూపు వూపిమరీ వెళ్ళి పోయాడు.

మేనమామ ప్రశంసలు కురిపిస్తు న్నాడు. అహల్య కనపడని దేవుడికి నమస్కారాలు చేస్తోంది. మాధురి తల వంచుకుని నిల్చుండి పోయింది.

"ఏమ్మా... నీ మనస్సులో విషయం ముందే మాకు చెప్పివుంటే ఇలా జరిగి వుండేదికాదుగా"

"అమ్మకి అసలే నా మీద కోపంగా వుందనీ, ఇప్పుడిదంతా చేప్తే మీరు విన్పించు కోరనీ భయపడ్డాను మామయ్యా. నా వల్ల మీ అందరికీ బాధ

కల్గింది. నన్ను క్షమించు మామయ్యా"
"ఈ మాట అడగ వల్సింది నన్ను కాదమ్మా మీ అమ్మని"
"అమ్మా..." తల్లి దగ్గరికి నడిచింది మాధురి. అహల్యా కూతురిని అమాంతం కౌగలించుకుంది.



# 37

మాధురికి పెళ్ళిలగ్నం పెట్టుకున్నారు.
పెళ్ళి నాలుగే రోజులుంది. రామ్మూర్తి తన వూరికి వెళ్ళి డబ్బు తెచ్చాడు. పెళ్ళి పనుల్లు చురుకుగా జరుగుతూన్నాయి. నాంచారమ్మా నాంచారయ్యా కాక సైకిల్ తాతగారు కూడా వచ్చి పనుల్లో సాయపడుతూన్నారు. రామ్మూర్తి స్వంత కూతురు పెళ్ళిలా బాధ్యత అంతా తనే వహిస్తూన్నాడు.

నాంచారయ్యా, రామ్మూర్తీ ధనంజయరావు కోసం ఉదయం వెళ్ళిన వాళ్ళు పన్నెండు గంటలు దాటినా రాలేదు. అహల్యా మనసు మనస్సులో లేదు. ఏదో భయం వేధిస్తోంది. వంటపని పూర్తి చేసి అన్నగారి రాక కోసం యెదురు చూస్తూ కూర్చుంది. వాకిట్లో టాక్సీ వచ్చి ఆగింది. అందులోనించి నాంచారయ్యా,రామ్మూర్తిదిగి ధనంజయరావుని పట్టుకుని నడిపించుకుని లోపలికి తీసుకువస్తూన్నారు. ధనంజయరావు కుడిచేతికి కట్టుంది. నుదురుకీ, బుగ్గలకీ ప్లాస్టర్ వుంది. గడ్డం మాసి వుంది. కళ్ళు లోతుకుపోయి వున్నాయి. ముఖం తెల్లగా పాలిపోయినట్లు వుంది. నిల్చునే ఓపికక్కూడా లేనివాడిలా తూలి పోతూన్నాడు.
"మాధురీ త్వరగా మంచం వాల్చి దిండు వెయ్యి" రామ్మూర్తి కేక పెట్టాడు.
మాధురి మంచం వాల్చింది. దిండు వేసింది. ధనంజయరావుని మంచంమీద పడుకోబెట్టారు. అహల్యా స్థాణువులా నిల్చుని భర్త వాలకం చూస్తోంది.
"నాన్నా...నాన్నా" మధు దగ్గరగా వచ్చాడు. ధనంజయరావు కళ్ళు తెరిచి చప్పున మధుని ఎడంచేత్తో దగ్గరగా లాక్కుని గుండెకి హత్తుకున్నాడు.
"నాన్నా నాకు జ్వరంవచ్చినా చూసేటందుకు రాలేదేం నాన్నా! నాకప్పుడు చాలా భయంవేసింది నాన్నా! చచ్చి పోతానని అనుకున్నా"
ధనంజయరావు ముఖంలోకి కాస్త కాంతివచ్చింది. కన్నీళ్ళు జలజలా రాలుతూన్నాయి.
"నాన్నా! నువ్వెందుకు ఏడుస్తూన్నావ్?" మధు తెల్లబోయి చూస్తూ అడిగాడు.
"అహల్యా ఇలారామ్మా" రామ్మూర్తి పెరట్లోకివెళ్ళి చెల్లెలిని పిలిచాడు.
"అన్నయ్యా పిలిచావా" అహల్యా మెల్లగా అడిగింది రామ్మూర్తి తలెత్తి చెల్లెలి ముఖంలోకి చూశాడు.
"అహల్యా నువ్వు అదృష్టవంతు

రాలివి. నీ భర్త చేసినతప్పు తెల్సుకుని పశ్చాత్తాపపడుతూన్నాడు''

అహల్య! తలెత్తలేదు. జవాబు చెప్ప లేదు. మనస్సు ఎప్పుడో పాషాణం అయింది. తనిప్పుడు కేవలం యాంత్రికంగా విధి నిర్వహణ చేస్తోంది అంతే.

"ధనంజయరావు మీద హేమరాణికి మోజుతీరిందిట. మరోకతనుతోచనువుగా తిరుగుతోందిట. ఇతనది భరించలేక తగూపడ్డాడట.

'నాయిష్టంవచ్చిన వాళ్ళతో తిరుగుతాను నువ్వెవ్వరు అడగటానికి. తాళి కట్టిన మొగుడివా' అందిట. ఇతనికి కోపంవచ్చి కొట్టబోయాడట. ఆమెకొత్త ప్రియుడు అడ్డంవచ్చాడట. ఇద్దరికీ మాటామాటా పెరిగి చేతులూ చేతులూ కల్సినాయి. ఫలితంయితన్ని చూశావుగా. హేమరాణి నౌకర్లు బైటకి గెంటేస్తే యెవరో దయతలిచి హాస్పిటల్ కి చేర్చారట. హాస్పటల్లో దిక్కూమొక్కూలేక నరకం అనుభవించాడు. ఇంక నువ్వేం అనకమ్మా"

"అన్నయ్యా!"

"నీ ఆత్మాభిమానం నా కు తె ల్సు. నువ్వు యిది భరించలేవనీతెల్సు. కానీ ఒక్కమాట. అహల్యా! క్షమించటంలో వున్న ఔన్నత్యం, ఆనందం నీకే ముందు ముందు తెలుస్తుంది. వెళ్ళమ్మా అతనికి యేంకావాలో చూడు. ఆదరంగా పలకరించు'' రామ్మూర్తి మెల్లగా అక్కడి నించి బైటకివెళ్ళిపోయాడు.నాంచారయ్యే భోజనంచేసి వస్తానని వెళ్ళిపోయాడు. మాధురి వంటగదిలోకెళ్ళి మేనమామకి, తమ్ముళ్ళకీ వడ్డించింది. అహల్య భర్తకి భోజనం తీసుకుని మంచం దగ్గరగా వచ్చింది. ధనంజయరావు మెల్లగా లేచి కూర్చున్నాడు. భార్యముఖంలోకిసూటిగా చూడలేకపోతున్నాడు.

"అహల్యా ! నన్నుక్షమించు. ఈ మాటనిన్ను అడిగే అర్హతకూడా నాకు లేదు. కానీ...కానీ...అడుగుతూన్నాను.''

అహల్య తలయెత్తలేదు.

"అహల్యా డబ్బుపుష్కలంగా సంపాదించి నిన్నూ పిల్లలనీ సుఖపెట్టాలనే తపనతో ఈయింటికి దూరంఅయ్యాను.కానీ ఆడబ్బు సంపాదించటం చేతకాక ఆ అన్వేషణలో దొరికిన మరోసుఖానికి దాసుడనై అసలు ధ్యేయాన్ని విస్మరించాను. మానవత్వాన్ని పోగొట్టుకున్నాను. కాయితంపూవులోని తళుకుబెళుకుకి మతి పోగొట్టుకున్నాను. యదార్థం బట్టబయలు అయినతర్వాతకానీ కళ్ళకిపట్టిన పసర్లు దిగలేదు. డబ్బులో,ఆడబ్బిచ్చే సుఖంలో స్వర్గం వుంది అని భ్రమించాను. ఈ స్వర్గంవిలువతెలియలేదు. స్వర్గం ఎక్కడుందోఅని వెర్రివాడిలా యెండమావుల వెంట పరుగులెత్తిన నాకు సరైన శిక్షే పడింది. అహల్యా నన్నుక్షమించు. ఈ స్వర్గంలో కాస్తనాకు మళ్ళీ చోటుయివ్వు అహల్యా!''

అహల్య కళ్ళలోనీళ్ళు సుళ్ళు తిరుగుతూన్నాయి. "అహల్యా" మెల్లగా ఎడంచేతో ఆమె తలయెత్తిచూశాడు. ధనంజయరావు ముఖంలో సంతోషం, కళ్ళలో నీళ్ళు.



# గుట్టు

"ప్రకాష్ ఎవరండీ" అన్నాడు ప్యూను ఇంటర్వ్యూకు వచ్చినవాళ్ళని ఉద్దేశించి. 'నేనే' అంటూ లేచాడు ఓ కుర్రాడు. అతను 'స్టైల్'గా ఉన్నాడు. ఖరీదైన దుస్తులు వేసుకొని ఈ ఉద్యోగం నాకు రాకుండా ఎక్కడికి పోతుందన్నట్లు ధైర్యంగా వెళ్ళాడు లోపలికి.

ఇంటర్వ్యూ బాగానే జరిగింది. అడిగిన అన్ని ప్రశ్నలకూ సరైన సమాధానాలే చెప్పాడు ప్రకాష్. "మీకు ఉద్యోగం ఇస్తే ఎన్ని రోజుల్లో చేరగలరు?" అడిగాడు ఫ్యాక్టరీ యజమాని. "జీతం నచ్చితే రేపే జాయినవుతా" అన్నాడు ప్రకాష్.

"ఎంత కావాలి ?" మేనేజిమెంటు ప్రశ్న.

"కనీసం వెయ్యి" ప్రకాష్ జవాబు.

"మా ఫ్యాక్టరీలో ఈ ఉద్యోగానికి 6 వందలకంటె ఎక్కువ ఇవ్వట్లేదు" యజమాని అన్నాడు.

"మా మావయ్యగారి ఫ్యాక్టరీలో ఇదే రకం ఉద్యోగానికి జీతం 12 వందలు ఇస్తారు" అన్నాడు ప్రకాష్ తనకి ఈ వ్యవహారాలు తెల్సును అన్నట్లు.

"అంతేకాదు, వారానికి ఒకటిన్నర రోజులు సెలవులు, అవిగాక గవర్నమెంటు ప్రకటించే సెలవులు అన్నీ ఇస్తారు. ప్రతీ సంవత్సరం బోనసు ఉంటుంది. పండుగ అడ్వాన్సులు, ఓవర్ టైములులాంటి సౌకర్యాలు ఇంకెన్నో ఉన్నాయి" అని కూడా చెప్పాడు ప్రకాష్.

"మరైతే మీ మావయ్యాగారి ఫ్యాక్టరీలోనే చేరకపోయారా?" అడిగాడు యజమాని.




"ఈ మధ్యనే నష్టం వచ్చిందని ఫ్యాక్టరీని అమ్మేశారు, లేకపోతే మీదాకా ఎందుకు వస్తాను" అన్నాడు ప్రకాష్ అమాయకంగా.

"మేము మా కంపెనీని అమ్ముకోదల్చుకోలేదు, మీకు ఇష్టమైతే మేం ఇచ్చే జీతానికి పనిచేయండి, లేకపోతే లేదు" అన్నాడు మేనేజరు గుట్టుగా.

—వల్లి



# ముద్దు

క్లాసులో సైన్సు టీచరు ఆరోగ్యాన్ని గురించి చెప్తున్నది. పిల్లలంతా శ్రద్ధగా వింటున్నారు. "చూడండి పిల్లలూ! మనం కుక్కల్నీ, పిల్లుల్నీ, చిలకల్నీ, పావురాల్నీ—ఇలా ఎన్నో జంతువుల్ని ఇంట్లో పెంచుతుంటాం. వాటిని ఎంతో ప్రేమగా పెంచవచ్చు. కావల్సిన సౌకర్యాలన్నీ వాటికీ ఏర్పాటు చెయ్యవచ్చు. మంచి ఆహారం పెట్టవచ్చు. అయితే, వాటిని మనం ముద్దు పెట్టుకో కూడదు. అసలది మంచి పద్ధతికాదన్న మాట. అది చాలా అనారోగ్యం. మీరెవరైనా ఈ విషయంలో ఏమైనా చెప్ప గలరా" అని అడిగింది.

వెంటనే లలిత లేచి "నేను చెప్ప గలను టీచర్" అన్నది. "వెరీగుడ్, అయితే చెప్పు" అడిగింది టీచరు. లలిత చెప్పింది. "మా అత్తయ్య ఒక కుక్కని పెంచేది. అయితే దాన్ని ముద్దు కూడా పెట్టుకుంటుండేది" "అలాగా! చూశారా లలిత ఎలా చక్కగా చెప్తున్నదో" అని మిగతాపిల్లలతో అని "అయితేఏమయిందో చెప్పుమరి" అని అడిగింది.

"కుక్క చచ్చిపోయింది టీచర్"

—రవి కాంత్



# వేటగాడు

దిలీప్‌కి పులుల్ని వేటాడాలని బలేసరదా. తుపాకిని గురి తప్పకుండా కాల్చడం నేర్చుకున్నాడు. వేటాడ్డానికి కేవలం గురి ఒక్కటే ప్రధానం కాదు గదా. ఇంకా ఎన్నో మెలకువలు తెలుసుకోవాల్సి వుంటుంది. దిలీప్ మామయ్య బాగా అనుభవమున్న వేటగాడు. అందుకని దిలీప్ ఆయన్ని అడిగాడు పులి వేట గురించి, "చూడు దిలీప్, పులి వేట రాత్రిళ్ళు చెయ్యాలి. చీకట్లో పులి కళ్ళు మెరుస్తుంటాయ్. సరిగ్గా గురి చూసి

ఆ రెండు కళ్ళ మధ్య తుపాకి పేల్చు. అంతే,కపాల మోక్షమైపోతుంది. ఓ.కె." అని సలహా యిచ్చాడు మామయ్య.

దిలీప్ హుషారుగా ఆ రాత్రి అడవిలో పులి వేటకెళ్ళాడు. మర్నాడు ఉదయం దిలీప్‌ని మామయ్య అడిగాడు ఎన్ని పులుల్ని తెచ్చావని. "ఒక్కటీ తేలేదు మామయ్యా ఉత్త చేతుల్తో రావల్సొచ్చింది" అన్నాడు దిలీప్ నిరాశగా.

"వ్వాట్ మైబాయ్! నేంజెప్పినట్లు సరిగ్గా రెండు కళ్ళమధ్య గురిచూసి కొట్టావా?" అడిగాడు మామయ్య. "ఆ ... సరిగ్గా అలాగే చేశాను. కానీ పులులు ఈమధ్య తెలివి మీరినై. వేటగాళ్ళ జిత్తులన్నీ వాటికి బాగా తెలిసి పోయినై. అవి ఒంటరిగా తిరక్కుండా, జంటలు జంటలుగా తిరుగుతూ, ఒక కన్ను మూసి మరీ తిరుగుతున్నై" చెప్పాడు దిలీప్ నీరసంగా.

**-మమత**

# అర్హత

**మం**గపతి పొట్టిగా, చాలా సన్నగా బలహీనంగా వుంటాడు. వంగిపోయి నడుస్తాడు. చూసేవాళ్ళకి రోగిష్టిలా కనిపిస్తాడు. మంగపతి ఒకసారి వాచ్‌మన్ ఉద్యోగానికి దరఖాస్తు పెట్టాడు. పిలుపు వచ్చింది. ఫ్యాక్టరీ యజమాని మంగపతి ఆకారం చూసి "మాకు కావల్సిన వాచ్‌మన్ రాత్రిపూట నిద్ర పోకుండా, విశ్రాంతి తీసుకోకుండా,



ప్రతిక్షణం జాగ్రత్తగా వుండాలి. పగటి పూటైనా, నిద్రపోతున్నప్పుడు ఒక కన్నుతెరిచి అంతా గమనిస్తూ వుండేవాడు కావాలి. ఇంకా, ఏమాత్రం చిన్న అలికిడైనా వినగలిగే శక్తి వుండాలి. తనచుట్టూ వున్న వాళ్ళంతా దుర్మార్గులే అనే ఉద్దేశ్యంతో, ఎప్పుడూ వాళ్ళ మాటల్ని వింటూ, వాళ్ళ ప్రతి కదలికనీ గమనించేవాడై వుండాలి. అంతేగాకుండా, బాగా ఒడ్డూపొడుగూ వుండి, పొగరుమోతై, చావగొట్టగలిగే భయంకరమైన స్వభావం గలవాడు కావాలి. ఒక్కముక్కలో చెప్పాలంటే మా వాచ్‌మన్, కదిలిస్తే చాలు మీదపడి కొట్టే రాక్షసుడై వుండాలన్న మాట అర్థమయిందా" అన్నాడు.

మంగపతి తాపీగా "అలాగే సార్ ! అయితే నేవెళ్ళొస్తా ఇంటికెళ్ళి మా ఆవిణ్ణి పంపిస్తాను"అంటూ వెళ్ళిపోయాడు.

**—అరుంధతి**

# వయసు

రోహిణి పేరు ప్రఖ్యాతులున్న గొప్ప సినిమా తార. ఆమె నటించిన ప్రతి చిత్రం విజయవంతమవుతుంది. చిత్రనిర్మాణంలో తలలు పండిపోయిన పాత నిర్మాతల దగ్గర నుంచి కొత్తగా సినిమా తీయ పచ్చుకున్న కుర్ర నిర్మాతల వరకూ అందరూ తమ సినిమాల్లో నాయికగా రోహిణినే బుక్ చేస్తున్నారు.

ఎన్ని సంవత్సరాలు గడుస్తున్నా ఆమెలో చలాకీ తనం తగ్గలేదు. గ్లామర్ పాడవలేదు. నటనలో వెరైటీ లేకపోయినా అటు ప్రేక్షకులు ఇటు చిత్ర పరిశ్రమ కూడా రోహిణి పట్ల మోజు చూపిస్తూనే ఉన్నారు.

రోహిణి పుట్టిన రోజు వేడుకలు ఘనంగా చేసుకుంటుంది ప్రతియేటా. ఈసారి కూడా ప్రయత్నాలు ఆడంబరంగానూ, ఆమె హోదాకు తగినట్లుగానే ఉన్నాయి. పత్రికా విలేఖరులను, చిత్ర రంగంలోని పెద్దలనీ, హితులనీ, సన్నిహితులనీ అందర్నీ పార్టీకి ఆహ్వానించించిందామె.

తతంగం అంతా పూర్తయింది- ఇంతలో ఓ కుర్ర విలేకరి లేచి "రోహిణి గారూ, మీరు ఏమీ అనుకోనంటే ఓ ప్రశ్న అడుగుతాను?" అన్నాడు.

"అడగండి" అంది ఠీవిగా.

"మీ వయసెంత?" అడిగాడు అతను, రోహిణి ఎలాగూ చెప్పదులే అనుకొని.

"ఇరవై ఆరు" అంది రోహిణి నిజంగా నిజం చెప్తున్నట్లు.

"అదేమిటీ,మీరు ఫీల్డుకు వచ్చే 20 సంవత్సరాలు దాటుతోందికదా!" అన్నాడు కుర్ర రిపోర్టరు.




ఆ సంగతి అలా వుంచండి, పెళ్ళయ్యే సరికి నావయస్సు 13 సంవత్సరాలు, అప్పుడు నా భర్తకి 30 ఏళ్లు, ఇప్పుడు ఆయన వయస్సు దానికి రెట్టింపు. ఆ లెక్క ప్రకారం నా కిప్పుడు 26 ఏళ్లు గదాండీ అంది రోహిణి.

— అహిరణి

# ఒక్క ఓడోమాస్ మాత్రమే ఖచ్చితంగా దోమలబారినుండి 2 విధాలుగా కాపాడుతుంది...

## మీరు రాత్రంతా హాయిగా నిద్రపోయేందుకు తోడ్పడుతుంది.

ఓడోమాస్ మరే యితర దోమల నివారిణీ సమకూర్చని రీతిలో రక్షణ సమకూరుస్తుంది:



దీని వాసన దోమలను దూరంగా ఉంచుతుంది.



దీనిలోగల ప్రత్యేకమైన మూలపదార్థం దోమల బారి నుండి మీ చర్మాన్ని కవచంగా కాపాడుతుంది...రాత్రంతా.

ఇక, ఓడోమాస్ భారతదేశంలో అత్యధికంగా అమ్మబడుతున్న దోమల నివారిణీ అంటే ఆశ్చర్యమేముంటుంది మరి!

దోమల బాధకు గురికాకండి—

**ఓడోమాస్**

అందుబాటులో ఉంచుకోండి!




CHAITRA-BLS-86 TEL

# నవలాకారులకు ఆహ్వానం

జాతి జీవిత సమగ్ర చిత్రాన్ని విభిన్న కోణాలనుండి దర్శించి పాఠకులకు దర్శనీయం చేయగల ఉత్తమ నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర' లో అచ్చులో 100 పేజీలుండాలి. ప్రచురణకై ఎన్నిక చేసిన నవలను అవసరాన్ని బట్టి కుదించ వలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలు పంపాలి. ఎన్నిక కాని నవలల వ్రాత ప్రతులను తిప్పి పంపేందుకు తగిన పోస్టేజీ రచనతోపాటే జతపర్చని పక్షంలోనూ, పోస్టులో పోయినా వ్రాతప్రతుల విషయంలో సంపాదకుల బాధ్యత ఉండదు.

'చతుర'లో ప్రచురణకై ఎన్నిక చేసిన నవలలకు పారితోషికం రు : 1000/- నుండి రు : 2000/- వరకూ ఉండగలదు.

# పాఠకులకు మనవి

'చతుర' తొలి సంచికను సంక్రాంతి కానుకగా ముందుగానే విడుదల చేయటం వలన 'చతుర' ప్రతినెలా 15 రోజులు ముందుగానే వెలువడుతుందని పాఠకులు భావించినట్లు మాకు అందిన లేఖల వలన తెలుస్తున్నది. 'చతుర' ఏ నెల సంచిక ఆ నెల 1వ తేదీకి మాత్రమే పాఠకులకు అందుబాటులోకి రాగలదని గుర్తించగోరుతున్నాం.

చతుర

ఈనాడు కాంపౌండ్
సోమాజిగూడ
హైదరాబాద్–500004

Edited, Printed and Published by Ramoji Rao Ch for Vasundhara Publications Printed at Colorama Offset Printers, Hyderabad. Office Address : CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004

